శ్రీః

మహాకవిశ్రీకాళిదాసవిరచితమ్

# కుమారసమ్భవమహాకావ్యమ్

రామోరావిరచిత **మృణాళినీవ్యాఖ్యా** సహితమ్

వల్లభదేవవిరచితయా పఞ్జికయా సంస్కృతవ్యాఖ్యయా చ సముల్లసితమ్

## తృతీయః సర్గః



**రావి మోహనరావు M.Sc., M.A. (Sanskrit)**
లెక్చరర్
4-103, I.L.T.D. Colony Extn., Kothapet, CHIRALA - 523157



శ్రీః
మహాకవిశ్రీకాళిదాసవిరచితమ్
కుమారసమ్భవమహాకావ్యమ్
రామోరావిరచితమృణాళినీవ్యాఖ్యా సహితమ్
వల్లభదేవవిరచితయా పఞ్జికయా సంస్కృతవ్యాఖ్యయా చ సముల్లసితమ్
తృతీయః సర్గః

ప్రథమముద్రణ : శంకరజయంతి శ్రీఖరనామసంవత్సర వైశాఖశుద్ధపంచమి.
ది.**08-05-2011**
ప్రతులు : **500**
పేజీలు : **240**
వెల రూ. : **120/-**


Lecturer, V.R.S. & Y.R.N. College, Chirala - 523 157

**Residence:**
4-103, I.L.T.D. Colony Extn.,
Kothapet, CHIRALA - 523 157
Cell : **94401 15411**

D.T.P.:-
**J.RAJA**
Ganesh Graphics,
CHIRALA.
Cell : **9848390564**

Printed at:-
**KARSHAK ART PRINTERS,**
HYDERABAD



# ఆమోదము

శ్రీ 'రామోరా' పేరుతో ౘ్రసిద్ధులగు శ్రీ రావి మోహన రావు గారు మృణాళినీ వ్యాఖ్యతో ౘ్రకటించుచున్న కుమారసంభవమును జదివి యమందానందము నొందితిని.

సంస్కృతసాహిత్యచరిత్రలో శ్రీవాల్మీకి - వ్యాసుల పిమ్మట నంతటి స్థానము నలంకరించిన మహాకవి కాళిదాసు. అందువల్లనే నన్నెచోడుఁడు కుమార సంభవములో-

**కం॥ భాసురమతి వాల్మీకి**
**వ్యాసాదులు చనిన జగతి వరకవితాసిం**
**హాసనమెక్కి కవీంద్రుల**
**దాసులఁగా నేలెఁ గాళిదాసుఁడు పేర్మిన్.** (కుమా. 1-19)

అని స్తుతించినాఁడు. సంస్కృతవాఙ్మయములోఁ గాళిదాసు పేరుతో ననేక గ్రంథములు లభించుచున్నవి. ఇవి యన్నియు నాదికాళిదాసు రచించినవి గావు. (1) రఘువంశము, (2) కుమారసంభవము, (3) మేఘసందేశము నను మూడు కావ్యములు, (1) అభిజ్ఞానశాకుంతలము, (2) విక్రమోర్వశీయము, (3)



మాళవికాగ్నిమిత్రము నను మూఁడు నాటకములు నాదికాళిదాస రచనలుగాఁ బెక్కు మంది విమర్శకు లంగీకరించినారు. ఋతుసంహారము కూడఁ గాళిదాసు బాల్యరచన మని పండితుల యభిప్రాయము. వీనిలో రఘువంశము, అభిజ్ఞాన శాకుంతలము, మిక్కిలి ప్రౌఢమైనవి. రఘు-కుమార-మేఘ కావ్యములు కాళిదాసత్రయముగాఁ బ్రచురప్రచారము గాంచినవి. ఈ కావ్యత్రయము, భారవి కిరాతార్జునీయము, మాఘుని శిశుపాల వధము **పంచకావ్యము**లని పేరుగాంచినవి. కొందఱు కాళిదాసత్రయమును 'లఘుత్రయి' యని, భారవి-మాఘ-శ్రీహర్ష (నైషధము) కావ్యములను 'బృహత్త్రయి' యని వ్యవహరించుచున్నారు. వ్యాఖ్యాతృ చక్రవర్తి యగు మల్లినాథమహోపాధ్యాయుఁడీ షట్కావ్యములకు, భట్టికావ్యమునకు నద్దములవంటి వ్యాఖ్యల ననుగ్రహించినాఁడు. ఈ సప్తకావ్యములను సమగ్రముగాఁ బఠించిన వారికి సంస్కృతభాష యంతయుఁ గరతలామలక మగును. సంస్కృతము నభ్యసించు విద్యార్థులు 'స రాజ్యం గురుణా దత్తమ్' అని రఘువంశముతో సాహిత్యపారమును మొదలు పెట్టుచున్నారు.

కాళిదాసత్రయములోఁ గుమారసంభవమునందే కావ్యకళ యెక్కువగాఁ దొణికిస లాడుచున్నది. 'అస్తి కశ్చి ద్వా గ్విశేషః' అని పరంపరగా వచ్చుచున్న యా భాణకము ననుసరించియు,

**శ్లో॥ అస్త్యుత్తరస్యాం వాగర్థౌ కశ్చిత్కాంతేత్యుదాహృతిః।**
**కాళిదాసత్రయే జ్ఞేయా శుభయోర్గణవర్ణయోః॥**

అను చమత్కారచంద్రికాశ్లోకమును బట్టియుఁ గాళిదాసత్రయములోఁ గుమారసంభవమే మొదటి కావ్యమని నిర్ణయింపవచ్చును.

**శ్లో॥ ఏష తే రామ! గంగాయా విస్తరోఽభిహితో మయా।**
**కుమారసంభవశ్చైవ ధన్యః పుణ్యస్తథైవ చ॥**

(వాల్మీ-బాల 37-32)

అను శ్రీమద్రామాయణ శ్లోకమును మనస్సులో నుంచుకొని కవి యీ కావ్యమునకుఁ గుమారసంభవ మని పేరు పెట్టినాఁడు. కుమారసంభవ మనఁగా శ్రీ కుమారస్వామి యవతారము.

కుమారసంభవములో 17 సర్గములు, మొత్తము 1132 శ్లోకములు గలవు. (1) పార్వతీజననము, (2) బ్రహ్మసాక్షాత్కారము, (3) కామదహనము, (4) రతి విలాపము, (5) తపఃఫలోదయము, (6) ఉమాప్రదానము, (7) పార్వతీకల్యాణము, (8) శ్రీశివపార్వతీ సంభోగము, (9) కైలాస గమనము, (10) కుమారోత్పత్తి, (11) కుమారయౌవనము, (12) కుమారసైనాపత్యము, (13) కుమారాభిషేకము, (14) దేవసేనాప్రయాణము, (15) సురాసురసైన్య సంఘట్టనము, (16) సురాసుర యుద్ధము, (17) తారకాసురవధ యనునవి క్రమముగా వర్ణింపఁబడినవి.

ఈ కావ్య విషయములో విద్వద్విమర్శకులలో గందరగోళము చెలరేఁగినది. కొందఱు 8 సర్గముల వఱకే కాళిదాస విరచితమని భావింపఁగా, మఱికొందఱు సంపూర్ణ కావ్యము కాళిదాస కృతమని తలఁచుచున్నారు. చారిత్రవర్ధనుని 'శిశు హితైషిణీ' వ్యాఖ్య 7 సర్గముల వఱకే లభించుచున్నది. వల్లభదేవుని పఞ్జికావ్యాఖ్య 8 సర్గముల వఱకే రచింపఁబడినది. మల్లినాథుని 'సంజీవిని' 7 సర్గముల వఱకే లభింపఁగా, సీతారామపండితుఁడు 8–17 సర్గముల వ్యాఖ్యను పూరించినాఁడు. మల్లినాథుని సంజీవినీలోని 8వ సర్గవ్యాఖ్య ముద్రితప్రతులలోఁ బరిశిష్టముగా నీయఁ బడినది. ఆలంకారికులు, సంకలనగ్రంథకర్తలు 8 సర్గముల కుమారసంభవమునే యుదాహరించిరి.

'యథా కుమారసంభవే దేవీ సంభోగవర్ణనమ్' (ధ్వన్యా – 3–5) అని యానంద వర్ధనాచార్యులు, "యథా వా కాళిదాసస్య–", "ఊరుమూలనఖమార్గపంక్తిభిః..." (కు.సం. 8–87) తేనానౌచిత్యమేవ పరం ప్రబంధార్థః పుష్ణాతి" అని క్షేమేంద్రుడు చెప్పుటచేఁ బ్రాచీన పండితు లష్టమ సర్గపర్యంతము కాళిదాసకృతమని భావించినట్లు స్పష్టము.

ఇక్కడ నొక్క విషయము గమనింపవలయును. అష్టమసర్గ పర్యంతమే కావ్యమని తలంచినచో దీనికి – **'ఉమాకల్యాణము', 'పార్వతీపరిణయము'** మొదలగు పేరులు తగినవి గాని 'కుమారసంభవ' మను నామము తగదు. దశమసర్గములోఁ గాని శ్రీ కుమారస్వామి యవతరింపలేదు. సంపూర్ణకావ్యము కాళిదాస కృతమని తలంచినచో నిది 'తారకవధ' యగును.



జీవానంద, విద్యాసాగరుఁడు మొదలగు నాధునిక వ్యాఖ్యాతలు సంపూర్ణ కావ్యమునకు వ్యాఖ్యలు రచించిరి.

ఈ కుమారసంభవకావ్యమునకు (1) అరుణగిరినాథుఁడు(2) కుమారసేనుడు, (3) కృష్ణపతి, (4) కృష్ణమిత్రాచార్యుఁడు, (5) గోపాలదాసు, (6) గోపాలానందుడు, (7) గోవిందరాముఁడు, (8) చారిత్రవర్ధనుఁడు, (9) జయసింహుఁడు, (10) జినభద్రసూరి, (11) జీవానందుఁడు, (12) తర్కవాచస్పతి, (13) దక్షిణావర్తనాథుడు, (14) నరహరి, (15) నవరత్న మిశ్రుఁడు, (16) నారాయణ పండితుఁడు, (17) నందగోపాలుఁడు, (18) ప్రభాకరుఁడు, (19) బృహస్పతి, (20) భరతమల్లికుడు, (21) భరతసేనుఁడు, (22) భీష్మమిశ్రుఁడు, (23) మల్లినాథుఁడు, (24) మునిమిత్ర రత్నుఁడు, (25) రఘుపతి, (26) రామపారాశవుఁడు, (27) లక్ష్మణవల్లభుఁడు, (28) వత్సుఁడు, (29) వల్లభదేవుఁడు, (30) విద్యామాధవుఁడు, (31) వింధ్యేశ్వర ప్రసాదుఁడు, (32) సరస్వతీతీర్థుఁడు, (33) సీతారామకవి, (34) హరిచరణదాసు మొదలగువారు వ్యాఖ్యలు రచించినట్లు శ్రీ మాడభూషి కృష్ణమాచార్యులు (హెచ్.సి.యస్.ఎల్– పేజి నెం.18) చెప్పుచున్నారు. వీనిలో **వల్లభదేవుఁడు**, చారిత్రవర్ధనుఁడు, మల్లినాథుఁడు, సీతారామకవి, జీవానంద విద్యాసాగరుఁడు, వేంకట గోపాలదాసు రచించిన వ్యాఖ్యలు ముద్రింపఁబడినవి గాని తక్కిన వింతవఱకు వెలుఁగు చూడలేదు. ప్రస్తుతము పుస్తకాపణములలో మల్లినాథవ్యాఖ్య లభించుచున్నది, గాని వల్లభదేవవ్యాఖ్య లభించుట లేదు. శ్రీ మోహనరావుగారీగ్రంథమున కనుబంధముగా వల్లభవ్యాఖ్యను జోడించు చున్నందులకుఁ బాఠకలోక మంతయు వారికి ఋణపడియున్నది. వల్లభదేవుఁడు కాశ్మీరదేశీయుఁడు. మల్లినాథునికంటెఁ బ్రాచీనుఁడు. ఇతఁడు కాళిదాస త్రయమునకు, శిశుపాలవధకు, సూర్యశతకమునకు వ్యాఖ్యలు రచించినాఁడు.

తెలుఁగులో నన్నెచోడుఁడు కుమారసంభవము రచించినాఁడు గాని యిది కాళిదాస కృతి కనువాదము గాదు. స్వతంత్రకావ్యము. **శ్రీ కూచిమంచి సాంబకవి** శ్లోకమునకుఁబద్యము చొప్పునఁ గాళిదాస కుమారసంభవమును యథా మాతృకముగాఁ దెనిఁగించినాఁడు. ఇది 1926 లో నష్టమ సర్గ పర్యంతము ప్రచురింపఁబడినది. దీని వ్రాఁతప్రతి సంపూర్ణముగా నాయొద్దఁ గలదు. ఉదారులెవ్వ రైనను పూనుకొన్నచో నీ సంపూర్ణకావ్యము వెలుఁగు చూడఁగలదు.

ప్రస్తుతము పాఠకుల చేతిలో నున్నది కుమారసంభవమునందలి మూఁడవ సర్గము. దీనిలో 76 శ్లోకములున్నవి. మన్మథుడింద్రుని దగ్గఱకు వచ్చుట, వసంత – రతి–మన్మథులను నింద్రుఁడు శివుని పైకిఁ బంపుట, వసంతోదయము, పార్వతి శివుని సేవించుటకు వచ్చుట, శివుని సమాధి సడలుట, మన్మథుఁడు శివునిపై సమ్మోహనాస్త్రము సంధించుట, శివుఁడు మన్మథునిపై మూఁడవ కన్ను తెఱచుట, శివుని నేత్రాగ్నికి మన్మథుఁడు భస్మమగుట యిందలి కథావస్తువు.

కథను, పాత్రలను, పాఠకుల యెదుటఁ జిత్రము గీసినట్లు నిలుపుట కాళిదాసు ప్రత్యేకత.

**శ్లో॥ నిష్కమ్పవృక్షం నిభృతద్విరేఫం**
**మూకాణ్డజం శాన్తమృగప్రచారమ్।**
**తచ్ఛాసనాత్ కాననమేవ సర్వం**
**చిత్రార్పితారమ్భ ఇవావతస్థే॥** (కు.సం. 3–42)

రఘువంశములోఁ గూడ నిట్లే వర్ణించినాఁడు –

**శ్లో॥ వామేతర స్తస్య కరః ప్రహర్తు**
**ర్నఖప్రభాభూషితకంకపత్రే।**
**సక్తాంగులిః సాయక పుంఖ ఏవ**
**చిత్రార్పితారమ్భ ఇవావతస్థే॥** (ర.వం. 2–31)

ఇట్లు పాత్రలు చిత్రపటమునందలి బొమ్మలవలె స్తబ్ధముగా నుండుటయే కాదు, ఆ పాత్రలు మన కనుల యెదుట సంచరించును.

**శ్లో॥ సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ .....** (ర.వం. 6–67)

అని రఘువంశములో నిందుమతీ వర్ణనము.

**శ్లో॥ ఆవర్జితా కిఞ్చిదివ స్తనాభ్యాం**
**వాసో వసానా తరుణార్కరాగమ్।**
**పర్యాప్త పుష్పస్తబకావనమ్రా**
**సంచారిణీ పల్లవినీ లతేవ॥** (కు.సం. 3–54)

అని కుమారసంభవములో శ్రీ పార్వతీ వర్ణనము.





'ఉపమా కాళిదాసస్య' యనునది ప్రాయోవాదము. కాళిదాసు నర్థాంతరన్యాసములు కూడ నద్భుతములు. ఈ కావ్యములోని మూఁడవ శ్లోకమునందే–

**శ్లో॥ ఏకో హి దోషో గుణసన్నిపాతే**
**నిమజ్జతీందోః కిరణేష్వివాంకః॥** (1–3)

అని వాడినాఁడు. ఇది పండితలోకములో జాతీయమైనది. ఈ మూఁడవ సర్గములోఁ గూడ–

**శ్లో॥ ప్రయోజనాపేక్షతయా ప్రభూణాం**
**ప్రాయశ్చలం గౌరవమాశ్రితేషు।** (3–1)

**శ్లో॥ ఆత్మేశ్వరాణాం నహి జాతు విఘ్నాః**
**సమాధిభేదప్రభవో భవంతి॥** (3–40)

**శ్లో॥ నహీశ్వరవ్యాహృతయః కదాచిత్**
**పుష్ణంతి లోకే విపరీతమర్థమ్॥** (3–63)

మొదలగు నర్థాంతరన్యాసములు గలవు.

'త్రియంబకం యజామహే' మొదలగు వైదిక ప్రయోగముల ననుసరించి 'త్రియంబకం సంయమినం దదర్శ' (3–44) అని కాళిదాసు ప్రయోగించినాఁడు. కొందఱీసంధి తప్పను భావముతో 'త్రిలోచనమ్' అని దిద్దినారు. "కేచిత్ సాహసికాః త్రిలోచనమ్' ఇతి పేఠుః – త్ర్యంబక మిత్యుక్తే పాదపూరణ వ్యత్యాసాత్ 'త్రియంబక' మితి పాదపూరణార్థో౾ యమియజాదేశః ఛాందసో మహాకవి ప్రయోగా దభియుక్తై రంగీకృతః..." అని మల్లినాథుఁడు దిద్దిన వ్యాఖ్యాతలకుఁ జివాట్లు పెట్టినాఁడు. కాళిదాస ప్రయోగమన్నచో నంత గౌరవము.

కాళిదాసుని కవితామృతము తనివి తీఱఁ గ్రోలి యానందింపవలసినదే కాని పొడిపొడి మాటలతోఁ జవి చూపుట కలవి గానిది.

## 'రామోరా' – మృణాళినీవ్యాఖ్య

ఇట్టి మహాకావ్యమునకు 'మృణాళినీవ్యాఖ్య' నందించినవారు శ్రీ రావి మోహనరావు గారు. విద్యావిషయములో నెక్కువ పట్టుదల గలవారు. సంస్కృతములో స్వయంకృషితో 'ఎం.ఏ.' పట్టము నందినవారు. వీరు

గావించుచున్న వాఙ్మయసేవ నభినందించుటకు నా మాటలు చాలవు. అనేక ప్రాచీన సంస్కృతాంధ్ర గ్రంథములను పుంఖానుపుంఖముగాఁ బ్రకటించుచున్నారు. అంతే కాక కొన్ని సంస్కృతకావ్యములకు వ్యాఖ్యాతలై వాసి గాంచుచున్నారు. కాళిదాసుని కావ్యములను 'మృణాళినీ' వ్యాఖ్యలతో నలంకరించుటకు వీరు సంకల్పించినట్లున్నది. ఋతుసంహారమును మృణాళినీవ్యాఖ్యతో 2004 లోఁ బ్రకటించిరి. సంజీవినీ–బ్రహ్మ ప్రకాశికా–విద్యుల్లతా సంస్కృతవ్యాఖ్యలతో నాంధ్ర మృణాళినీవ్యాఖ్యతో 'మేఘదూతము' ను 2006లోఁ బ్రచురించిరి.

వీరి వ్యాఖ్యాన ప్రణాళిక సమగ్రమైనది. నిర్దుష్టమైనది. మొదట నవతారికలో శ్లోకమునందలి సంగతిని బరిచయము చేసినారు. తరువాతఁ బదవిభాగమును జూపినారు. పిమ్మట నన్వయక్రమమును నిర్దేశించినారు. అనంతరము ప్రతిపదార్థ–తాత్పర్యములు గలవు. శ్లోకమునందలి సుబంత–తిఙంత శబ్దములకు మూఁడు వచనములందును రూపములు చూపినారు. ధాతునిర్దేశము గణపూర్వకముగాఁ గలదు. సమాసములకు విగ్రహవాక్యములు చెప్పినారు. సంధులు విడఁదీసి సంధి నామములను బేర్కొనినారు. పదవ్యుత్పత్తికి నిఘంటు ప్రమాణములు, కావ్య ప్రయోగములు ప్రదర్శించినారు. పిదప శ్లోకములోని విశేషములను నిరూపించినారు. ప్రతి శ్లోకమునందుఁ బాఠాంతరము లున్నచోఁ బరిశీలించినారు. ఛందస్సులును సలక్షణముగాఁ దెలిపినారు. అలంకారములను లక్ష్యలక్షణపూర్వకముగా సమన్వయము చేసినారు. సంస్కృతాంధ్రాంగ్లహిందీ గ్రంథముల నవలోకించి యెన్నో రహస్యములను వివరించినారు. పురాణకథలను జోడించినారు. కుమారసంభవము నకు **శివపురాణము**తో నున్న పోలికలను బట్టికగా నిచ్చినారు. ఇట్టి వ్యాఖ్యానము విద్యార్థులకు, ఁబండితులకు, విమర్శకులకు మిక్కిలి యుపయోగకరమై సర్వాంగ సుందరముగానున్నది. ఈ పద్ధతిలో విద్యార్థులు కావ్యములను బఠించినచో సంస్కృత సాహిత్యసాగరము నవలీలగా నీఁదఁగలరు.

ఇక్కడ నొక చిన్న కథ జ్ఞాపకము వచ్చుచున్నది. శ్రీమధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు బాల్యములో విద్యార్థిదశలో నొక పాఠశాలలోఁ గుమార సంభవమును బఠించుచున్నారఁట. ఒకనాఁడు శ్రీ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారా పాఠశాలకు వచ్చి "యీ విద్యార్థు లేమి చదువుచున్నా రని ప్రశ్నించిరఁట. 'కుమార





సంభవ' మని యాచార్యులు బదులు చెప్పిరఁట. అంత శాస్త్రిగారు **'రామాయణ మహామాలారత్నం వందేఽనిలాత్మజమ్'** అను శ్లోకమును జదివి దీనికర్థము విగ్రహ వాక్యములు చెప్పుఁడనిరఁట. విద్యార్థులు తలకొకవిధముగాఁ జెప్పఁగా శ్రీ మధునాపంతులవారు **'మహతీ చ సా మాలా చ మహామాలా'** యని విగ్రహము చెప్పిరఁట. వెంటనే చెళ్ళపిళ్ళవారు "వీఁడికి లింగజ్ఞానము బాగున్నది. కుమార సంభవమునకుఁ బనిచేస్తాఁ" డని పలికిరఁట. విద్యార్థులందఱు పక్కుమని నవ్విరట. ఈ విషయమును నా కొకమాఱు మధునాపంతులవారు చెప్పి 'చమత్కార' మను శబ్దమున కర్థమప్పుడే తెలిసినదని వక్కాణించిరి. ఇట్టి సంభాషణముల వలనఁ గవితా చమత్కారములు కూడఁ జక్కఁగాఁదెలియును.

ఆ విషయము నట్లుండ నిండు. శ్రీ రామోరాగారు హిమాలయమును కొండల ఱేఱేఁడని వాడినారు. 'రేఱేఁడు' అనఁగా జంద్రుఁడు. రాజు+రాజు–రారాజైనట్లే 'ఱేఁడు + ఱేఁడు – ఱేఱేఁడు' అగునని వీరి భావన. ప్రభువులకుఁ బ్రభువని యర్థము. ఇది యొక క్రొత్త ప్రయోగము.

శ్రీ మృణాళినీ వ్యాఖ్యతోఁ గాళిదాసకావ్యమునకు బంగారమునకు సువాసన లభించినట్లైనది. ఇట్టి కృతుల నింకను రచించి వాఙ్మయవరివస్య చేయుట కాయురారోగ్యములను, భోగభాగ్యములను శ్రీ మోహనరావు గారికిఁ బ్రసాదింప వలెనని శ్రీ సరస్వతీదేవి కంజలి ఘటించుచున్నాను.

**శా॥ శ్రీమంతంబులు సంస్కృతాంధ్ర కవితా సేవాసమాధి స్థితి**
**శ్రీమంతంబులు ప్రత్ననూత్న కవిరాజీపండితాళీ మనో**
**వ్యామోహంబు లపూర్వ సర్వవిషయ వ్యాఖ్యాన విఖ్యాతముల్**
**'రామోరా' కృతు లొప్పు నాద్యమణి తారాచంద్ర దిగ్జాలమున్.**

// శ్రీపరమేశ్వరార్పణమస్తు //

విజయవాడ
వికృతి – కార్తిక బహుళ
ద్వితీయా – భౌమవారము
ది. 23–11–2010

ఇట్లు
సకల సుకవిబుధజనవిధేయుడు
**గరిమెళ్ళ సోమయాజులుశర్మ**
పుష్పగిరి సంస్థాన పండితుఁడు



రామాయంపేట వాస్తవ్యులు

**శ్రీ దోర్బల విశ్వనాథశర్మ గారి పాదపద్మములకు**

**భక్తితో సమర్పితము**



శ్రీః

ఓం కుమార శ్రీగురవే నమః



**మృణాళినీ వ్యాఖ్యానమున**

ఉదహరింపబడిన విషయములకు సంబంధించిన
ఆయా గ్రంథ రచయితలకు, వ్యాఖ్యానకారులకు నమస్సుమాంజలులు.

☐

ఇట సహకరించిన డా॥ వుయ్యూరు లక్ష్మీనరసింహారావుగారు,
డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు గారు, డి. పాపిరెడ్డిగారు, సి. సుబ్బారావుగారు,
మేళ్ళచెర్వు వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
డా॥ ముళ్ళపూడి విశ్వనాథశాస్త్రిగారు, మహామహోపాధ్యాయ శ్రీ పుల్లెల
శ్రీరామచంద్రుడు గార్లకు మరియు అడిగిన వెంటనే "ఆమోదము" అందించిన
గరిమెళ్ళ సోమయాజులుశర్మగారు, డా॥ కె. లక్ష్మీనారాయణగారు,
ప్రియమిత్రులు శ్రీ కె.అరవిందరావు, IPS, D.G.P. గార్లకు

☐

నా ఆరాధ్యదైవమైన
మహాయోగి శ్రీ అరవిందభగవానుడు,
వారి అర్ధభాగమైన మృణాళినీదేవికి నమస్కరిస్తూ...

☐

శ్లో॥ నాహం మన్యే సువేదేతి – నో న వేదేతి వేద చ।
యో నస్ తద్వేద తద్వేద – నో న వేదేతి వేద చ॥

– కేనోపనిషత్ –10

ఓం శాన్తిశ్ శాన్తిశ్ శాన్తిః

**- రా మో రా**

# శ్రీః

## మహాకవిశ్రీకాళిదాసవిరచితమ్

# కుమారసమ్భవమహాకావ్యమ్

## 'మదనదాహో' నామ **తృతీయః సర్గః**

## ఆంధ్ర **మృణాళినీ** వ్యాఖ్యా

**అవతారికా:–** అథోపాక్షిప్తముపాయానుష్ఠానం ప్రపంచయతి।

**శ్లో॥ తస్మిన్ మఘోనస్త్రిదశాన్ విహాయ**
**సహస్రమక్ష్ణాం యుగపత్ పపాత ।**
**ప్రయోజనాపేక్షితయా ప్రభూణాం**
**ప్రాయశ్చలం గౌరవమాశ్రితేషు ॥** **1**

**పదవిభాగము:–** తస్మిన్, మఘోనః, త్రిదశాన్, విహాయ, సహస్రమ్, అక్ష్ణామ్, యుగపత్, పపాత, ప్రయోజనాపేక్షితయా, ప్రభూణామ్, ప్రాయః, చలమ్, గౌరవమ్, ఆశ్రితేషు॥

**అన్వయక్రమము:–** మఘోనః అక్ష్ణాం సహస్రం త్రిదశాన్ విహాయ తస్మిన్ యుగపతే పపాత। ప్రాయః ప్రభూణామ్ ఆశ్రితేషు గౌరవం ప్రయోజనాపేక్షితయా చలమ్। (భవతీతి శేషః)।

**ప్రతిపదార్థము:–** మఘోనః= ఇంద్రునియొక్క, అక్ష్ణామ్= కన్నులయొక్క, సహస్రమ్ =వేయి, త్రిదశాన్ =దేవతలను, విహాయ=వదలి, తస్మిన్= ఆ మన్మథునియందు, యుగపత్=ఒక్కుమ్మడిని, పపాత=పడెను. ప్రాయః–తఱచుగా ప్రభూణామ్= ప్రభువులకు, ఆశ్రితేషు=సేవకులయందు,గౌరవమ్=ఆదరము, ప్రయోజనాపేక్షితయా =కార్యమును కోరుటచే, చలమ్=చంచలమైనది.(భవతీతి శేషః)।



**తాత్పర్యము:–** ఇంద్రుని వేయి కన్నులు దేవతలను వదలి ఆ మన్మథునియందు ఒక్కమ్మడిని పడెను. తఱచుగా ప్రభువులకు సేవకులయందు ఆదరము కార్యమును బట్టియే చంచలమైనదిగా ఉండును.

**పాఠాన్తరములు:–** ఆశ్రితేషు – ఆశ్రితేఽపి

**విభక్తులు/క్రియలు:–**1) మఘోనః–**మఘోనః**, మఘోనోః, మఘోనామ్; పుంలింగోనకారాన్త తృత్వాభావే స ఏవ 'మఘవన్' శబ్దః, షష్ఠీ ఏకవచనమ్. 2) అక్ష్ణామ్–అక్ష్ణః, అక్ష్ణోః, **అక్ష్ణామ్**; నకారాన్త పుంలింగ అక్షన్ శబ్దము. ష.బ. 3) సహస్రమ్–**సహస్రమ్**, సహస్రే, సహస్రాణి, అకారాన్త నపుంసకలింగ సహస్రశబ్దము, ప్ర.ఏ., 4) త్రిదశాన్–**త్రిదశమ్**, త్రిదశౌ, త్రిదశాన్, అకారాన్త పుంలింగ త్రిదశశబ్దము ద్వి.బ. 5) విహాయ–అవ్యయము, వి+హా+క్త్వా–ల్యబన్తము, 6) తస్మిన్ – **తస్మిన్**, తయోః, తేషు, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము, స.ఏ., 7) యుగపత్ – క్రియావిశేషణము, అవ్యయము, 8) పపాత–క్రియ– పత్+లిట్, ప్రథమపురుషైకవచనమ్/ఉత్తమపురుషరూపమున్నూ ఇదే. 9) ప్రాయః – అవ్యయము, సకారాంతము, 10) ప్రభూణామ్ – ప్రభోః, ప్రభ్వోః, **ప్రభూణామ్**, ఉకారాన్త పుంలింగ ప్రభుశబ్దము ష.బ., 11) ఆశ్రితేషు – ఆశ్రితే, ఆశ్రితయోః, **ఆశ్రితేషు**, అకారాన్త పుంలింగ ఆశ్రితశబ్దము, స.బ., 12) గౌరవమ్ – **గౌరవమ్**, గౌరవే, గౌరవాని, అకారాన్త నపుంసకలింగ గౌరవశబ్దము, ప్ర.ఏ., 13) ప్ర...క్షితయా – **....క్షితయా**, క్షితాభ్యామ్, ...క్షితాభిః, ఆకారాన్త స్త్రీలింగ .... క్షితాశబ్దము, తృ.ఏ., 14) చలమ్ – **చలమ్**, చలే, చలాని, అకారాన్త నపుంసకలింగ చలశబ్దము, ప్ర.ఏ.

**సంధులు:–**

1) మఘోనః+త్రిదశాన్ – మఘోనస్త్రిదశాన్ – విసర్గసంధిః.
2) ప్రాయః + చలమ్ – ప్రాయశ్చలమ్ – శ్చుత్వసన్ధిః.

**స్తోః శ్చునా శ్చుః** (సూ. 8–4–39) సకార తవర్గము (స,త,థ,ద,ధ,న) లకు శకారచవర్గము (శ,చ,ఛ,జ,ఝ,ఞ) లతో కలయిక ఏర్పడినప్పుడు శకారచవర్గములు వచ్చును.

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) మఘోనః – a) మఘవన్ – త్ – పుం – ఇంద్రః
b) మఘవా – న్ – పుం – ఇంద్రః
c) మఘవాన్ – త్ – పుం – ఇంద్రః
d) నకారాన్తః పుంలింగో 'మఘవన్' శబ్దః

ప్ర. – * మఘవాన్ – మఘవన్తౌ – మఘవన్తః
ద్వి. – మఘవన్తమ్ – మఘవన్తౌ – మఘవతః
తృ. – మఘవతా – మఘవద్భ్యామ్ – మఘవద్భిః

చ. – మఘవతే – మఘవద్భ్యామ్ – మఘవద్భ్యః
పం. – మఘవతః – మఘవద్భ్యామ్ – మఘవద్భ్యః
ష. – మఘవతః – మఘవతోః – మఘవతామ్
స. – మఘవతి – మఘవతోః – మఘవత్సు
సంబో – హే మఘవన్ – హే మఘవన్తౌ – హే మఘవన్తః

* మహ్యతే, పూజ్యతే ఇతి మఘవాన్, 'శ్వన్నుక్షన్ని' త్యాది సూత్రేణ నిపాతనాత్ మఘ్ధాతోః కనిః, అవుగాగమః, హస్య ఘశ్చ భవతి। తతః సౌ 'మఘవా బహులమ్' ఇతి తృత్వే ఋకారస్యేత్సంజ్ఞాయాం లోపే చ 'ఉగిదచామి' తి నుమి సులోపే సంయోగాన్తలోపే చ ఉపధాదీర్ఘః।

e) నకారాన్తః పుంలింగః తృత్వాఽభావే 'మఘవన్' శబ్దః.
ప్ర. – *[1] **మఘవా** – మఘవానౌ – మఘవానః
ద్వి.– మఘవానమ్ – మఘవానౌ – **మఘోనః** *[2]
తృ. – మఘోనా – *[3] మఘవభ్యామ్ – మఘవభిః
చ. – మఘోనే – మఘవభ్యామ్ – మఘవభ్యః
పం. – **మఘోనః** – మఘవభ్యామ్ – మఘవభ్యః
ష. – **మఘోనః** – మఘోనోః – మఘోనామ్
స. – మఘోని – మఘోనోః – మఘవత్సు
సంభో– హే మఘవన్ – హే మఘవానౌ – హే మఘవానః

*[1] తృత్వాఽభావే సుటి రాజవత్।
*[2] శసాదావచి తు భత్వే 'శ్వయువమఘోనామ్'ఇతి సంప్రసారణే పూర్వరూపే గుణః।
*[3] భ్యామాదౌ హలి 'స్వాదిష్వి' తి పదత్వాన్నలోపః।

f) **మఘవా:–**

1) శ్లో॥ ***దుదోహ గాం స యజ్ఞాయ సస్యాయ మఘవా దివమ్।***
***సమ్పద్వినిమయేనోభౌ దధతుర్భువనద్వయమ్ ॥*** *ర.వం. 1-26*

"....అట్లే **దేవేంద్రుడు** కూడ భూమిపై సస్యవృద్ధికొఱకే వర్షమును కురిపించెను..."

2) ***'మఘవా సప్తమే ప్రాప్తే విశిష్టస్త్వష్టమే స్మృతః'*** – దేవీభాగవతే 1.3.28

3) శ్లో॥ **ఇంద్రో .............**





***పర్జన్యో మఘవా వృషా ............***
***................ మరుత్వాన్మేఘవాహనః ॥*** *54*

అని 'మఘవన్' శబ్దానికి హలాయుధ కోశము '39' నామములను అందించినది.

4) శ్లో॥ *ప్రియేషు యైః పార్థ! వినోపపత్తే –*
*ర్విచింత్యమానైః క్లమయేతి చేతః।*
*తవ ప్రయాతస్య జయాయ తేషాం*
*క్రియాదఘనాం **మఘవా** విఘాతమ్॥ కిరాతార్జునీయే-3-52*

"....... ఆ దేవేంద్రుడు నీకు శుభము కలుగజేయుచుండు గాక!...."

**క్రియాదర్శమ్:–** పపాత – పత్ల (పత్) గతౌ (క్రిందపడుట) భ్వాదిప్రకరణమ్ (1) అకర్మకమ్, సేట్, పరస్మైపదీ. లిట్ ప్రథమపురుషైకవచనమ్.

రూపాలు – ప్ర. – పపాత – పేతతుః – పేతుః
మ. – పేతిథ – పేతథుః – పేత
ఉ. – పపాత/పపత – పేతివ – పేతిమ

శ్లో॥ ***తస్మిన్** క్షణే పాలయితుః ప్రజానామ్*
*ఉత్పశ్యత స్సింహనిపాతముగ్రమ్।*
*అవాఙ్ముఖస్యోపరి పుష్పవృష్టిః*
***పపాత** విద్యాధరహస్తముక్తా॥*

**అలంకారము:–** ఇందు 'అర్థాంతరన్యాసాలంకార' మున్నదని చెప్పదగును.

**లక్షణము:–** *ఉపన్యసనమన్యస్య యదర్థస్యోదితాదృతే ।*
*జ్ఞేయః సోఽర్థాన్తరన్యాసః పూర్వార్థానుగతో యథా॥*– కావ్యాలంకారః2-71

చెప్పబడిన విషయముకంటె భిన్నమైనదియు, దానితో సంబంధించినదియు అగు మరియొక అర్థము చెప్పుట అర్థాంతరన్యాసాలంకారము. ఇట సామాన్యముచే విశేషము సమర్థింపబడుటచే నిది అర్థాన్తరన్యాసాలంకారము.

**సామాన్యము–** తఱచుగా ప్రభువులకు సేవకులయందు ఆదరము కార్యమును బట్టి మారుచుండును.

**విశేషము–** ఇంద్రుని వేయికన్నులు దేవతలనువదలి, ఒక్కుమ్మడిగ మన్మథునిపై పడెను.

**ఛందస్సు:–** ఈ సర్గయందలి శ్లోకములు ఉపజాతికి చెందినవి. ఇంద్రవజ్రా, ఉపేంద్ర వజ్రా వృత్తలక్షణముల కలయికచే ఏర్పడిన దానికి 'ఉపజాతి' యని పేరు. (1–74) ఇక సర్గాంతశ్లోకములు – 75వ శ్లోకము 'వసన్తతిలకా' వృత్తమునకు, 76వ శ్లోకము మాలినీ వృత్తమునకు చెందినవిగా గ్రహింతురుగాక!

**లక్షణము:–** *స్యాదింద్రవజ్రా యది తౌ జగౌ గః।*
*ఉపేన్ద్రవజ్రా జతజాస్తతో గౌ॥*

ఇంద్రవజ్రా వృత్తమున 11 అక్షరములుండి ప్రతిపాదము 'త,త,జ,గ,గ,' గణములు కలిగియు, ఉపేంద్రవజ్రావృత్తమున 11 అక్షరములుండి ప్రతిపాదము 'జ,త,జ,గ,గ' గణములు కలిగియుండును. ఉపజాతికి చెందిన వృత్తమున – ఇంద్రవజ్రా / ఉపేంద్రవజ్రా–పాదములు ఏవైనా ఉండవచ్చును.

---

**అవతారికా:–** ఇంద్రం ప్రతి స్మరేణ స్వసామర్థ్యజల్పనమాహ–ఇంద్రుని వద్ద మన్మథుడు తన సామర్థ్యమును పొగుడుకొనుట చెప్పుచున్నాడు.

**శ్లో॥ స వాసవేనాసనసన్నికృష్ట –**
**మితో నిషీదేతి విసృష్టభూమిః।**
**భర్తుః ప్రసాదం ప్రతిగృహ్య మూర్ధ్నా**
**వక్తుం మిథః ప్రాక్రమతైవమేనమ్॥ 2**

**పదవిభాగము:–** సః, వాసవేన, ఆసనసన్నికృష్టమ్,ఇతః,నిషీద,ఇతి,విసృష్టభూమిః, భర్తుః, ప్రసాదమ్, ప్రతిగృహ్య, మూర్ధ్నా, వక్తుమ్, మిథః, ప్రాక్రమత,ఏవమ్, ఏనమ్.

**అన్వయక్రమము:–** సః వాసవేన ఆసనసన్నికృష్టమ్ ఇతః నిషీద ఇతి విసృష్టభూమిః భర్తుః ప్రసాదం మూర్ధ్నా ప్రతిగృహ్య మిథః ఏనమ్ ఏవం వక్తుం ప్రాక్రమత॥

**ప్రతిపదార్థము:–** సః=ఆ మన్మథుడు, వాసవేన=ఇంద్రునిచే, ఆసనసన్నికృష్టమ్= సింహాసనమునకు చేరువుగా, ఇతః=ఇచట, నిషీద=కూర్చుండుము, ఇతి=అని, విసృష్టభూమిః=విడువబడిన చోటుగలవాడై, భర్తుః=ప్రభువగు ఇంద్రునియొక్క ప్రసాదమ్=అనుగ్రహమును, మూర్ధ్నా=శిరస్సుచేత, ప్రతిగృహ్య=స్వీకరించి, మిథః =ఏకాంతమున, ఏనమ్=ఇంద్రునిగూర్చి, ఏవమ్=ఇట్లు, వక్తుమ్=మాట్లాడుటకు, ప్రాక్రమత=ప్రారంభించెను.





**తాత్పర్యము:–**ఆ మన్మథుడు ఇంద్రునిచే సింహాసనము చేరువుగా'ఇచట కూర్చుండుము' అని విడువబడిన చోటుగలవాడై ప్రభువగు ఇంద్రునియొక్క అనుగ్రహమును శిరస్సుచేత స్వీకరించి ఏకాంతమున ఇంద్రునితో ఇట్లు మాట్లాడుటకు ప్రారంభించెను.

**పాఠాన్తరములు:–** 1) ప్రతిగృహ్య – ప్రతినన్ద్య 2) విసృష్ట – నిమృష్ట.

**విభక్తులు/క్రియలు:–**1) సః – **సః,** తౌ, తే, దకారాన్త పుంలింగతచ్ఛబ్దము. ప్రథమా ఏకవచనము. 2) వాసవేన – **వాసవేన**, వాసవాభ్యామ్, వాసవైః, అకారాన్తపుంలింగవాసవశబ్దము, తృ.ఏ., 3) ఆసనసన్నికృష్టమ్–**ఆసనసన్నికృష్టమ్**, ...కృష్టే, కృష్టాని, అకారాన్త నపుంసకలింగ ...కృష్టశబ్దము. ప్ర.ఏ., 4) ఇతః, ఇతి, ఏవమ్ – అవ్యయాలు, 5) విసృష్టభూమిః – **విసృష్టభూమిః**, విసృష్టభూమీ, విసృష్టభూమయః ఇకారాన్తపుంలింగ విసృష్టభూమి శబ్దము, ప్ర.ఏ. 6) నిషీద–ని+షద్(సీద్) లోట్–మధ్యమపురుషైక వచనము – క్రియ, 7) భర్తుః–**భర్తుః**, భర్త్రోః, భర్తౄణామ్–ఋకారాన్తపుంలింగ భర్తృశబ్దము, ష.ఏ.,8) ప్రసాదమ్–**ప్రసాదమ్**, ప్రసాదౌ, ప్రసాదాన్, అకారాన్త పుంలింగ ప్రసాదశబ్దము, ద్వి.ఏ., 9) మూర్ధ్నా–**మూర్ధ్నా**, మూర్ధభ్యామ్,మూర్ధభిః, నకారాన్తపుంలింగమూర్ధన్‌శబ్దము, తృ.ఏ.,10) ప్రతిగృహ్య– ప్రతి+గృహ్+క్త్వా–ల్యబన్తము–అవ్యయము, 11) మిథః–సకారాన్తము–అవ్యయము, 12) ఏనమ్–**ఇమమ్/ఏనమ్**, ఇమౌ/ఏనౌ, ఇమాన్/ఏనాన్, మకారాన్తపుంలింగ ఇదమ్‌శబ్దము. ద్వి.ఏ., 13) వక్తుమ్–తుమున్ కృదన్తావ్యయము, 14) ప్రాక్రమత–క్రియ–ప్ర+క్రమ్+లఙ్– ప్రథమ పురుషైకవచనము.

**సమాసాలు:–**

1) ఆసనసన్నికృష్టమ్–ఆసనస్య సన్నికృష్టమ్ (ష.త.)
2) విసృష్టభూమిః–విసృష్టా భూమిః యస్మై (బహువ్రీహి) సః।

**సంధులు:–**

1) వాసవేన+ఆసనసన్నికృష్టమ్–వాసవేనాసనసన్నికృష్టమ్–సవర్ణదీర్ఘసంధిః
2) ఇతః+నిషీద–ఇతో నిషీద – ఉత్వాదేశసంధిః
3) నిషీద+ఇతి–నిషీదేతి – గుణసంధిః

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **వాసవః–** పుం.a) 1. వసురేవ। ప్రజ్ఞాద్యణ్ – ఇంద్రః। వసురేవ వాసవః।
2. వసురేవ స్వార్థే అణ్ వసూని సన్త్యస్య అణ్ వా.

b) శ్లో॥ *ఇంద్రో హరిః దుశ్చ్యవనోఽచ్యుతాగ్రజో*
*వజ్రీ విడౌజా మఘవాన్ పురందరః ।*
*ప్రాచీనబర్హిః పురుహూత* **వాసవౌ**
*సంక్రందనాఖణ్డలమేఘవాహనాః॥* 85

.... అని అభిధానచిన్తామణి 'వాసవ' శబ్దానికి '42' నామములను పేర్కొన్నది.

c) శ్లో॥ *సహస్రాక్షనియోగాత్ స పార్థః శక్రాసనం గతః।*
*అధ్యక్రామదమేయాత్మా ద్వితీయ ఇవ* **వాసవః॥**
*ఇతి మహాభారతే 3-43-22*

శ్లో॥ *కాయేన వాచా మనసాపి శశ్వ-*
*ద్యత్సమ్భృతం* **వాసవ***ధైర్యలోపి ।*
*ఆపాద్యతే న వ్యయమన్తరాయైః*
*కచ్చిన్మహర్షేస్త్రివిధం తపస్తత్॥* *ర.వం. 5-5*

"మనసా, వాచా, కర్మణా నిరంతరము ఏ తపస్సు నీ గురువుచే సంపాదింపబడినదో, ఇంద్రుని ధైర్యమును కూడ లోపింపజేయునో అట్టి ఆ వరతంతుమహర్షియొక్క తపస్సు విఘ్నములచేత వ్యయమగుటలేదు కదా!"

శ్లో॥ *అతిప్రబన్ధప్రహితాస్త్రవృష్టిభిః*
*తమాశ్రయం దుష్ప్రసహస్య తేజసః।*
*శశాక నిర్వాపయితుం న* **వాసవః**
*స్వతశ్చ్యుతం వహ్నిమివాద్భిరమ్బుదః॥* *ర.వం. 3-58*

"దేవేంద్రుడు, సహింపశక్యముగాని ప్రతాపముగల రఘుమహారాజును తన నిరంతర అస్త్రవర్షధారతో ముంచెత్తెను ......"

**క్రియాదర్శము:–** 1) **నిషీద** –షద్ల(సద్) విశరణగత్యవసాదనేషు (1.నశించుట, 2.గమనము, 3.చంపుట), 1. అకర్మకమ్, 2,3 సకర్మకమ్–అనిట్–పరస్మైపదీ, లోట్–మధ్యమపురుషైకవచనము. తుదాది ప్రకరణము (6), ని–ఉపసర్గ.

**రూపాలు** – **సీద/సీదతాత్** – సీదతమ్–సీదత

2) **ప్రాక్రమత**–క్రము(క్రమ్) పాదవిక్షేపే (నడచుట) సకర్మకమ్, భ్వాది ప్రకరణమ్. సేట్ (పరస్మైపదీ). లఙ్ ప్రథమ పురుష ఏకవచనమ్. ప్ర– ఉపసర్గ. వా భ్రాశభ్లాశ (సూ.3-1-70) అను సూత్రముచే శ్యన్ చెప్పబడినది.





**క్రమ్+య(శ్యన్)+తి.** క్రమః పరస్మైపదేషు (సూ.7-3-76) అను సూత్రముచే **క్రమ్** లోని అకారమునకు దీర్ఘము. పరస్మైపదీ.

| | | | | |
|---|---|---|---|---|
| లఙ్ రూపాలు 1) | ప్ర. | అక్రామ్యత్ – | అక్రామ్యతామ్ – | అక్రామ్యన్ |
| | మ. | అక్రామ్యః – | అక్రామ్యతమ్ – | అక్రామ్యత |
| | ఉ. | అక్రామ్యమ్– | అక్రామ్యావ – | అక్రామ్యామ. |
| పక్షే 2) | ప్ర. | అక్రామత్ – | అక్రామతామ్ – | అక్రామన్ |
| | మ. | అక్రామః – | అక్రామతమ్ – | అక్రామత |
| | ఉ. | అక్రామమ్ – | అక్రామావ – | అక్రామామ |

ఇట 'ప్రోపాభ్యాం సమర్థాభ్యామ్' **ఇత్యాత్మనేపదమ్.**

**లఙ్ ప్రథమపురుషరూపాలు:– అక్రమత** – అక్రమేతామ్ – అక్రమన్త.

**అలంకారము:–** ఇట 'అనుప్రాస' ఉన్నదని చెప్పదగును.

---

**శ్లో॥ ఆజ్ఞాపయ జ్ఞాతవిశేష! పుంసాం**
**లోకేషు యత్తే కరణీయమస్తి।**
**అనుగ్రహం సంస్మరణప్రవృత్త-**
**మిచ్ఛామి సంవర్ధితమాజ్ఞయా తే॥** **3**

**పదవిభాగము:–** ఆజ్ఞాపయ, జ్ఞాతవిశేష!, పుంసామ్, లోకేషు, యత్, తే, కరణీయమ్, అస్తి, అనుగ్రహమ్, సంస్మరణప్రవృత్తమ్, ఇచ్ఛామి, సంవర్ధితమ్, ఆజ్ఞయా, తే.

**అన్వయక్రమము:–** పుంసాం జ్ఞాతవిశేష! ఆజ్ఞాపయ। లోకేషు తే యత్ కరణీయమ్ అస్తి। సంస్మరణప్రవృత్తం తే అనుగ్రహమ్ ఆజ్ఞయా సంవర్ధితమ్ ఇచ్ఛామి।

**ప్రతిపదార్థము:–** హే=ఓ ప్రభూ!, పుంసామ్=పురుషులయొక్క, జ్ఞాతవిశేష!=ఎఱుగబడిన సామర్థ్యము గలవాడా!, ఆజ్ఞాపయ=ఆనతిమ్ము. లోకేషు=లోకములయందు, తే=నీకు, యత్=ఏది, కరణీయమ్=చేయదగినది, అస్తి=కలదో, సంస్మరణప్రవృత్తమ్= స్మరించుటచే పుట్టిన, తే=నీ యొక్క, అనుగ్రహమ్=దయను, ఆజ్ఞయా=ఆజ్ఞచే, సంవర్ధితమ్=వృద్ధినొందిన దానినిగా, ఇచ్ఛామి=కోరుచున్నాను.

**తాత్పర్యము:–**పురుషుల సామర్థ్యము నెఱిగినవాడా! ఓ ప్రభూ! ఆనతిమ్ము. లోకముల

యందు నీకు ఏది చేయదగినది కలదో, స్మరించుటచే పుట్టిన నీ యొక్క దయను ఆజ్ఞచే వృద్ధినొందిన దానినిగా కోరుచున్నాను.

**విభక్తులు/క్రియలు:–** 1) పుంసామ్–పుంసః, పుంసోః, **పుంసామ్;** సకారాన్త పుంలింగ 'పుంస్' శబ్దము. షష్ఠీబహువచనము. 2) జ్ఞాతవిశేష! – **హేజ్ఞాతవిశేష!,** హే జ్ఞాతవిశేషౌ, హే జ్ఞాతవిశేషాః; అకారాన్తపుంలింగ జ్ఞాతవిశేషశబ్దము, సంబోధనప్రథమైకవచనము. 3) ఆజ్ఞాపయ–క్రియ–ఆ+జ్ఞా+లోట్ –మధ్యమపురుషైకవచనము. 4) లోకేషు–లోకే, లోకయోః, **లోకేషు**; అకారాన్త పుంలింగలోక శబ్దము. స.బ., 5) తే – **తవ/తే**, యువయోః/వామ్, యుష్మాకమ్/వః, దకారాన్తపుంలింగ యుష్మచ్ఛబ్దము. ష.ఏ.,6) యత్–**యత్/యద్,** యే, యాని, దకారాన్త నపుంసకలింగ యచ్ఛబ్దము. ప్ర.ఏ., 7) కరణీయమ్– **కరణీయమ్**, కరణీయే, కరణీయాని, అకారాన్త నపుంసకలింగ కరణీయశబ్దము. ప్ర.ఏ., 8) అస్తి – క్రియ– అస్+లట్ – ప్రథమపురుషైకవచనము. 9) సంస్మరణప్రవృత్తమ్–**ప్రవృత్తమ్**, ప్రవృత్తౌ, ప్రవృత్తాన్, అకారాన్తపుంలింగ ..... ప్రవృత్తశబ్దము, ద్వి.ఏ., 10) అనుగ్రహమ్ – **అనుగ్రహమ్**, అనుగ్రహౌ, అనుగ్రహాన్, అకారాన్త పుంలింగ అనుగ్రహశబ్దము, ద్వి.ఏ., 11) ఆజ్ఞయా– **ఆజ్ఞయా**, ఆజ్ఞాభ్యామ్, ఆజ్ఞాభిః, ఆకారాన్త స్త్రీలింగ ఆజ్ఞాశబ్దము, తృ.ఏ., 12) సంవర్ధితమ్–**సంవర్ధితమ్**, సంవర్ధితౌ, సంవర్ధితాన్, అకారాన్తపుంలింగ సంవర్ధితశబ్దము, ద్వి.ఏ., 13) ఇచ్ఛామి–క్రియ– ఇష్+లట్ –ఉత్తమ పురుషైకవచనము.

**సమాసాలు:–**

1) జ్ఞాతవిశేష! – జ్ఞాతః విశేషః యేన (బహువ్రీహి) సః తత్ సమ్బుద్ధౌ, హే జ్ఞాతవిశేష!.

2) సంస్మరణప్రవృత్తమ్ – సమ్యక్ స్మరణం సంస్మరణమ్ (గతిసమాసః), సంస్మరణేన ప్రవృత్తః, (తృ.త.), సంస్మరణప్రవృత్తః, తమ్.

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **అనుగ్రహః–** a) శ్లో॥ అనుగ్రహోఽభ్యుపపత్తిః.... అని అభిధానచిన్తామణి.

*శ్లో॥ కైలాసగౌరం వృషమారురుక్షోః*
*పాదార్పణానుగ్రహపూతపృష్ఠమ్।*
*అవేహి మాం కిఙ్కరమష్టమూర్తేః*
*కుమ్భోదరం నామ నికుమ్భమిత్రమ్॥ ర.వం. 2–35.*

"వెండికొండవలె తెల్లనగునందిపై నెక్కు నిచ్ఛగల శివుని చరణవిన్యాసానుగ్రహమున పవిత్రమైన వీపుగల నన్ను పరమేశ్వరుని సేవకునిగ నికుంభునితోడ సమానునిగ కుంభోదరుడను వానినిగ దెలియుము."

2) **నటీ**–ఏవమేతత్ । అనన్తర **కరణీయం** తావదార్యః **ఆజ్ఞాపయతు.**

– అభిజ్ఞానశాకున్తలము – ప్రథమాంకము.



"....పూజ్యులగు తమరు తరువాత చేయదగిన దానిని ఇప్పుడు ఆజ్ఞాపింతురుగాక!"

**క్రియాదర్శము:– ఆజ్ఞాపయ** – జ్ఞా (నియోగే) ఆజ్ఞాపించుట, సకర్మకమ్, సేట్, ఉభయపదీ. చురాదిప్రకరణమ్(10).**లోట్** మధ్యమపురుషైకవచనము. ఆఙ్–ఉపసర్గ.

**రూపాలు – ఆజ్ఞాపయ** – ఆజ్ఞాపయతమ్, ఆజ్ఞాపయత.

*1) జ్ఞ ప – జ్ఞానే, జ్ఞాపనే, చురాది. ఉభయపదీ, సకర్మకమ్, సేట్,జ్ఞపయతి–తే.
2) జ్ఞా – అవబోధనే, క్ర్యాది, పరస్మైపదీ, సకర్మకమ్, అనిట్, జానాతి.
3) జ్ఞా – ఉభయపదీ, (9), జానాతి – జానీతే.
4) జ్ఞా – నియోగే – చురాది. ఉభయపదీ – సకర్మకమ్, సేట్, జ్ఞాపయతి–తే.
5) జ్ఞా – మారణతోషణ నిశామనేషు – భ్వాది – జ్ఞపయతి – తే.

– సంస్కృత–ధాతు–సాగర–తరణిః.

పైవి ధాతువుల – లట్ ప్రథమ పురుషైకవచన రూపాలు.

---

**అవతారికా:–** న చ మే కిఞ్చిదసాధ్యమస్తీత్యాహ – నాకు ఇంచుకంత అసాధ్యమను నదియు లేదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ కేనాభ్యసూయా పదకాఙ్క్షిణా తే**
**నితాన్తదీర్ఘైర్జనితా తపోభిః।**
**యావద్భవత్యాహితసాయకస్య**
**మత్కార్ముకస్యాస్య నిదేశవర్తీ॥ 4**

**పదవిభాగము:–** కేన, అభ్యసూయా, పదకాంక్షిణా, తే, నితాన్తదీర్ఘైః, జనితా, తపోభిః యావత్, భవతి, ఆహితసాయకస్య, మత్కార్ముకస్య, అస్య, నిదేశవర్తీ.

**అన్వయక్రమము:–** పదకాంక్షిణా కేన నితాన్తదీర్ఘైః తపోభిః తే అభ్యసూయా జనితా। యావత్ (సః) ఆహితసాయకస్య అస్య మత్కార్ముకస్య నిదేశవర్తీ భవతి।

**ప్రతిపదార్థము:–** పదకాంక్షిణా – (ఇంద్ర) పదవిని కోరుచున్న, కేన – ఎవనిచేత, నితాన్తదీర్ఘైః – మిక్కిలి గొప్పవియగు, తపోభిః – తపస్సులచేత, తే – నీకు, అభ్యసూయా – అసూయ, జనితా – పుట్టింపబడినది, యావత్ – ఎందులకనగా, (సః–వాడు, (నీ పగవాడు), ఆహితసాయకస్య – సంధానము చేయబడిన

బాణముగల, అస్య మత్కార్ముకస్య – ఈ నా వింటికి, నిదేశవర్తీ – ఆజ్ఞకు లోబడినవాడు, భవతి– అగును.

**తాత్పర్యము :–** ఇంద్రపదవిని కోరుచున్న ఎవనిచేత మిక్కిలి గొప్పవియగు తపస్సులచేత నీకు అసూయ పుట్టింపబడినది. ఎందులకనగా, సంధానము చేయబడిన బాణముగల ఈ నా వింటికి, ఆజ్ఞకు లోబడినవాడు అగును.

**విభక్తులు/క్రియలు:–** 1) పదకాంక్షిణా–**పదకాంక్షిణా**, పదకాంక్షిభ్యామ్, పదకాంక్షిభిః, నకారాన్త పుంలింగ పదకాంక్షిన్ శబ్దము, తృ.ఏ., 2) కేన–**కేన**, కాభ్యమ్, కైః, మకారాన్త పుంలింగ కిమ్ శబ్దము, తృ.ఏ., 3) నితాన్తదీర్ఘైః – నితాన్తదీర్ఘేన, నితాన్తదీర్ఘాభ్యామ్, **నితాన్తదీర్ఘైః**, అకారాన్త నపుంసకలింగ నితాంతదీర్ఘశబ్దము, తృ.బ., 4) తపోభిః–తపసా, తపోభ్యామ్, **తపోభిః**, సకారాన్త నపుంసకలింగ తపస్ శబ్దము, తృ.బ., 5) తే–**తవ/తే**, యువయోః/వామ్, యుష్మాకమ్/వః, దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము ష.ఏ., 6) అభ్యసూయా – **అభ్యసూయా**, అభ్యసూయే, అభ్యసూయాః, ఆకారాన్త స్త్రీలింగ అభ్యసూయా శబ్దము, ప్ర.ఏ., 7) జనితా–**జనితా**, జనితే, జనితాః, ఆకారాన్త స్త్రీలింగ జనితా శబ్దము, ప్ర.ఏ., 8) యావత్–అవ్యయము, 9) ఆహితసాయకస్య–**ఆహితసాయకస్య**, ఆహితసాయకయోః ఆహితసాయకానామ్, అకారాన్త నపుంసకలింగ ఆహితసాయకశబ్దము, ష.ఏ.,10) మత్కార్ముకస్య – **మత్కార్ముకస్య**, మత్కార్ముకయోః, మత్కార్ముకానామ్, అకారాన్త నపుంసకలింగ మత్కార్ముక శబ్దము, ష.ఏ., 11) అస్య – **అస్య**, అనయోః, ఏషామ్; మకారాన్త నపుంసకలింగ ఇదమ్ శబ్దము, ష.ఏ. 12) నిదేశవర్తీ– **నిదేశవర్తీ**, నిదేశవర్తినౌ, నిదేశవర్తినః, నకారాన్త పుంలింగ నిదేశవర్తిన్ శబ్దము, ప్ర.ఏ., 13) భవతి – క్రియ.

**సమాసాలు:–**

1) పదకాంక్షిణా – పదం కాంక్షతి తచ్ఛీలః (ఉపపదతత్పు) పదకాంక్షీ, తేన.
2) నితాన్తదీర్ఘైః – నితాన్తం దీర్ఘాణి నితాన్తదీర్ఘాణి, తైః, నితాన్తదీర్ఘైః.
3) ఆహితసాయకస్య – ఆహితః సాయకః యస్మిన్ (బహువ్రీహి) తత్,తస్య.
4) మత్కార్ముకస్య– మమ కార్ముకమ్ (ష.త.) మత్కార్ముకమ్, తస్య.
5) నిదేశవర్తీ – నిదేశే వర్తతే (ఉపపదతత్పు.) ఇతి,సః.

**సంధులు:–**

1) కేన+అభ్యసూయా – కేనాభ్యసూయా – సవర్ణదీర్ఘసంధిః.
2) నితాన్తదీర్ఘైః+జనితా – నితాన్తదీర్ఘైర్జనితా – విసర్గసంధిః
3) భవతి+ఆహితసాయకస్య – భవత్యాహితసాయకస్య – యణాదేశసన్ధిః.
4) అభి+అసూయా – అభ్యసూయా – యణాదేశసన్ధిః.





**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **అసూయా –** a) క్రుధద్రుహేర్ష్యాసూయార్థానాం యం ప్రతి కోపః। అమర్షః క్రోధః। అపకారః ద్రోహః। అక్షమా ఈర్ష్యా। **గుణేషు దోషావిష్కరణమ్ అసూయా।** (పా. 1–4–37)

b) యథా – తథయోర**సూయా** – ప్రతివచనే (పా. 3–4–28).

c) వాక్యాదేరామన్త్రితస్**యాసూయా** సంమతికోపకుత్సనభర్త్సనేషు (8–1–8) ఏకార్థః పదసమూహో వాక్యమ్। పరగుణానామసహన**మసూయా।** పూజా సంమతిః। కోపః క్రోధః। నిందనం కుత్సనమ్ । అపకార శబ్దైర్భయోత్పాదనం భర్త్సనమ్.

d) **అసూయా** *పరగుణేషు దోషావిష్కరణమ్* – సిద్ధాన్తకౌముది.

e) *శ్లో॥ పైశున్యం సాహసం ద్రోహ* ***ఈర్ష్యాసూయార్థ****దూషణమ్।*
*వాగ్దండజం చ పారుష్యం క్రోధజోఽపి గణోఽష్టకః॥* 48 (మను)

కొండెములు చెప్పుట, **ఇతరులయొక్క మంచి గుణాలను సహింపకపోవుట,** డబ్బుదొంగిలించుట, ఇవ్వదగిన దానిని ఇవ్వకపోవుట, పరుషముగా మాట్లాడుట, పరుషమైన దండము ఇవన్నీ కోపమువలన కలిగే దుర్వ్యసనాలు.

f) *శ్లో॥ ప్రసవైః సప్తపర్ణానాం మదగన్ధిభిరాహతాః।*
***అసూయ****యేవ తన్నాగాః సప్తధైవ ప్రసుస్రువుః॥ ర.వం. 4–23*

"…. రఘుమహారాజుయొక్క సైన్యమందలి మదపుటేనుగులు సప్తపర్ణ గంధమును పీల్చి, అచట మఱియొక ఏనుగు ఉన్నదేమో యని అసూయ కలవో అన్నట్లు ఏడువిధములుగా మదజలమును స్రవించినవి."

g) అస్యతీత్**యసూయా** –అసు(క్షేపణే).
'అసూయా తు దోషారోపో గుణేష్వపి' – అని అమరకోశము.
గుణేషు సత్స్వపి పరేషు దోషారోపః **అసూయా**…."

h) శ్లో॥ ….. ఽసూయాన్యగుణదూషణమ్॥ – అని అభిధానచిన్తామణి.

**క్రియాదర్శము:– భవతి** – భూ సత్తాయామ్ (ఉండుట) భ్వాదిప్రకరణమ్(1) అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, వర్తమానే లట్ ప్రథమపురుషైకవచనము.

**రూపాలు – భవతి** –భవతః–భవన్తి

–––

**అవతారికా:–** సంప్రతి చతుర్వర్గే మోక్షమధికృత్యాహ–ఇప్పుడు ధర్మాది చతుర్వర్గమున మోక్షమును ఉద్దేశించి చెప్పుచున్నాడు.

**శ్లో॥ అసంమతః కస్తవ ముక్తిమార్గం**
**పునర్భవక్లేశభయాత్ప్రపన్నః।**
**బద్ధశ్చిరం తిష్ఠతు సున్దరీణా–**
**మారేచితభ్రూచతురైః కటాక్షైః॥ 5**

**పదవిభాగము:–** అసంమతః, కః, తవ, ముక్తిమార్గమ్, పునర్భవక్లేశభయాత్, ప్రపన్నః బద్ధః, చిరమ్, తిష్ఠతు, సుందరీణామ్, ఆరేచితభ్రూచతురైః, కటాక్షైః।

**అన్వయక్రమము:–** తవ అసంమతః కః పునర్భవక్లేశభయాత్ ముక్తిమార్గం ప్రపన్నః ఆరేచితభ్రూచతురైః సుందరీణాం కటాక్షైః బద్ధః చిరం తిష్ఠతు।

**ప్రతిపదార్థము:–** తవ–నీకు, అసంమతః – అంగీకృతుడు కానివాడు, కః – ఎవడు, పునర్భవక్లేశభయాత్ – పునర్జన్మమందలి దుఃఖమువలన, భయమువలన, ముక్తిమార్గమ్ – మోక్షమార్గమును, ప్రపన్నః – పొందెనో, ఆరేచితభ్రూచతురైః – ఒకటొకటిగా త్రిప్పబడిన కనుబొమలచే అందముగల, సుందరీణామ్ – అందగత్తెలయొక్క, కటాక్షైః – క్రీగంటి చూపులచేత, బద్ధః – కట్టబడినవాడై, చిరమ్ – చాలా కాలము, తిష్ఠతు – ఉండును గాక!

**తాత్పర్యము:–** నీకు అంగీకృతుడు కానివాడు ఎవడేని పునర్జన్మమందలి దుఃఖము వలన భయమువలన మోక్షమార్గమును పొందెనా? ఒకటొకటిగా త్రిప్పబడిన కనుబొమలచే అందముగల అందగత్తెలయొక్క క్రీగంటి చూపులచేత కట్టబడినవాడై చాలాకాలము ఉండును గాక!

**పాఠాన్తరములు:–** 1) కటాక్షైః – విలాసైః.

**విభక్తులు/క్రియలు:–**1) తవ–**తవ/తే**, యువయోః/వామ్,యుష్మాకమ్/వః, దకారాన్తపుంలింగ యుష్మచ్ఛబ్దము–ష.ఏ., 2) అసంమతః–**అసంమతః**, అసంమతౌ, అసంమతాః, అకారాన్త పుంలింగ అసంమత శబ్దము–ప్ర.ఏ., 3) కః–**కః**, కౌ, కే మకారాన్త పుంలిగ కిమ్ శబ్దము–ప్ర.ఏ., 4) పునః....భయాత్–**....భయాత్**, భయాభ్యామ్, భయేభ్యః, అకారాన్త నపుంసకలింగ పున...భయశబ్దము – పంచమీ ఏకవచనము, 5) ముక్తిమార్గమ్–**ముక్తిమార్గమ్**, ముక్తిమార్గౌ, ముక్తిమార్గాన్, అకారాన్త పుంలింగ ముక్తి మార్గశబ్దము–ద్వి.ఏ., 6) ప్రపన్నః–**ప్రపన్నః**, ప్రపన్నౌ, ప్రపన్నాః, అకారాన్త పుంలింగ ప్రపన్న శబ్దము–ప్ర.ఏ., 7) ఆరేచితభ్రూచతురైః–....చతురేణ, ...చతురాభ్యామ్, **...చతురైః**, అకారాన్తపుంలింగ





....చతరశబ్దము–తృ.బ., 8) సుందరీణామ్–సుందర్యాః, సుందర్యోః, **సుందరీణామ్**, ఈకారాన్త స్త్రీలింగ సుందరీశబ్దము–ష.బ., 9) కటాక్షైః–కటాక్షేణ, కటాక్షాభ్యామ్,**కటాక్షైః**, అకారాన్త పుంలింగకటాక్షశబ్దము–తృ.బ.,10) బద్ధః–**బద్ధః**, బద్ధౌ, బద్ధాః, అకారాన్త పుంలింగ బద్ధశబ్దము–ప్ర.ఏ.,11) చిరమ్–అవ్యయము, 12) తిష్ఠతు–క్రియ–స్థా+లోట్ – ప్రథమపురుషైకవచనము.

**సమాసాలు:–**

1) అసంమతః – న సంమతః (నఞ్తత్పురుష).
2) పునర్భవక్లేశభయాత్ – పునర్భవే క్లేశాః (స.త.) పునర్భవక్లేశః, పునర్భవక్లేశేభ్యః భయమ్, (పంచమీ తత్పురుష), తస్మాత్.
3) ముక్తిమార్గమ్ – ముక్తేః మార్గః (ష.త.) ముక్తిమార్గః, తమ్.
4) ఆరేచితభ్రూచతురైః–భ్రువః ఆరేచితా ఆరేచితభ్రువః, తాభిః చతురాః ఆరేచిత భ్రూచతురాః, తైః, ఆరేచితభ్రూచతురైః।

**సంధులు:–**

1) కః+తవ – కస్తవ – విసర్గసంధిః.
2) బద్ధః+చిరమ్ – బద్ధశ్చిరమ్ – శ్చుత్వసన్ధిః.

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) a) **ఆరేచిత** 1) 'రిచ్' – వియోజనసంపర్చనయోః రేచతి రేచయతి ణి.
2) 'ఆధృషాదవా' ఇతి ణిజయావ పక్షే రేచతి ఇత్యాది.

b) 1) రేచితమేకస్యా భ్రువో లలితోత్క్షేపణమ్। యథోక్తం సంగీతశాస్త్రే–
*"రేచితం పునరేకస్యా లలితోత్క్షేపణం భ్రువ"* ఇతి
2) 'ఆరేచితం నర్తితం స్యాది' తి భోజః। అయం తు పక్షే మాధవోక్తః।
– 'వివరణమ్' వ్యాఖ్య.

c) ఆరేచిత లక్షణం తు – (సంజీవినీ వ్యాఖ్య)
*"స్యాద్భ్రువోర్లలితాక్షేపాదేకస్యా ఏవ రేచితమ్।*
*తయోర్మూలసముత్క్షేపం కౌటిల్యాద్భ్రూకుటిం విదుః॥* ఇతి.

d) "రేచితభ్రూలతైరపాంగవీక్షితైః...." దశకుమారచరితము.

**క్రియాదర్శము:– తిష్ఠతు**– ష్ఠా (స్థా) గతి నివృత్తౌ (నిలుచుట), అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ – లోట్ ప్రథమపురుషరూపాలు – **తిష్ఠతు**/తిష్ఠతాత్–తిష్ఠతామ్–తిష్ఠన్తు.

---

**అవతారికా:–** ధర్మార్థౌ అధికృత్యాహ – ధర్మార్థముల నుద్దేశించి చెప్పుచున్నాడు.

**శ్లో॥ అధ్యాపితస్యోశనసాపి నీతిం**
**ప్రయుక్తరాగప్రణిధిర్ద్విషస్తే ।**
**కస్యార్థధర్మౌ వద పీడయామి**
**సిన్ధోస్తటావోఘ ఇవ ప్రవృద్ధః॥ 6**

**పదవిభాగము:–** అధ్యాపితస్య, ఉశనసా,అపి, నీతిమ్, ప్రయుక్తరాగప్రణిధిః, ద్విషః, తే, కస్య, అర్థధర్మౌ, వద, పీడయామి, సిన్ధోః, తటౌ, ఓఘః,ఇవ,ప్రవృద్ధః.

**అన్వయక్రమము:–** ఉశనసా నీతిమ్ అధ్యాపితస్య అపి తే ద్విషః కస్య అర్థధర్మౌ ప్రయుక్తరాగప్రణిధిః అహం ప్రవృద్ధః ఓఘః సిన్ధోః తటౌ ఇవ పీడయామి। వద।

**ప్రతిపదార్థము:–** ఉశనసా – శుక్రాచార్యునిచేత, నీతిమ్ – నీతిశాస్త్రమును, అధ్యాపితస్య అపి–నేర్పబడినవాడైనప్పటికి, తే–నీ యొక్క, ద్విషః–పగవానికి, కస్య –ఎవనికి, అర్థధర్మౌ–అర్థమును ధర్మమును, ప్రయుక్తరాగప్రణిధిః–ప్రయోగింపబడిన –విషయాభిలాషయనెడు దూతగలవాడనై, ప్రవృద్ధః–వృద్ధినొందిన, ఓఘః–ప్రవాహము,సిన్ధోః–నదియొక్క, తటౌ ఇవ–ఒడ్డులనువలె, పీడయామి–బాధించెదను, వద–చెప్పుము.

**తాత్పర్యము :–** శుక్రాచార్యునిచేత నీతిశాస్త్రమును నేర్పబడిన వాడైనప్పటికిని నీ యొక్క పగవానికి ఎవనికి అర్థమును ధర్మమును, ప్రయోగింపబడిన విషయాభిలాష యనెడు దూతగలవాడనై, వృద్ధిపొందిన ప్రవాహము నదియొక్క ఒడ్డులనువలె బాధించెదను, చెప్పుము.

**పాఠాన్తరములు:–** 1) పీడయామి – పీడయాని.

**విభక్తులు/క్రియలు:–** 1) ఉశనసా–**ఉశనసా**, ఉశనోభ్యామ్, ఉశనోభిః, సకారాన్తపుంలింగ ఉశనశ్శబ్దము–తృ.ఏ., 2) నీతిమ్–**నీతిమ్**, నీతీ, నీతీః, ఇకారాన్తస్త్రీలింగ నీతిశబ్దము–ద్వి.ఏ., 3) అధ్యాపితస్య–**అధ్యాపితస్య**, అధ్యాపితయోః, అధ్యాపితానామ్, అకారాన్తపుంలింగ అధ్యాపితశబ్దము, ష.ఏ., 4) అపి, ఇవ–అవ్యయాలు, 5) తే–**తవ/తే**, యువయోః/వామ్, యుష్మాకమ్/వః, దకారాన్త పుంలింగయుష్మచ్ఛబ్దము–ష.ఏ., 6) ద్విషః–**ద్విషః**, ద్విషోః, ద్విషామ్, షకారాన్తపుంలింగద్విట్శబ్దము–ష.ఏ., 7) కస్య–**కస్య**, కయోః, కేషామ్, మకారాన్తపుంలింగ కిమ్ శబ్దము, ష.ఏ., 8) అర్థధర్మౌ–, అర్థధర్మౌ, – ద్వితీయావిభక్తిద్వివచనము. 9) ప్రయుక్తరాగప్రణిధిః–....**ప్రణిధిః**, ప్రణిధీ, ప్రణిధయః ఇకారాన్తపుంలింగ .... ప్రణిధిశబ్దము, ప్ర.ఏ., 10) ప్రవృద్ధః – **ప్రవృద్ధః**, ప్రవృద్ధౌ, ప్రవృద్ధాః,





అకారాన్త పుంలింగ ప్రవృద్ధశబ్దము, ప్ర.ఏ., 11) ఓఘః – **ఓఘః**, ఓఘౌ, ఓఘాః, అకారాన్త పుంలింగ ఓఘశబ్దము, ప్ర.ఏ., 12) సిన్ధోః–**సిన్ధోః**, సిన్ధ్వోః, సిన్ధూనామ్, ఉకారాన్తపుంలింగ సిన్ధు శబ్దము–ష.ఏ., 13) తటౌ–తటమ్, **తటౌ**, తటాన్, అకారాన్త పుంలింగ తటశబ్దము, ద్వి.ద్వి., 14) పీడయామి–క్రియ పీడ్+లట్,ఉత్తమపురుషైకవచనము, 15) వద–వద్+లోట్–మధ్యమపురుషైకవచనము.

**సమాసాలు:–**

1) అర్థధర్మౌ – అర్థశ్చ ధర్మశ్చ ఇతి (ద్వంద్వ) తౌ.
2) ప్రయుక్తరాగప్రణిధిః – రాగ ఏవ ప్రణిధిః (కర్మధా) రాగప్రణిధిః, ప్రయుక్తః రాగప్రణిధిః యేన (బహుప్రీహి) సః।
3) ప్రవృద్ధః – ప్రకర్షేణ వృద్ధః (ప్రాదితత్పు) ప్రవృద్ధః.

**సంధులు:–**

1) అధ్యాపితస్య+ఉశనసా – అధ్యాపితస్యోశనసా – గుణసన్ధిః.
**ఆద్గుణః** (సూ. 6–1–84):– అవర్ణమునకు (అ,ఆ లకు) హ్రస్వదీర్ఘములయిన ఇ, ఉ, ఋ, ఌ వర్ణములు పరముగానున్నపుడు పూర్వపరముల స్థానములో గుణము ఏకాదేశమగును. ఇచట గుణములు క్రమముగ ఏ,ఓ,అర్,అల్, అనునవి ఆదేశమగునని తాత్పర్యము.
2) ఉశనసా+అపి – ఉశనసాపి – సవర్ణదీర్ఘసంధిః.
3) ప్రణిధిః+ద్విషః – ప్రణిధిర్ద్విషః – విసర్గసంధిః.
4) ద్విషః + తే – ద్విషస్తే – విసర్గసంధిః.
5) కస్య + అర్థ – కస్యార్థ ... – సవర్ణదీర్ఘసంధిః
6) సిన్ధోః + తటౌ – సిన్ధోస్తటౌ – విసర్గసంధిః
7) తటౌ + ఓఘః – తటావోఘః – **ఏచోఽయవాయావః** (సూ. 6–1–78) ఏ ఓ ఐ ఔ లకు అచ్చుపరముగానున్నపుడు క్రమముగా అయ్, అవ్, ఆయ్, ఆవ్ అనునవి ఆదేశముగ వచ్చును.
8) ఓఘః+ఇవ – ఓఘ ఇవ – విసర్గలోపసంధిః.
అశ్ వర్ణములు (అనగా అచ్చులు, వర్గ తృతీయ చతుర్థ పంచమ వర్ణములు, య ర ల వ లు), హకారము పరమైనపుడు విసర్గ లోపించును, (కాని, హ్రస్వ అకారము, మృదుహల్లులు పరమైనచో ఓకారాదేశమగును.)

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) అర్థధర్మౌ – అర్థశ్చ ధర్మశ్చ ఇతి (ద్వంద్వసమాసః), తౌ.

**ద్వంద్వసమాసః –** ఇది ఉభయపదముల అర్థములు ప్రధానమైనదిగ ఉండును. ద్వంద్వ సమాసములో ఎన్నిపదములు సమసించునో వాని అర్థములన్నియు ప్రధానములని అర్థము. ఇతరేతరయోగము, సమాహారము అను అర్థములలో అనేకములగు సుబంతములు సమాసమునొందుటను **ద్వంద్వసమాస** మందురు.

**చార్థే ద్వంద్వః (సూ. 2–2–29).**

ద్వంద్వము – 1) ఇతరేతరయోగము 2) సమాహారము అని '2' విధములు. ఇవి ద్విపదములు, బహుపదములని రెండేసి విధములు.

1) **ఇతరేతర యోగ ద్విపద ద్వంద్వః** – ఇందు రెండు పదములున్నందున ఇది **ద్వివచనము**లో నుండును. రెండుపదముల అర్థములును ప్రధానములే.
అర్థధర్మౌ – అర్థశ్చ ధర్మశ్చ – అర్థధర్మౌ.

2) **ఇతరేతరయోగబహుపద ద్వంద్వః** – ఇందు చాలపదములున్నందున ఇది **బహువచనము** లో నుండును. అన్నిపదముల అర్థములును ప్రధానములే.
ధర్మార్థకామమోక్షాః – ధర్మశ్చ అర్థశ్చ కామశ్చ మోక్షశ్చ.

3) **సమాహార ద్విపద ద్వంద్వః** – సమాహారమనగా సమూహము. సమూహము ఒక్కటియే యగును. అందువలన ఇది ఏకవచనమున మాత్రమే ఉండును.
ప్రాణీ చ పాదౌ చ ఏషాం సమాహారః – పాణిపాదమ్.

4) **సమాహారబహుపద ద్వంద్వః** – ఇది ఏకవచనమున మాత్రమే ఉండును.
వక్షశ్చ ముఖఞ్చ అఙ్గఞ్చ ఏషాం సమాహారః – వక్షోముఖాఙ్గమ్.

**క్రియాదర్శము:–** 1) **పీడయామి** – పీడ్ (పీడ) అవగాహనే చురాదిప్రకరణమ్(10), ఉభయపదీ, సేట్, లట్ ఉత్తమరుపుషైకవచనము.

రూపాలు:– **పీడయామి** – పీడయావః – పీడయామః

2) **వద** – వద (వ్యక్తాయాం వాచి) మాట్లాడుట, భ్వాదిప్రకరణమ్ (1) పరస్మైపదీ సకర్మకమ్, సేట్, లోట్, మధ్యమపురుషైకవచనము.

రూపాలు:– **వద/వదతాత్** – వదతమ్, వదత.

---





**అవతారికా:–** కామమధికృత్యాహ – కామమునుద్దేశించి చెప్పుచున్నాడు.

**శ్లో॥ కామేకపత్నీవ్రతదుఃఖశీలాం**
**లోలం మనశ్చారుతయా ప్రవిష్టామ్।**
**నితమ్బినీమిచ్ఛసి ముక్తలజ్జాం**
**కణ్ఠే స్వయంగ్రాహనిషక్తబాహుమ్॥ 7**

**పదవిభాగము:–** కామ్, ఏకపత్నీవ్రతదుఃఖశీలామ్, లోలమ్, మనః, చారుతయా, ప్రవిష్టామ్, నితమ్బినీమ్, ఇచ్ఛసి, ముక్తలజ్జామ్, కణ్ఠే, స్వయంగ్రాహనిషక్తబాహుమ్।

**అన్వయక్రమము:–** ఏకపత్నీవ్రతదుఃఖశీలాం చారుతయా లోలం మనః ప్రవిష్టాం కాం నితమ్బినీం ముక్తలజ్జాం (సతీం) కణ్ఠే స్వయంగ్రాహనిషక్తబాహుమ్।

**ప్రతిపదార్థము:–**ఏకపత్నీవ్రతదుఃఖశీలామ్–ఒక్కడే పతిగలదానియొక్క నియమముచే దుఃఖస్వభావముగలదియును అగు, చారుతయా – సౌందర్యముచేత, లోలమ్ – ఆసక్తిగల, మనః – (నీ) మనస్సును, ప్రవిష్టామ్ – ప్రవేశించినట్టి, కామ్ – ఏ, నితమ్బినీమ్ – రమణిని, ముక్తలజ్జామ్ – విడువబడినసిగ్గుకలదియై, కణ్ఠే – (నీ) కంఠమునందు, స్వయంగ్రాహనిషక్తబాహుమ్ – స్వయముగా గ్రహింపదగిన, కలసికొను భుజములు గలదానినిగాను, ఇచ్ఛసి – కోరుచున్నావు?

**తాత్పర్యము :–** ఒక్కటే పతిగలదానియొక్క నియమముచేత దుఃఖస్వభావము కలదియు, సౌందర్యముచే ఆసక్తిగల (నీ) మనస్సును ప్రవేశించునట్టి ఏ రమణిని విడువబడిన సిగ్గుకలదియై (నీ) కంఠమునందు స్వయముగా గ్రహింపదగిన, కలసికొనిన భుజములుగల దానినిగాను కోరుచున్నావు?

**విభక్తులు/క్రియలు:–** 1) ఏకపత్నీవ్రతదుఃఖశీలామ్– **…శీలామ్**, …శీలే, ….శీలాః, ఆకారాన్త స్త్రీలింగ …శీలాశబ్దము, ద్వి.ఏ., 2) చారుతయా – **చారుతయా,** చారుతాభ్యామ్, చారుతాభిః, ఆకారాన్త స్త్రీలింగ **చారుతా**శబ్దము, తృ.ఏ., 3) లోలమ్ – **లోలమ్**, లోలే, లోలాని, అకారాన్తనపుంసకలింగ లోలశబ్దము. ద్వి.ఏ., 4) మనః – **మనః**, మనసీ, మనాంసి, సకారాన్త నపుంసకలింగ మనశ్శబ్దము –ద్వి.ఏ., 5) ప్రవిష్టామ్–**ప్రవిష్టామ్,** ప్రవిష్టే, ప్రవిష్టాః, ఆకారాన్త స్త్రీలింగ ప్రవిష్టాశబ్దము–ద్వి.ఏ., 6) కామ్–**కామ్**, కే, కాః, మకారాన్తస్త్రీలింగ కిమ్శబ్దము, ద్వి.ఏ., 7) నితమ్బినీమ్–**నితమ్బినీమ్,** నితమ్బిన్యౌ, నితమ్బినీః ఈకారాన్తస్త్రీలింగ నితమ్బినీ శబ్దము, ద్వి.ఏ., 8) ముక్తలజ్జామ్–**ముక్తలజ్జామ్,** ముక్తలజ్జే, ముక్తలజ్జాః ఆకారాన్త స్త్రీలింగ ముక్తలజ్జాశబ్దము, ద్వి.ఏ., 9) కణ్ఠే–**కణ్ఠే**, కణ్ఠయోః, కణ్ఠేషు, అకారాన్త పుంలింగ కణ్ఠశబ్దము, స.ఏ., 10) స్వయ…బాహుమ్– …**బాహుమ్,** …బాహూ, …బాహూః ఉకారాన్త స్త్రీలింగ బాహుశబ్దము, ద్వి.ఏ., 11) ఇచ్ఛసి–క్రియ – లట్ మధ్యమపురుషైకవచనము.

**సమాసాలు:-**

1) ఏకపత్నీవ్రతదుఃఖశీలామ్ - ఏకః పతిః యస్యాః సా (బహువ్రీహి) ఏకపత్నీ తస్యాః వ్రతమ్ ఏకపత్నీవ్రతమ్ (ష.త.) దుఃఖం శీలం యస్యాః సా దుఃఖ శీలా (బహువ్రీహి), ఏకపత్నీవ్రతేన దుఃఖశీలా, (తృ.త.) ఏకపత్నీవ్రత దుఃఖశీలా, తామ్.
2) ముక్తలజ్జామ్ - ముక్తా లజ్జా యయా (బహువ్రీహి) సా ముక్తలజ్జా, తామ్.
3) నితమ్బినీమ్ - ప్రశస్తః నితమ్బః అస్తి యస్యాః (బహువ్రీహి) సా నితమ్బినీ, తామ్.
4) స్వయంగ్రాహనిషక్తబాహుమ్-స్వయం గృహ్ణాతీతి (ఉపపదతత్పు) స్వయం గ్రాహో, నిషక్తౌ బాహూ యస్యాః (బహువ్రీహి) సా నిషక్తబాహుః, స్వయం గ్రాహో చాసౌ నిషక్తబాహుశ్చేతి (కర్మధా), స్వయంగ్రాహనిషక్తబాహుః తామ్.

**సంధులు:-** 1) మనః+చారుతయా - మనశ్చారుతయా - శ్చుత్వసంధిః

**పాఠాన్తరములు:-** 1) నిషక్త - విషక్త (కర్మార్కర్ ఎడిషన్)

**పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణాలు-కావ్యప్రయోగాలు:-**

1) **ఏకపత్నీ -** a) ఏకః పతిః యస్యాః సా ఏకపత్నీ.

b) శ్లో॥ *తాం చావశ్యం దివస గణనా తత్పరా**మేకపత్నీ**-*
*మవ్యాపన్నామవిహతగతిర్ద్రక్ష్యసి భ్రాతృజాయామ్॥*
.... మేఘదూతమ్ - 10

"ఓ మేఘుడా! నిరాటంక గమనము కలవాడవై, శేషించిన దినముల లెక్కయందు ఆసక్తురాలును, ఏకభర్తృకమును, సోదరపత్నియునగు ఆ నా ప్రేయసిని తప్పక ప్రమాదరహితనుగా చూచెదవు....".

c) శ్లో॥ *ఆసీతామరణాత్ కాంతా నియతా బ్రహ్మచారిణీ।*
*యో ధర్మ **ఏకపత్నీ**నాం కాంక్షంతీ తమనుత్తమమ్॥* మనుస్మృతి 5-158

"తాను చనిపోవు వఱకు ఓపిక కలదై నియమముతో నుండి బ్రహ్మచారిణియై పరపురుషుని కోరక ప్రవర్తించవలెను".

d) ఏకపత్నీవ్రతమ్-ఆప్టే ఈ పదాన్ని వివరిస్తూ ఈ శ్లోకాన్నే ఉదాహరించినాడు.





e) శ్లో॥ *పరపత్నీ తు యా స్త్రీస్యాత్, అసంబంధా చ యోనితః।*
*తాం బ్రూయాద్భవతీత్యేవం, సుభగే భగినీతి చ ॥* మనుస్మృతి 2-129

రక్తబంధువు కానట్టి స్త్రీని, పరుని భార్యయైన స్త్రీని, భవతీ (పూజ్యురాలా!) సుభగే (సౌభాగ్యవతి!) భగినీ (సోదరి) అనియే సంబోధించవలయును.

f) అత్ర రూపసౌందర్యాణాం నిరవధికత్వాద్, మనసః స్వభావలౌల్యాద్, అహల్యా వృత్తాన్తేన మహేంద్రస్య పరదారికత్వాద్ చ న కాచిదనుపపత్తిః। శ్రుతిరప్యాహ - 'అహల్యాయై జారః" ఇతి.

2) **అత్ర మనః ప్రవిష్టామిత్యనేన మహేన్ద్రస్య సంకల్పాభిధానా**
తృతీయా కామావస్థా దర్శితా। యథాహ - *(వివరణమ్ వ్యాఖ్యా)*
*"చక్షుః ప్రీతిః ప్రథమం చిత్తాసఙ్గస్తతోథ సంకల్పః।*
*నిద్రాచ్ఛేదస్తమతా విషయనివృత్తి స్త్రపానాశః।*
*ఉన్మాదో మూర్ఛా మృతిరిత్యేతాః స్మరదశా దశైవ స్యుః॥"* ఇతి.

3) **చక్షుః ప్రీతిర్మనస్సంగః సంకల్పోత్పత్తిః నిద్రాచ్ఛేదః**
తనుతా విషయేభ్యోవ్యావృత్తిః లజ్జాప్రణాశః ఉన్మాదః మూర్ఛా మరణమితి తేషాం లింగాని అని 'వాత్స్యాయనుడు'.

**క్రియాదర్శము:- ఇచ్ఛసి** - ఇష (ఇష్) ఇచ్ఛాయామ్ (కోరుట) తుదాదిప్రకరణమ్(6). సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లట్ - మధ్యమపురుషైకవచనము.

రూపాలు:- **ఇచ్ఛసి** - ఇచ్ఛథః - ఇచ్ఛథ.

శ్లో॥ *అసంగమద్రిష్వపి సారవత్తయా*
*న మే త్వదన్యేన విసోఢమాయుధమ్।*
*అవేహి మాం ప్రీతమృతే తురంగమా-*
***త్కిమిచ్ఛసీతి** స్ఫుటమాహ వాసవః॥* ర.వం. 3-63.

---

**అవతారికా:-** త్రివిధ నాయికా-స్వకీయా పరకీయా సాధారణీ చేతి-తత్ర పరకీయాం ప్రత్యుక్తమ్ - ఇతరే ప్రత్యాహ - స్వీయ పరకీయ సాధారణ లనుకాంతలలో పరకీయను చెప్పి మిగిలిన వారినిగూర్చి చెప్పుచున్నాడు.

శ్లో॥ కయాసి కామిన్! సురతాపరాధాత్
పాదానతః కోపనయావధూతః।
తస్యాః కరిష్యామి దృఢానుతాపం
ప్రవాళశయ్యాశరణం శరీరమ్॥ 8

**పదవిభాగము:–** కయా, అసి, కామిన్! సురతాపరాధాత్, పాదానతః, కోపనయా, అవధూతః, తస్యాః, కరిష్యామి, దృఢానుతాపమ్, ప్రవాళశయ్యాశరణమ్, శరీరమ్.

**అన్వయక్రమము:–** కామిన్! సురతాపరాధాత్ పాదానతః కోపనయా కయా అవధూతః అసి। తస్యాః శరీరం దృఢానుతాపమ్ ప్రవాళశయ్యాశరణమ్ కరిష్యామి।

**ప్రతిపదార్థము:–** (హే) కామిన్! – (ఓ) కాముకుడా!, సురతాపరాధాత్ – రతిక్రీడ యందు తప్పిదమువలన, పాదానతః – పాదములకు క్రిందకు వంగిన వాడవయి, కోపనయా – కోపస్వభావపురాలైన, కయా – ఎవతెచేత, అవధూతః – తిరస్కరింప బడినవాడవు, అసి – అయితివి?, తస్యాః – ఆమెయొక్క, శరీరమ్ – దేహమును, దృఢానుతాపమ్ – దృఢమైన పశ్చాత్తాపముగలదిగాను, ప్రవాళశయ్యాశరణమ్ – చివుళ్లయొక్క సెజ్జయే రక్షకమైనదిగాను, కరిష్యామి – చేయుచున్నాను.

**తాత్పర్యము :–** ఓ కాముకుడా! రతిక్రీడయందు తప్పిదమువలన (ఇతరకాంతను కూడుటచేత) పాదములకు క్రిందకు వంగినవాడవయి, (పాదములపైపడినను) కోపస్వభావురాలైన ఎవతెచేత పశ్చాత్తాపము గలదిగాను, చివుళ్లయొక్క సెజ్జయే రక్షకమైనదానినిగాను చేయుచున్నాను.

**పాఠాన్తరములు:–** 1) సురతాపరాధాత్ – సహసాపరాధాత్, 2) తస్యాః–యస్యాః

**విభక్తులు/క్రియలు:–** 1) కామిన్–హే **కామిన్!**, హే కామినౌ, హే కామినః, నకారాన్త పుంలింగ కామిన్ శబ్దము. సంబోధన ప్ర.ఏ.,2) సురతాపరాధాత్–...**రాధాత్,** ...రాధాభ్యామ్, ...రాధేభ్యః, అకారాన్త పుంలింగ సురతాపరాధశబ్దము, పం.ఏ., 3) పాదానతః– పాదానతః, పాదానతౌ, పాదానతాః అకారాన్తపుంలింగ పాదానత శబ్దము, ప్ర.ఏ., 4) అవధూతః–**అవధూతః**, అవధూతౌ, అవధూతాః, అకారాన్త పుంలింగ అవధూతశబ్దము, ప్ర.ఏ., 5) కోపనయా–**కోపనయా**, కోపనాభ్యామ్, కోపనాభిః ఆకారాన్తస్త్రీలింగ కోపనా శబ్దము, తృ.ఏ., 6) కయా–**కయా**, కాభ్యామ్, కాభిః, మకారాన్త స్త్రీలింగ కిమ్ శబ్దము, తృ.ఏ., 7) అసి–క్రియ– లట్–మధ్యమపురుషైకవచనమ్ – అస్ ధాతువు, 8) తస్యాః –**తస్యాః**, తయోః, తాసామ్, దకారాన్త స్త్రీలింగతచ్ఛబ్దము, ష.ఏ., 9) శరీరమ్–**శరీరమ్**, శరీరే, శరీరాణి, అకారాన్త నపుంసకలింగ శరీరశబ్దము, ద్వి.ఏ., 10) దృఢానుతాపమ్–...**తాపమ్,** ...తాపే, ....తాపాని, అకారాన్త నపుంసకలింగ తాపశబ్దము, ద్వి.ఏ., 11) ప్రవాళ...శరణమ్–...**శరణమ్,**





...శరణే, ...శరణాని, అకారాన్త నపుంసకలింగ శరణశబ్దము, ద్వి.ఏ., 12) కరిష్యామి–క్రియ–లృట్, ఉత్తమపురుషైకవచనము – డుకృఞ్ధాతువు.

**సమాసాలు:–**

1) సురతాపరాధాత్–శోభనం రతం (ప్రాదితత్పు) సురతమ్, సురతే అపరాధః (స.త.), సురతాపరాధః, తస్మాత్.
2) పాదానతః–పాదయోః ఆనతః (స.త.) పాదానతః.
3) దృఢానుతాపమ్ – దృఢః అనుతాపః యస్మిన్ (బహువ్రీహి) తత్.
4) ప్రవాళశయ్యాశరణమ్ – ప్రవాళానాం శయ్యా (ష.త.) ప్రవాళశయ్యా, తత్ శరణం యస్య (బహువ్రీహి) తత్, ప్రవాళశయ్యాశరణమ్.

**సంధులు:–** 1) కోపనయా+అవధూతః – కోపనయావధూతః – సవర్ణదీర్ఘసంధిః

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **అపరాధః –** a) అప+రాధ్+భావే+ఘఞ్ – అకార్యాదిదోషః.

b) *శ్లో॥ అహన్యహని యో మర్త్యో గీతాధ్యాయం తు సంపఠేత్।*
*ద్వాత్రింశదపరాధైస్తు అహన్యహాని ముచ్యతే ॥*

*శ్లో॥ తులస్యా కురుతే యస్తు శాలగ్రామ శిలార్చనమ్।*
*ద్వాత్రింశదపరాధాంశ్చ క్షమతే తస్య కేశవః॥*

*శ్లో॥ ద్వాదశ్యాం జాగరే విష్ణోర్యః పఠేత్తులసీస్తవమ్।*
*ద్వాత్రింశదపరాధాని క్షమతే తస్య కేశవః॥*

*శ్లో॥ యః కరోతి హరేః పూజాం కృష్ణశస్త్రాఙ్కితో నరః।*
*అపరాధసహస్రాణి నిత్యం హరతి కేశవః॥ –ఇతి హరిభక్తివిలాసే'9' విలాసః*

c) "వ్యలీకమ**పరాధః** స్యాదాగో మన్తుశ్చ విప్రియమ్" – అని హలాయుధకోశము '5' నామములను పేర్కొన్నది.

d) "యథేన్ద్రశత్రుః స్వరతోఽ**పరాధాత్**" – శిక్షా. 52

e) "సర్వా**పరాధేషు** అవధ్యాః ఖలు దూతాః" – అభిషేకనాటకమ్.

f) "యథా**పరాధ**దణ్డానామ్" – రఘువంశమ్ 1–6.

g) శ్లో॥ అదః సురేన్ద్రస్య కృతా**పరాధాన్** ప్రక్షిప్య దైత్యాల్లవణామ్బురాశౌ।
వాయవ్యమస్త్రం శరధిం పునస్తే మహోరగః శ్వభ్రమివ ప్రవిష్టమ్॥
– విక్రమోర్వశీయమ్–ప్రథమాంకః – 29

h) "కృతా**పరాధ**మివ త్వయ్యాత్మానమవగచ్ఛతి" – కాదంబరి–203

i) శ్లో॥ **అపరాధ**సహస్రసంకులే పతితం భీమభవార్ణవోదరే।
అగతిం శరణాగతం హరే! కృపయా కేవలమాత్మసాత్కురు॥
– ఇతి ముకుందమాలా.

j) శ్లో॥ **అపరాధో** న మేఽస్తీతి నైతద్విశ్వాసకారణమ్।
విద్యతే హి నృశంసేభ్యో భయం గుణవతామపి॥ – హితోపదేశః–1–76

"నాయందు ఏ దోషము లేదు, నా కేమి భయము– అని మంచివారు కూడ ఏమరి ఉండరాదు. ఏమంటే దుర్మార్గులైన వారివల్ల ఎంత మంచివారికైనా అపాయము ఉంటూనే ఉంటుందీ లోకములో సుమా...!"

---

**శ్లో॥ ప్రసీద విశ్రామ్యతు వీర! వజ్రం**
**శరైర్మదీయైః కతమస్సురారిః।**
**బిభేతు మోఘీకృతబాహువీర్యః**
**స్త్రీభ్యోఽపి కోపస్ఫురితాధరాభ్యః॥ 9**

**పదవిభాగము:–** ప్రసీద, విశ్రామ్యతు, వీర! వజ్రమ్, శరైః, మదీయైః, కతమః, సురారిః, బిభేతు, మోఘీకృతబాహువీర్యః, స్త్రీభ్యః, అపి, కోపస్ఫురితాధరాభ్యః।

**అన్వయక్రమము:–** వీర! ప్రసీద। వజ్రం విశ్రామ్యతు। మదీయైః శరైః మోఘీకృత బాహువీర్యః కతమః సురారిః కోపస్ఫురితాధరాభ్యః స్త్రీభ్యోఽపి బిభేతు।

**ప్రతిపదార్థము:–** (హే) వీర!–(ఓ) శూరుడా!, ప్రసీద – అనుగ్రహింపుము, వజ్రమ్ – వజ్రాయుధము, విశ్రామ్యతు – విశ్రమించునుగాక! మదీయైః శరైః – నావైన బాణములచేత, మోఘీకృతబాహువీర్యః – వమ్ముగా చేయబడిన భుజశక్తి కలవాడై, కతమః సురారిః – (దైత్యదానవులలో) ఏసురవైరి, కోప–స్ఫురిత–అధరాభ్యః–కినుకచే కదలుచున్న క్రిందుపెదవులుగల, స్త్రీభ్యోఽపి–స్త్రీలనుండియు,బిభేతు–భయపడుగాక!

**తాత్పర్యము :–** ఓ శూరుడా! అనుగ్రహింపుము. వజ్రాయుధము విశ్రమించుగాక! నావైన బాణములచేత వమ్ముగా చేయబడిన భుజశక్తికలవాడై ఏ సురవైరి, కినుకచే కదలుచున్న క్రిందు పెదవులుగల స్త్రీలనుండియు భయపడుగాక!





**విభక్తులు/క్రియలు:–** 1) హే వీర!–**హేవీర!**, హే వీరౌ!, హే వీరాః, అకారాన్త పుంలింగ వీరశబ్దము, సం.ప్ర.ఏ., 2) ప్రసీద–క్రియ–ప్ర+సద్+లోట్–మధ్యమపురుషైకవచనము, 3) వజ్రమ్–**వజ్రమ్**, వజ్రే, వజ్రాణి, అకారాన్త నపుంసకలింగ వజ్రశబ్దము, ప్ర.ఏ., 4) విశ్రామ్యతు – వి+శ్రము+లోట్ – ప్రథమపురుషైకవచనము, 5) బిభేతు–భీ+లోట్–ప్రథమపురుషైకవచనము, 6) మదీయైః–మదీయేన, మదీయాభ్యామ్, **మదీయైః**, అకారాన్తపుంలింగ మదీయశబ్దము, తృ.ఏ., 7) శరైః–శరేణ, శరాభ్యామ్, **శరైః**, అకారాన్తపుంలింగ శరశబ్దము, తృ.బ., 8) మోఘీకృతబాహువీర్యః–**...వీర్యః**, ...వీర్యౌ, ...వీర్యాః అకారాన్తపుంలింగ ....వీర్యశబ్దము, ప్ర.ఏ., 9) కతమః – **కతమః**, కతమౌ, కతమాః, అకారాన్తపుంలింగ కతమ శబ్దము, ప్ర.ఏ., 10) సురారిః–**సురారిః**, సురారీ, సురారయః, ఇకారాన్త పుంలింగ సురారి శబ్దము, ప్ర.ఏ., 11) కోప–స్ఫురిత–అధరాభ్యః– ...అధరాయాః, ...అధరాభ్యామ్, **...అధరాభ్యః**, ఆకారాన్త స్త్రీలింగ ...అధరాశబ్దము, పంచమీబహువచనము, 12) స్త్రీభ్యః–స్త్రియాః, స్త్రీభ్యామ్, **స్త్రీభ్యః** ఈకారాన్త స్త్రీలింగ స్త్రీశబ్దము, పం.బ., 13) అపి–అవ్యయము.

**సమాసాలు:–**

1) మోఘీకృతబాహువీర్యః – న మోఘమ్ అమోఘమ్, అమోఘం మోఘం సంపద్యమానం తథా కృతం మోఘీకృతం, బాహ్వోః వీర్యం (ష.త.) బాహువీర్యమ్,మోఘీకృతం బాహువీర్యం యస్య (బహువ్రీహి) సః, మోఘీకృత వీర్యః.

2) కోపస్ఫురితాధరాభ్యః–కోపేన స్ఫురితా అధరా యాసామ్ (బహువ్రీహి) తాభ్యః

**సంధులు:–**

1) శరైః+మదీయైః – శరైర్మదీయైః – విసర్గసంధిః
2) కతమః+సురారిః – కతమస్సురారిః – విసర్గసంధిః
3) స్త్రీభ్యః+అపి – స్త్రీభ్యోఽపి – ఉత్వాదేశము – పూర్వరూపసంధిః.

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **కతమః** – సర్వనామము. a) కతర–కతమౌ జాతిపరిప్రశ్నే (పా.2–1–63)
b) వా **బహూనాం** జాతిపరిప్రశ్నే ఇతమచ్. సూ(5–3–93)
c) కిం యత్తదో నిర్ధారణే ద్వయోరేకస్య ఇతరచ్. సూ(5–3–92)
d) 'అపి జ్ఞాయతే **కతమేన** దిగ్భాగేన గతః స జాల్మః' ఇతి విక్రమోర్వశీయస్య ప్రథమాంకే.
e) 'ఆర్య! **కతమం** పునః ఋతుమధికృత్య గాస్యామి' ఇతి అభిజ్ఞానశాకున్తలే–ప్రథమాంకే పూజ్యుడా! ఎన్నవదగు ఋతువును ఉద్దేశించి గానముచేయుదునో సెలవిందు.
f) **'కతమే** తే గుణాస్తత్ర యానుదాహరన్త్యార్యమిశ్రాః' –మాళవికాగ్నిమిత్రే–ప్రథమాంకే

g) శ్లో॥ నగేభ్యో యాన్తీనాం కథయ తటినీనాం **కతమయా**
పురాణాం సంహర్తుః సురధుని కపర్దోఽధిరురుహే।
కయా వా శ్రీభర్తుః పదకమలక్షాళిసలిలై-
స్తులాలేశో యస్యాం తవ జనని! దీయేత కవిభిః॥ గంగాలహరి-22

"ఓ దేవనదీ! గంగా! పర్వతములనుండి వచ్చుచున్ననదులలో దేనిచేత త్రిపురాసురపురములను సంహరించిన శివునియొక్క జటాజూటమునందు అధిరోహింపబడినది?..."

**క్రియాదర్శము:–** 1) **ప్రసీద**–ప్ర–ఉపసర్గ, షద్ల (సద్) విశరణగత్యవసాదనేషు. (1–నశించుట, 2–గమనము, 3–చంపుట) 1. అకర్మకమ్, 2,3 సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లోట్–మధ్యమపురుషైకవచనమ్.

రూపాలు:– **ప్రసీద / ప్రసీదతాత్** – ప్రసీదతమ్ – ప్రసీదత.

2) **విశ్రామ్యతు**–శ్రము(తమసి ఖేదే చ) దివాదయః (4), సకర్మకమ్, సేట్, పరస్మైపదీ. లోట్–ప్రథమపురుషైకవచనమ్.

రూపాలు:– **విశ్రామ్యతు/విశ్రామ్యతాత్** – విశ్రామ్యతామ్ –విశ్రామ్యన్తు.
పక్షే విశ్రామతు/విశ్రామతాత్ – విశ్రామతామ్ – విశ్రామన్తు.

3) **బిభేతు**–ఞి భీ(భీ) భయే (భయపడుట) జుహోత్యాది ప్రకరణమ్ (3). అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ. లోట్–ప్రథమపురుషైకవచనమ్.

రూపాలు:– **బిభేతు / బిభితాత్ / బిభీతాత్** – బిభితామ్/బిభీతామ్ – బిభ్యతు.

---

**శ్లో॥ తవ ప్రసాదాత్ కుసుమాయుధోఽపి**
**సహాయమేకం మధుమేవ లబ్ధ్వా।**
**కుర్యాం హరస్యాపి పినాకపాణేః**
**ధైర్యచ్యుతిం కే మమ ధన్వినోఽన్యే॥ 10**

**పదవిభాగము:–** తవ, ప్రసాదాత్, కుసుమాయుధః, అపి, సహాయమ్, ఏకమ్, మధుమ్, ఏవ, లబ్ధ్వా, కుర్యామ్, హరస్య, అపి, పినాకపాణేః, ధైర్యచ్యుతిమ్, కే, మమ, ధన్వినః, అన్యే।





**అన్వయక్రమము:–** తవ ప్రసాదాత్ కుసుమాయుధః అపి (అహమ్) ఏకం మధుమ్ ఏవ సహాయం లబ్ధ్వా పినాకపాణేః హరస్య అపి ధైర్యచ్యుతం కుర్యామ్। అన్యే ధన్వినః మమ కే।

**ప్రతిపదార్థము:–** తవ – నీయొక్క, ప్రసాదాత్ – అనుగ్రహమువలన, కుసుమాయుధః అపి – పుష్పశరుడనయ్యును, ఏకమ్ – ఒక, మధుమ్ ఏవ – వసంతుని మాత్రము, సహాయమ్ – సహాయునిగా (తోడుగా), లబ్ధ్వా – పొంది, పినాకపాణేః – ఆజగవ ధనుస్సు చేతగలవాడగు, హరస్య – హరునకు, అపి – సైతము, ధైర్యచ్యుతిమ్ – ధైర్యము యొక్క నాశమును, కుర్యామ్ – చేసెదను, అన్యే – ఇతరులగు, ధన్వినః – విలుకాండ్రు, మమ కే – నాకు ఏపాటి?

**తాత్పర్యము :–** నీయొక్క అనుగ్రహమువలన పుష్పశరుడనయ్యును ఒక వసంతుని తోడుగా పొంది, ఆజగవధనుస్సు చేతగలవాడగు హరునకు సైతము ధైర్యనాశమును చేసెదను. ఇతరులగు విలుకాండ్రు నాకు ఏపాటి?

**విభక్తులు/క్రియలు:–** 1) తవ–**తవ**, యువయోః, వః, దకారాన్త పుంలింగయుష్మచ్ఛబ్దము, ష.ఏ., 2) ప్రసాదాత్–**ప్రసాదాత్**, ప్రసాదాభ్యామ్, ప్రసాదేభ్యః, అకారాన్త పుంలింగ ప్రసాదశబ్దము, పం.ఏ., 3) కుసుమాయుధః–**కుసుమాయుధః**, కుసుమాయుధౌ, కుసుమాయుధాః, అకారాన్త పుంలింగ కుసుమాయుధ శబ్దము, ప్ర.ఏ., 4) ఏకమ్ – **ఏకమ్**, ఏకౌ, ఏకాన్, అకారాన్త పుంలింగ ఏక శబ్దము, ద్వి.ఏ., 5) మధుమ్ – **మధుమ్**, మధూ, మధూన్, ఉకారాన్త పుంలింగ మధుశబ్దము, ద్వి.ఏ., 6) సహాయమ్–**సహాయమ్**, సహాయౌ, సహాయాన్, అకారాన్త పుంలింగ సహాయ శబ్దము, ద్వి.ఏ., 7) లబ్ధ్వా – అవ్యయము – లభ్+క్త్వా, 8) పినాకపాణేః–**పినాకపాణేః**, పినాకపాణ్యోః, పినాకపాణీనామ్, ఇకారాన్త పుంలింగ పినాకపాణిశబ్దము, ష.ఏ., 9) హరస్య–**హరస్య**, హరయోః, హరాణామ్, అకారాన్త పుంలింగ హరశబ్దము, ష.ఏ. 10) ధైర్యచ్యుతిమ్–**ధైర్యచ్యుతిమ్**, ధైర్యచ్యుతీ, ధైర్యచ్యుతీః, ఇకారాన్త స్త్రీలింగ ధైర్యచ్యుతి శబ్దము, ద్వి.ఏ., 11) కుర్యామ్–క్రియ–డుకృఞ్(కృ) కరణే+విధిలిఙ్, ఉత్తమపురుషైక వచనము, 12) అన్యే–అన్యః, అన్యౌ, **అన్యే**, అకారాన్త పుంలింగ సర్వనామ అన్య శబ్దము, ప్ర.బ., 13) ధన్వినః – ధన్వీ, ధన్వినౌ, **ధన్వినః**, నకారాన్తపుంలింగ ధన్విన్‌శబ్దము, ప్ర.బ., 14) మమ–**మమ**, ఆవయోః, నః, దకారాన్త పుంలింగ అస్మద్ శబ్దము, ష.ఏ., 15) కే–కః, కౌ, **కే**, మకారాన్తపుంలింగ కిమ్ శబ్దము, ప్ర.ఏ., 16) అపి, ఏవ–అవ్యయాలు.

**సమాసాలు:–**

1) కుసుమాయుధః–కుసుమాని ఆయుధాని యస్య (బహువ్రీహి) సః.
2) పినాకపాణేః – పినాకః పాణౌ యస్య (బహువ్రీహి) సః, తస్య.
3) ధైర్యచ్యుతిమ్ – ధైర్యస్య చ్యుతిః (ష.త.) తామ్.

**సంధులు:–**

1) కుసుమాయుధః+అపి–కుసుమాయుధోఽపి – ఉత్వాదేశము– పూర్వరూప సంధిః

2) హరస్య+అపి – హరస్యాపి – సవర్ణదీర్ఘసంధిః.

3) ధన్వినః+అన్యే–ధన్వినోఽన్యే–ఉత్వాదేశము – పూర్వరూపసంధిః.

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **పినాకః** – a) పుం. మరియు నపుంసకలింగము.

b) పాతి రక్షతి, పనాయ్యతే స్తూయతే వా। పాల్ రక్షణే, పన్ స్తుతౌ వా+ 'పినాకాదయశ్చ' ఇతి ఆకప్రత్యయేన నిపాతనాత్ సాధుః, శివధనుః, ఆజగవమ్, –అని హలాయుధకోశవ్యాఖ్యా.

c) **పినాక**మివ రుద్రస్య క్రుద్ధస్యాభిఘ్నతః పశూన్ – ఇది మహాభారతే–6/60/19

d) శ్లో॥ **పినాకం** స్యాదాజగవమజకావఞ్చ తద్ధనుః।
అని మూడు పేర్లు అభిదానచిన్తామణి పేర్కొన్నది.

e) 'నిపపాత జవాదిషుః **పినాకాన్** మహతోఽభ్రాదివ వైద్యుతః కుశానుః"
కిరాతార్జునీయమ్–13–20.

f) **'పినాకో**ఽస్త్రీ రుద్రచాపే పాంశువర్షత్రిశూలయోః' –ఇతి మేదినీకోశే.

**క్రియాదర్శము:–** 1) **కుర్యామ్**–డుకృఞ్ (కృ) కరణే, తవాది ప్రకరణమ్(8), సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ, విధిలిఙ్ – ఉత్తమపురుషైకవచనము.

రూపాలు:– **కుర్యామ్** – కుర్యావ – కుర్యామ.

**అలంకారము:–** ఇట 'విభావనాలంకార' మున్నదని చెప్పదగును.

**లక్షణమ్:–** కాః క్రియాయాః ప్రతిషేధేఽపి ఫలవ్యక్తిర్విభావనా। 107
కావ్యప్రకాశే – దశమోల్లాసం.

హేతువైన క్రియయొక్క ప్రతిషేధమునందు కూడ ఫలవ్యక్తి విభావనాలంకారము 'ఆజగవధనుస్సు చేతగలవాడగు హరునకు ధైర్యముయొక్క నాశముచేసెదను' అని కుసుమాయుధుడు చెప్పుటచే' నిది 'విభావనాలంకారము' అని చెప్పదగును–

---





**అవతారికా:–** అథ మన్మథేన ప్రాప్తాశ్వాసనస్యేంద్రస్య ప్రవృత్తిమాహ.

**శ్లో॥ అథోరుదేశాదవతార్య పాద–**
**మాక్రాన్తిసమ్భావితపాదపీఠమ్।**
**సఙ్కల్పితార్థే వివృతాత్మశక్తి –**
**మాఖణ్డలః కామమిదం బభాషే॥ 11**

**పదవిభాగము:–**అథ, ఊరుదేశాత్, అవతార్య, పాదమ్, ఆక్రాన్తిసమ్భావితపాదపీఠమ్, సంకల్పితార్థే, వివృతాత్మశక్తిమ్, ఆఖణ్డలః, కామమ్, ఇదమ్, బభాషే।

**అన్వయక్రమము:–** అథ ఆఖణ్డలః ఊరుదేశాత్ పాదమ్ ఆక్రాన్తిసమ్భావితపాదపీఠమ్ అవతార్య సంకల్పితార్థే వివృతాత్మశక్తిమ్ కామమ్ ఇదం బభాషే।

**ప్రతిపదార్థము:–** అథ – పిమ్మట, ఆఖణ్డలః – ఇంద్రుడు, ఊరుదేశాత్ – తొడ ప్రాంతమునుండి, పాదమ్ – (తన) పాదమును, ఆక్రాన్తిసమ్భావితపాదపీఠమ్ – ఆక్రమించుటచే గౌరవింపబడిన కాలిపీటకలుగునట్లు, అవతార్య – దింపి, సంకల్పితార్థే – ఉద్దేశింపబడిన కార్యవిషయమునందు, వివృతాత్మశక్తిమ్ – ప్రకటింపబడిన స్వసామర్థ్యముగల, కామమ్ – మన్మథునిగూర్చి, ఇదమ్ – ఈ చెప్పబోవుమాటను, బభాషే – పలికెను.

**తాత్పర్యము :–** పిమ్మట, ఇంద్రుడు తొడప్రాంతమునుండి (తన) పాదమును తీసి పాదపీఠముపైనుంచుకొని, (తాను) ఉద్దేశించిన కార్యవిషయమునందు స్వసామర్థ్యము గల మన్మథునిగూర్చి ఈ చెప్పబోవు దానిని పలికెను.

**విభక్తులు/క్రియలు:–** 1) అథ–అవ్యయము, 2) ఆఖణ్డలః–**ఆఖణ్డలః**, ఆఖణ్డలౌ, ఆఖణ్డలాః, అకారాన్త పుంలింగ ఆఖణ్డల శబ్దము, ప్రథమా ఏకవచనము, 3) ఊరుదేశాత్–**ఊరుదేశాత్**, ఊరుదేశాభ్యామ్, ఊరుదేశేభ్యః, అకారాన్త పుంలింగ ఊరుదేశశబ్దము, పంచమీ ఏకవచనము, 4) పాదమ్–**పాదమ్**, పాదౌ, పాదాన్, అకారాన్తపుంలిగ పాదశబ్దము, ద్వి.ఏ., 5) ఆక్రాన్తి...పీఠమ్–**...పీఠమ్**, ....పీఠే, ...పీఠాని, అకారాన్త నపుంసకలింగ...పీఠశబ్దము, ప్ర.ఏ., 6) అవతార్య–అవ్యయము–అవ+తౄ +ణి+క్త్వా – ల్యబన్తము, 7) సంకల్పితార్థే – **సంకల్పితార్థే**, సంకల్పితార్థయోః, సంకల్పితార్థేషు, అకారాన్త పుంలింగ సంకల్పితార్థశబ్దము, సప్తమీ ఏకవచనము, 8) వివృతాత్మశక్తిమ్–**...శక్తిమ్**, శక్తీ, శక్తీన్, ఇకారాన్త పుంలింగ ...శక్తిశబ్దము, ద్వి.ఏ., 9) కామమ్–**కామమ్**, కామౌ, కామాన్, అకారాన్త పుంలింగ కామశబ్దము, ద్వి.ఏ., 10) ఇదమ్–**ఇదమ్**, ఇమే, ఇమాని, మకారాన్త పుంలింగ ఇదమ్ శబ్దము, ద్వి.ఏ. 11) బభాషే–భాష్ (ఆత్మనేపదీ)లిట్ – ప్రథమ పురుషైకవచనము.

**సమాసాలు:-**

1) ఊరుదేశాత్-ఊరోః దేశః (ష.త.) ఊరుదేశః, తస్మాత్.
2) ఆక్రాన్తిసమ్భావితపాదపీఠమ్-ఆక్రాన్త్యా సంభావితం (తృ.త.) పాదయోః పీఠం (ష.త.) యస్మిన్ (బహువ్రీహి) తత్.
3) సంకల్పితార్థే-సంకల్పితశ్చాసౌ అర్థః (కర్మధా) సంకల్పితార్థః తస్మిన్.
4) వివృతాత్మశక్తిమ్ - ఆత్మనః శక్తిః (ష.త.) ఆత్మశక్తిః, వివృతా ఆత్మశక్తిః యేన (బహువ్రీహి) సః,తమ్.

**సంధులు:-**

1) అథ+ఊరుదేశాత్-అథోరుదేశాత్ - గుణసంధిః, ఆద్గుణః.
2) ఊరుదేశాత్+అవతార్య-ఊరుదేశాదవతార్య - జశ్త్వమ్.
**ఝలాం జశోఽన్తే** (సూ.8-2-39) అనునాసికాంతాంతస్థవర్ణములు తప్ప మిగిలిన పదాంతగత హల్లులకు (ఝల్లులకు) సవర్ణమైన వర్గతృతీయవర్ణము (జశ్త్వము) ఆదేశముగ వచ్చును. (జశ్-జబగడద).

**పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణాలు-కావ్యప్రయోగాలు:-**

1) **ఆఖణ్డలః** - a) ఆఙ్+ఖణ్డ్+కలచ్ - ఇంద్రః

b) శ్లో॥ ఇంద్రో ద్యుశ్చ్యవనో హరిః సురపతిః సంక్రన్దనో వాసవో,
.........................................................
**ఆఖణ్డల**స్తురాషాట్ సుత్రామా గోత్రభిత్సునాసీరః॥
.... అని హలాయుధకోశము '39' నామములను పేర్కొన్నది.

c) **ఆఖణ్డతి** భేదయతి పర్వతాన్, ఖణ్డ్-డలచ్ డస్య నేత్వమ్. - అని ఆప్టే డిక్షనరీ.

d) శ్లో॥ తమీశః కామరూపాణామ**త్యాఖణ్డల**విక్రమమ్।
భేజే భిన్నకటైర్నాగైరన్యానుపరురోధ యైః॥ ర.వం.4-83

"...మదోత్కటములైన ఏనుగులను తెచ్చి,దేవేంద్రునకు మించిన పరాక్రమము గల, ఆ రఘుమహారాజునకు సమర్పించెను".

e) శ్లో॥ రత్నచ్ఛాయావ్యతికర ఇవ ప్రేక్ష్యమేతత్పురస్తా -
ద్వల్మీకాగ్రాత్ప్రభవతి ధనుష్ఖణ్డ**మాఖణ్డలస్య** ।
యేన శ్యామం వపురతితరాం కాన్తిమాపత్స్యతే తే
బర్హిణేవ స్ఫురితరుచినా గోపవేషస్య విష్ణోః॥ - మే.దూ.-15.



"ఓ మేఘుడా! పద్మరాగాది మణుల కాన్తులకలయికవలె చూడదగిన ఇంద్రుని యొక్క ఈ ధనుస్సుయొక్క భాగము (వరదగుడిభాగము) ఎదుటనున్న రామగిరిపర్వతాగ్రమునుండి పుట్టుచున్నది...."

f) ఆప్టే మహాశయుడు 'ఈ పదవివరణ' సందర్భమున ఈ శ్లోకమునే ఉదాహరించినాడు.

**క్రియాదర్శము:- బభాషే**-భాష (భాష్) వ్యక్తాయాం వాచి (మాట్లాడుట), భ్వాది ప్రకరణమ్ (1) అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, లిట్ 1-1.

ప్రథమపురుషరూపాలు:- **బభాషే** - బభాషాతే - బభాషిరే

శ్లో॥ **అథాం**గదాశ్లిష్టభుజం భుజిష్యా
హేమాంగదం నామ కళింగనాథమ్।
ఆసేదుషీం సాదితశత్రుపక్షం
బాలామబాలేందుముఖీం **బభాషే**॥ - ర.వం. 6-53

ర.వం. 6-53, కు.సం. 3-11 - ఈ రెండు శ్లోకముల ఆద్యంత పదముల సాదృశ్యశోభ కడు రమణీయముగ నున్నది గదా!

---

**అవతారికా:-** అథ ప్రశంసయా మదనపరాక్రమం వర్ధయన్నాహ -

**శ్లో॥ సర్వం సఖే! త్వయ్యుపపన్నమేత -**
**దుభే మమాస్త్రే కులిశం భవాంశ్చ ।**
**వజ్రం తపోవీర్యమహత్సు కుణ్ఠం**
**త్వం సర్వతోగామి చ సాధకఞ్చ ॥ 12**

**పదవిభాగము:-** సర్వమ్, సఖే!, త్వయి, ఉపపన్నమ్, ఏతత్, ఉభే, మమ, అస్త్రే, కులిశమ్, భవాన్, చ, వజ్రమ్, తపోవీర్యమహత్సు, కుణ్ఠమ్, త్వమ్, సర్వతోగామి, చ, సాధకమ్, చ.

**అన్వయక్రమము:-** సఖే! ఏతత్ సర్వం త్వయి ఉపపన్నమ్ ఏవ। మమ కులిశం భవాన్ చ ఉభే అస్త్రే । వజ్రం తపోవీర్యమహత్సు కుణ్ఠమ్ । త్వం సర్వతోగామి సాధకఞ్చ।

**ప్రతిపదార్థము:–** సఖే! – ఓ చెలికాడా!, ఏతత్ సర్వమ్–ఇది యంతయు, త్వయి– నీయందు, ఉపపన్నమ్ ఏవ – సిద్ధమే, మమ – నాకు, కులిశమ్ – వజ్రాయుధము, భవాంశ్చ – నీవు, ఉభే అస్త్రే – ఇరువురును అస్త్రములు, వజ్రమ్ – వజ్రాయుధము, తపోవీర్యమహత్సు – తపోబలముచేత గొప్పవారియందు, కుణ్ఠమ్–మందము, త్వమ్ – నీవు, సర్వతోగామి – అందఱి మీదను ప్రసరించునట్టియు, సాధకం చ– సాధించునట్టియును (అస్త్రమవు).

**తాత్పర్యము :–** ఓ చెలికాడా! ఇదియంతయు నీ యందు సిద్ధమే. నాకు 1) వజ్రాయుధమును, 2) నీవును, ఇరువురును అస్త్రములు. వజ్రాయుధము తపోబలముచేత గొప్పవారియందు మందము. నీవు అందఱిమీద ప్రసరించు నట్టియు, సాధించునట్టియును అగు (అస్త్రమవు).

**విభక్తులు/క్రియలు:–** 1) సఖే–హే **సఖే!**, హే సఖాయౌ, హే సఖాయః, ఇకారాన్త పుంలింగ సఖి శబ్దము, సంబోధన ప్రథమా విభక్తి ఏకవచనము, 2) ఏతత్–**ఏతత్**, ఏతే, ఏతాని, దకారాన్త నపుంసకలింగ ఏతచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏక వచనము, 3) సర్వమ్–**సర్వమ్,** సర్వే, సర్వాణి, అకారాన్త నపుంసకలింగ సర్వశబ్దము, ప్ర.ఏ., 4) త్వయి–**త్వయి,** యువయోః, యుష్మాసు, దకారాన్తపుంలింగ యుష్మచ్ఛబ్దము, స.ఏ., 5) ఉపపన్నమ్ – **ఉపపన్నమ్**, ఉపపన్నే, ఉపపన్నాని, అకారాన్త నపుంసకలింగ ఉపపన్న శబ్దము, ప్ర.ఏ., 6) ఏవ, చ– అవ్యయములు, 7) మమ–**మమ/ మే**, ఆవయోః/నౌ, అస్మాకమ్/నః, దకారాన్తపులింగ అస్మచ్ఛబ్దము, ష.ఏ., 8) కులిశమ్–**కులిశమ్,** కులిశే, కులిశాని, అకారాన్త నపుంసకలింగ కులిశశబ్దము, ప్ర.ఏ., 9) భవాన్–**భవాన్,** భవన్తౌ, భవన్తః,తకారాన్త పుంలింగ భవత్ శబ్దము, ప్ర.ఏ., 10) ఉభే–నపుంసకలింగ 'ఉభ' శబ్దము, ప్రథమా ద్వివచనము, నిత్యం ద్వివచనాంతః11) అస్త్రే–అస్త్రమ్, **అస్త్రే,** అస్త్రాణి,అకారాన్త నపుంసకలింగ అస్త్ర శబ్దము, ప్ర.ద్వి.,12) వజ్రమ్–**వజ్రమ్,** వజ్రే, వజ్రాణి, అకారాన్త నపుంసకలింగ వజ్రశబ్దము, ప్ర.ఏ., 13) తపోవీర్యమహత్సు–...మహతి, ...మహతోః, **...మహత్సు,** తకారాన్తపుంలింగ...మహత్శబ్దము, స.బ., 14) కుణ్ఠమ్–**కుణ్ఠమ్,** కుణ్ఠే, కుణ్ఠాని, అకారాన్త నపుంసకలింగ కుణ్ఠశబ్దము, ప్ర.ఏ., 15) సర్వతోగామి–**సర్వతోగామి**, సర్వతోగామినీ, సర్వతోగామీని, ఇకారాన్త నపుంసకలింగ...గామిశబ్దము, ప్ర.ఏ., 16) సాధకమ్–**సాధకమ్**, సాధకే, సాధకాని, అకారాన్తనపుంసకలింగ సాధకశబ్దము, ప్ర.ఏ.

**సమాసాలు:–**

1) తపోవీర్యమహత్సు–తపసః వీర్యమ్ (ష.త.) తపోవీర్యమ్, తపోవీర్యేణ, మహాన్తః (తృ.త.) తేషు.
2) సర్వతోగామి–సర్వతః గచ్ఛతి (ఉపపదతత్పు) ఇతి తత్.

**సంధులు:–**

1) త్వయి+ఉపపన్నమ్–త్వయ్యుపపన్నమ్ – యణాదేశసన్ధిః.



**ఇకో యణచి** (సూ. 6–1–74). ఇ,ఉ,ఋ,ఌ, వర్ణములకు అసవర్ణమైన అచ్చు పరముగానున్నపుడు క్రమముగా య్,వ్,ర్,ల్(యణ్)అనునవి ఆదేశమగును.

2) ఏతత్+ఉభే – ఏతదుభే – జశ్త్వసంధిః.
3) మమ+అస్త్రే–మమాస్త్రే, సవర్ణదీర్ఘసంధిః, **అకః సవర్ణే దీర్ఘః** (సూ. 6–1–97).
4) భవాన్+చ – భవాంశ్చ – **అనునాసికానుస్వారౌ రుత్వఇశ్చ.**

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) a) **భవాన్ –** తకారాన్త పుంలింగః సర్వనామ 'భవత్' శబ్దః – మీరు, నీవు అను అర్థముతో– భాదీప్తౌ–అదాది–పరస్మైపది–ఆత్మనేపది – దవతుః।

ప్ర – భవాన్ – భవన్తౌ – భవన్తః

ద్వి – భవన్తమ్ – భవన్తౌ – భవతః

**భవాన్** – 'భాతోర్డవతుః–1–63' ఇత్యుణాదిసూత్రేణ భాతోర్డవతుప్రత్యయే డిత్వాట్టిలోపే చ 'భవత్' శబ్దః। తస్మాత్ సౌ 'అత్వసన్తస్యే' తి దీర్ఘే నుమి సులోపే సంయోగాన్తలోపః.

b) **భవన్ –** శత్రన్తో 'భవత్' శబ్దః (అగుట–అను అర్థముతో)

ప్ర – భవన్ – భవన్తౌ – భవన్తః

ద్వి – భవన్తమ్ – భవన్తౌ – భవతః

**భవన్** – భూధాతోర్లటః శత్రాదేశే శపి గుణావాదేశయోః పరరూపే 'భవత్' శబ్దః । తస్మాత్ సౌ 'అత్వసన్త్వాభావేన దీర్ఘాఽభావాత్ నుమాదికార్యం పూర్వవత్।।

శ్లో।। తతః ప్రహస్యాపభయః పురందరం
పునర్బభాషే తురగస్య రక్షితా ।
గృహాణ శస్త్రం యది సర్గ ఏష తే
న ఖల్వనిర్జిత్య రఘుం కృతీ **భవాన్**।। రఘువంశమ్ 3–51

**అలంకారము:–** ఇందు 'అనుప్రాస' గలదని చెప్పదగును.

---

**అవతారికా:–** నాహం కేవలం తవ వీర్యం జానామి కిన్తు మమ ప్రవృత్తిరపి తాదృశీత్యాహ–

శ్లో॥ అవైమి తే సారమతః ఖలు త్వాం
కార్యే గురుణ్యాత్మసమం నియోక్ష్యే।
వ్యాదిశ్యతే భూధరతామవేక్ష్య
కృష్ణేన దేహోద్వహనాయ శేషః॥ 13

**పదవిభాగము:-** అవైమి, తే, సారమ్, అతః, ఖలు, త్వామ్, కార్యే, గురుణి, ఆత్మ సమమ్, నియోక్ష్యే, వ్యాదిశ్యతే, భూధరతామ్, అవేక్ష్య, కృష్ణేన, దేహోద్వహనాయ, శేషః॥

**అన్వయక్రమము:-** హే సఖే! తే సారమ్ అవైమి। అతః ఖలు ఆత్మసమం త్వాం గురుణి కార్యే నియోక్ష్యే। కృష్ణేన భూధరతామ్ అవేక్ష్య శేషః దేహోద్వహనాయ వ్యాదిశ్యతే॥

**ప్రతిపదార్థము:-** హే సఖే! – ఓ చెలికాడా!, తే – నీయొక్క, సారమ్ – బలమును, అవైమి – ఎఱుగుదును, అతః ఖలు – కావుననే, ఆత్మసమమ్ – నా సరివాడవైన, త్వామ్ – నిన్నును, గురుణి – గొప్పదియగు, కార్యే – పనియందు, నియోక్ష్యే – నియోగించెదను, కృష్ణేన – విష్ణుమూర్తిచేత, భూధరతామ్ – భూమిని మోచు వాడగుటను, అవేక్ష్య – చూచి, శేషః – ఆదిశేషుడు, దేహోద్వహనాయ – శరీరమును దాల్చుటకు, వ్యాదిశ్యతే – నియోగింపబడుచున్నాడు.

**తాత్పర్యము :-** ఓ చెలికాడా! నీ బలమును ఎఱుగుదును, కనుకనే నా సరివాడవైన నిన్నును గొప్పపనియందు నియోగించెదను. విష్ణుమూర్తిచేత భూమిని మోచు వాడగుటను చూచి ఆదిశేషుడు శరీరమును దాల్చుటకు నియోగింపబడుచున్నాడు.

**విభక్తులు/క్రియలు:-** 1) తే–**తవ/తే**, యువయోః/వామ్, యుష్మాకమ్/వః, దకారాన్తపుంలింగ యుష్మచ్ఛబ్దము, ష.ఏ., 2) సారమ్–**సారమ్**, సారౌ, సారాన్, అకారాన్తపుంలింగసారశబ్దము, ద్వి.ఏ., 3) అవైమి–అవ+ఇ+లట్ – ఉత్తమపురుషైకవచనము, 4) అతః, ఖలు – అవ్యయములు, 5) ఆత్మసమమ్–**ఆత్మసమమ్**, ఆత్మసమౌ, ఆత్మసమాన్, అకారాన్త పుంలింగ ఆత్మసమశబ్దము ద్వి.ఏ., 6) త్వామ్–**త్వామ్/త్వా**, యువామ్/వామ్, యుష్మాన్/వః, దకారాన్త పుంలింగయుష్మచ్ఛబ్దము, ద్వి.ఏ., 7) గురుణి–**గురుణి**, గురుణోః, గురుషు, ఉకారాన్త నపుంసకలింగ గురుశబ్దము, సప్తమీ ఏకవచనము, 8) కార్యే–**కార్యే**, కార్యయోః, కార్యేషు, అకారాన్త నపుంసకలింగ కార్యశబ్దము, సప్తమీ ఏకవచనము, 9) నియోక్ష్యే – ని+యుజ్+లృట్, ఉత్తమపురుష ఏకవచనము, 10) కృష్ణేన – **కృష్ణేన**, కృష్ణాభ్యామ్, కృష్ణైః, అకారాన్త పుంలింగ కృష్ణశబ్దము, తృ.ఏ., 11) భూధరతామ్–**భూధరతామ్**, భూధరతే, భూదరతాః ఆకారాన్త స్త్రీలింగ భూధరతా శబ్దము, ద్వి.ఏ. 12) అవేక్ష్య–అవ+ఈక్ష+క్త్వా–ల్యబన్తము, 13) శేషః





–**శేషః**, శేషౌ, శేషాః, అకారాన్తపుంలింగ శేషశబ్దము, ప్ర.ఏ., 14) దేహోద్వహనాయ–**దేహోద్వహనాయ**, దేహోద్వహనాభ్యామ్, దేహోద్వహనేభ్యః, అకారాన్త నపుంసకలింగ దేహోద్వహనశబ్దము, చ.ఏ., 15) వ్యాదిశ్యతే – వి+ఆ+దిశ్, కర్మణి, లట్, ప్రథమపురుష ఏకవచనము.

**సమాసాలు:-**

1) ఆత్మసమమ్ – ఆత్మనా సమమ్ (తృ.త.)
2) భూధరతామ్ – భువః ధరః (ష.త.) భూధరస్య భావః భూధరతా, తామ్।
3) దేహోద్వహనాయ – దేహస్య ఉద్వహనమ్ (ష.త.) తస్మై।

**సంధులు:-** 1) గురుణి + ఆత్మసమమ్ – గురుణ్యాత్మసమమ్ – యణాదేశసంధిః

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:-**

1) **కృష్ణః** – a) కర్షత్యరీన్ మహాప్రభావశక్త్యా । యద్వా కర్షతి ఆత్మసాత్ కరోతి ఆనందత్వేన పరిణమయతి భక్తానాం మనః ఇతి యావత్। 'కర్షేర్వర్ణే' ఇతి బాహులకాత్ వర్ణం వినాపి నక్ ణత్వం చ । యద్వా కర్షతి సర్వాన్ స్వకుక్షౌ ప్రలయకాలే – కర్షణాత్ 'కృష్ణో రమణాద్ రామో వ్యాపనాద్ విష్ణుః' ఇతి శ్రుతేస్తథాత్వమ్.

b) శ్లో॥ కృషిర్భూవాచకః శబ్దో ణశ్చ నిర్వృతివాచకః।
**కృష్ణ** స్తద్భావయోగాచ్చ కృష్ణో భవతి సాత్వతః॥ –ఇతి మహాభారతే 5–70–5

c) శ్లో॥ ఉచ్చస్థాః శశిభౌమచాన్ద్రిశనయో లగ్నం వృషో లాభగో
జీవః సింహతులాలిషు క్రమవశాత్ పూషోశనోరాహవః।
నైశీథః సమయోఽష్టమీ బుధదినం బ్రహ్మర్క్షమత్రక్షణే
**శ్రీకృష్ణా**భిధమమ్బుజేక్షణమభూదావిః పరం బ్రహ్మ తత్॥
– ఇతి ఖమాణిక్యే జ్యోతిర్గ్రంథే.

d) శ్లో॥ అథ భాద్రపదే మాసి కృష్ణాభ్యాం కలౌ యుగే।
అష్టావింశతిమే జాతః **కృష్ణో**ఽసౌ దేవకీసుతః॥ –ఇతి బ్రహ్మపురాణే.

e) శ్లో॥ విష్ణుః కృష్ణః కేశవో మంజుకేశీ
శ్రీవత్సాఙ్కః శ్రీపతిః పీతవాసాః।
విష్వక్సేనో విశ్వరూపో మురారిః
శౌరిః శార్ఙ్గీ పద్మనాభో ముకున్దః॥ 21

శ్లో॥ గోవిందో ధరణిధరః సుపర్ణకేతు –
రై్వకుణ్ఠో జరశయనశ్చతుర్భుజశ్చ।
దైత్యారిర్మధుమథనో రథాఙ్గపాణి –
ర్ధాశార్ఙ్గః క్రతుపురుషో వృషాకపిః స్యాత్॥ 22

శ్లో॥ జనార్దనాధోక్షజవాసుదేవం దామోదరం శ్రీధరమచ్యుతం చ।
ఉపేన్ద్రమిన్ద్రావరజం చ బభ్రుం హరిం హృషీకేశముదాహరన్తి॥ 23

శ్లో॥ ఆత్మభూః పుణ్డరీకాక్షః శ్రీవత్సో విష్టరశ్రవాః।
నారాయణో జగన్నాథో వనమాలీ గదాధరః॥ 24

శ్లో॥ సనాతనో జనిః శమ్భుర్విధిర్వేధా గదాగ్రజః।
కైటభారిరజో జిష్ణుః కంసజిత్పురుషోత్తమః॥ 25

… అని 'కృష్ణ' శబ్దమునకు 'హలాయుధకోశము' 56 నామములను పేర్కొన్నది.

f) చేతవెన్నముద్ద చెంగల్వపూదండ
బంగరు మొలతాడు పట్టుదట్టి
సందెతాయెతులును సరిమువ్వగజ్జెలు
చిన్నికృష్ణ! నిన్ను చేరి కొలుతు.

అని ఆ భగవన్నామమును ఆ రూపముతో పసితనమునుండే దైవస్వరూపులగు పసిపిల్లలకు మనసారా మాతృమూర్తులు వసబోసినట్లుగా వారి మనస్సుల్లో స్థిరీకరించుతారు. మాతృమూర్తులకు నమస్సులు.

g) శ్లో॥ యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీర్విజయో భూతిః ధ్రువా నీతిర్మతిర్మమ॥ –అని భగవద్గీత 18-78

h) శ్లో॥ వాచకః ప్రణవో యస్య క్రీడావస్త్వఖిలం జగత్।
శ్రుతిరాజ్ఞా వపుర్జ్ఞానం తం వన్దే దేవకీసుతమ్॥ –అని కృష్ణకర్ణామృతమ్

i) శ్లో॥ వసుదేవసుతం దేవం – కంసచాణూరమర్దనమ్।
దేవకీపరమానందం – కృష్ణం వందే జగద్గురుమ్॥ –అని కృష్ణాష్టకమ్

j) చందనచర్చితనీలకలేబరపీతవసనవనమాలీ
కేళిచలన్మణికుండలమండిత గండయుగస్మితశాలీ
హరిరిహముగ్ధవధూనికరే – విలాసిని విలసతి కేళిపరే ధ్రువమ్।
– అని గీతగోవిందము – ప్రథమసర్గము – అష్టపది 4.1





"శ్రీకృష్ణుడు తన నల్లనిదేహమునిండ చందన మలందికొని పీతాంబరమును వనమాలను ధరించినవాడై క్రీడలయందలి సంభ్రమమువలన చెవులనుండు మణికుండలములు గండస్థలములయందు తాండవమాడుచుండగా విలాసవతులును ముగ్ధలునగు ప్రియురాండ్ర గుంపులో చేరి విలాసముగ నున్నాడు."

k) శ్లో॥ జయతు జయతు దేవో దేవకీనందనోఽయం
జయతు జయతు కృష్ణో వృష్ణివంశప్రదీపః।
జయతు జయతు మేఘశ్యామలః కోమలాంగో
జయతు జయతు పృథ్వీభారనాశో ముకుందః॥ – అని ముకుందమాలా.

l) శ్లో॥ ఉరసా మనసా దృష్ట్వా పరిష్వజ్య ముహుర్ముహుః।
కృతకృత్యాస్తదాత్మానం కృష్ణం మత్వా సమాస్థితాః॥
– అని శ్రీకృష్ణలీలాతరంగిణి – 8వ తరంగము–24

'వక్షస్థలముతోను, మనస్సుతోను, చూపుతోను పలుమార్లు ఆ శ్రీకృష్ణుని ఆలింగనము చేసికొంటూ, కృష్ణునకును తమకును భేదములేదని నిశ్చయించుకొని ఆనందము పొందుచు – ఆ గోపికలు తన్మయత్వము నొందిరి.

m) శ్లో॥ యం దేవం దేవకీదేవీ వసుదేవాదజీజనత్।
భూమేశ్చ బ్రహ్మణో గుప్త్యై దీప్తమగ్నిమివారణిః॥
– అని భీష్మస్తవరాజము – 31

ఆ॥వె॥ అరణి నగ్నవొడము కరణి దేవకియందు
విప్రకర్మయజ్ఞవేదగుప్తి
కై జనించె నెవ్వ దవ్వసుదేవనం
దను భజంతు నేకతానిరూఢి. – అని 'తిక్కనార్యుని' ఆంధ్రానువాదము.

n) "కృష్ణాయ దేవకీపుత్రాయ" అని ఛాందోగ్యోపనిషత్ 3.17.6
"కృష్ణేన శతబాహునా" అని మహానారాయణోపనిషత్ 4-5
"కృష్ణాదిపంచనామభిః" అని వాసుదేవోపనిషత్ 2
"కృష్ణగోపీనాం జలక్రీడాసు" అని గోపీచందనోపనిషత్ -5
"గోపాలతపనం కృష్ణమ్" అని ముక్తికోపనిషత్ 1-39

ం) 'అనంతుడు' – ఆదిమధ్యాంతరహితుని – గూర్చి చెప్పుట అసాధ్యము. భారత భాగవతాది పురాణ పఠనము చేయుదురుగాక.

II. **శేషః** – శ్లో॥ భోగిభోగాసనాసీనం దదృశుస్తం దివౌకసః।
తత్ఫణామణ్డలోదర్చిర్మణిద్యోతితవిగ్రహమ్॥ – ర.వం. 10-7

"దేవతలందరు ఆదిశేషుని శరీరమునే ఆసనముగా చేసికొని, కూర్చొనియున్న వాడును, ఆతని పడగలవరుసపైనుండి మెఱయుచున్న మణులచేత ప్రకాశింపజేయ బడిన శరీరముగలవాడగు ఆ విష్ణుమూర్తిని గాంచిరి."

**క్రియాదర్శము:–** I. 1) **అవైమి**–అవ–ఉపసర్గ, ఇణ్ (ఇ) గతౌ (వెళ్లుట), సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లట్ – ఉత్తమపురుషైకవచనము.

రూపాలు:– అవ+ఏమి–**అవైమి**, అవ+ఇవః – అవేవః, అవ+ఇమః–అవేమః

2) **నియోక్ష్యే**–ని–ఉపసర్గ, యుజ(యుజ్) సమాధౌ, (చిత్తవృత్తినిరోధము) అకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ, లృట్ – ఉత్తమపురుషైకవచనము.

రూపాలు:– **నియోక్ష్యే** – నియోక్ష్యావహే – నియోక్ష్యామహే.

3) **వ్యాదిశ్యతే**–వి, ఆ, ఉపసర్గలు. దిశ్ (అతిసర్జనే). సకర్మకమ్, అనిట్, ఉభయపదీ, కర్మణిప్రయోగము.

రూపాలు:– **వ్యాదిశ్యతే** – వ్యాదిశ్యేతే – వ్యాదిశ్యన్తే.

---

**అవతారికా:–** నియోగాఙ్గీకారం సిద్ధవత్ కర్తుమాహ – ఆజ్ఞయొక్క అంగీకారమును సిద్ధపఱచుటకు చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఆశంసతా బాణగతిం వృషాఙ్కే**
**కార్యం త్వయా నః ప్రతిపన్నకల్పమ్।**
**నిబోధ యజ్ఞాంశభుజామిదానీ –**
**ముచ్చైర్ద్విషామీప్సితమేతదేవ॥** **14**

**పదవిభాగము:–** ఆశంసతా, బాణగతిమ్, వృషాఙ్కే కార్యమ్, త్వయా, నః, ప్రతిపన్న–కల్పమ్, నిబోధ, యజ్ఞాంశభుజామ్, ఇదానీమ్, ఉచ్చైః, ద్విషామ్, ఈప్సితమ్, ఏతత్, ఏవ.





**అన్వయక్రమము:–** వృషాఙ్కే బాణగతిమ్ ఆశంసతా త్వయా నః కార్యం ప్రతిపన్నకల్పమ్ । ఇదానీమ్ ఉచ్చైర్ద్విషాం యజ్ఞాంశభుజామ్ ఈప్సితమ్ ఏతత్ ఏవ నిబోధ.

**ప్రతిపదార్థము:–** వృషాఙ్కే – శివునిమీదికి, బాణగతిమ్ – బాణప్రసారమును, ఆశంసతా – చెప్పుచున్న, త్వయా – నీచేత, నః – మా, కార్యమ్ – పని, ప్రతిపన్న కల్పమ్ – పూనుకొనబడినట్లే (అయినది), ఇదానీమ్ – ఇప్పుడు, ఉచ్చైర్ద్విషామ్ – గొప్పశత్రువులు గల, యజ్ఞాంశభుజామ్ – దేవతలకు, ఈప్సితమ్ – కోరిక, ఏతత్+ ఏవ – ఇదియే, నిబోధ – తెలిసికొనుము.

**తాత్పర్యము :–** శివునియందు బాణప్రసారమును చెప్పుచున్న నీచేత మా పని పూనుకొనబడినట్లే యైనది. ఇప్పుడు గొప్పశత్రువులుగల దేవతలకు కోరిక ఇదియే. తెలిసికొనుము.

**పాఠాన్తరములు :–** ఉచ్చైర్ద్విషామ్ – ఉచ్చైస్తరామ్.

**విభక్తులు/క్రియలు:–** 1) వృషాంకే–**వృషాంకే**, వృషాంకయోః, వృషాంకేషు, అకారాన్త పుంలింగ వృషాంకశబ్దము, సప్తమీవిభక్తి–ఏకవచనము, 2) బాణగతిమ్–**బాణగతిమ్**, బాణగతీ, బాణగతీః, ఇకారాన్త స్త్రీలింగబాణగతిశబ్దము ద్వి.ఏ., 3) ఆశంసతా–**ఆశంసతా**, ఆశంసద్భ్యామ్, ఆశంసద్భిః, నకారాన్త పుంలింగ ఆశంసన్ శబ్దము, తృ.ఏ., 'ఆశంసా' ప్రథమాఏకవచనము, 4) త్వయా–**త్వయా,** యువాభ్యామ్, యుష్మాభిః, దకారాన్తపుంలింగ యుష్మచ్ఛబ్దము, తృ.ఏ., 5) నః–మమ/మే, ఆవయోః /నౌ, **అస్మాకమ్/నః**, దకారాన్తపుంలింగ అస్మచ్ఛబ్దము, ష.బ. 6) కార్యమ్–**కార్యమ్,** కార్యే, కార్యాణి, అకారాన్త నపుంసకలింగ కార్యశబ్దము, ప్ర.ఏ., 7) ప్రతిపన్నకల్పమ్– **...కల్పమ్**, ...కల్పే, ...కల్పాని, అకారాన్త నపుంసకలింగ .... కల్పశబ్దము, ప్ర.ఏ., 8) ఇదానీమ్, ఏవ– అవ్యయములు, 9) ఉచ్చైర్ద్విషామ్ – ఉచ్చైర్ద్విషః, ఉచ్చైర్ద్విషోః **ఉచ్చైర్ద్విషామ్**, షకారాన్తపుంలింగ ఉచ్చైర్ద్విష్ శబ్దము, ష.బ., 10) యజ్ఞాంశభుజామ్–...భుజః, ...భుజోః, **...భుజామ్**, జకారాన్తపుంలింగ యజ్ఞాంశభుజ్శబ్దము, ష.బ. 11) ఈప్సితమ్–**ఈప్సితమ్**, ఈప్సితే, ఈప్సితాని, అకారాన్త నపుంసకలింగ ఈప్సితశబ్దము, ప్ర.ఏ., 12) ఏతత్–**ఏతత్**, ఏతే, ఏతాని, దకారాన్త నపుంసకలింగ ఏతచ్ఛబ్దము, ప్ర.ఏ., 13) నిబోధ–క్రియ–ని+ బుధ్, లోట్, మధ్యమపురుషైకవచనము.

**సమాసాలు:–**

1) వృషాఙ్కే – వృషః అంకః యస్య (బహువ్రీహి) సః, తస్మిన్.
2) బాణగతిమ్ – బాణానాం గతిః (ష.త.) బాణగతిః, తామ్.
3) ఉచ్చైర్ద్విషామ్ – ఉచ్చైర్ద్విషః యేషామ్ (బహువ్రీహి) తే, తేషామ్.

4) యజ్ఞాంశభుజామ్ – యజ్ఞస్య అంశః (ష.త.) యజ్ఞాంశః, యజ్ఞాంశం భుంజన్తీతి (ఉపపదతత్పు.), యజ్ఞభుజః తేషామ్.

**సంధులు:–**

1) ఏతత్+ఏవ – ఏతదేవ – జశ్త్వసంధిః (**ఝలాం జశోఽన్తే** – సూ. 8.2.39)

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **వృషాంకః – I.** a) వృషోఽఙ్కో ధ్వజచిహ్నం యస్య – శివః

b) శ్లో॥ పీతే గరే **వృషాంకేణ** ప్రీతస్తేఽమరదానవాః।
మమన్థుస్తరసా సిన్ధుం హవిర్ధానీ తతోఽభవత్॥

**శివుడు** – విషపానముచేసినంతట దేవదానవులిరువురు మిగుల ముద మందిన వారై నూతనోత్సాహముతో సముద్రమంథనము నారంభించిరి. దీని ఫలితముగ సురభిగోవు బయల్వెడలెను.

c) శ్లో॥ ఈశానః శశిశేఖరః పశుపతిః శూలీ శివః శంకరః।
..................................................
నీలగ్రీవో వహ్నిరేతాః పినాకీ భీమో భర్గః కృత్తివాసా **వృషాంకః**॥ 12

శ్లో॥ అహిర్బుధ్నో విరూపాక్షః శిపివిష్టో గణాధిపః।
గంగాధరో మహాదేవో మృడః స్యాన్నీలలోహితః॥ 13

అని 'హలాయుధకోశము' 45 నామములను పేర్కొన్నది.

d) శ్లో॥ **ఉమావృషాఙ్కౌ శరజన్మనా** యథా
యథా జయన్తేన శచీపురన్దరౌ ।
తథా నృపః సా చ సుతేన మాగధీ
ననన్దతుస్తత్సదృశేన తత్సమౌ ॥ – రఘువంశమ్– 3.23

"పార్వతీపరమేశ్వరులు – కుమారస్వామిచేతవలెను, శచీదేవేంద్రులు – జయంతునిచేతను వలెను, ఆ పార్వతీపరమేశ్వర – శచీదేవేంద్రులతో సమానులైన సుదక్షిణాదిలీపులు – ఆ కుమారస్వామితోను, జయంతునితోను సమానుడైన తమ 'రఘువు' అను పేరుగల పుత్రునితో కూడి ఆనందించిరి."

II. "ఉక్షా భద్రో బలీవర్దం ఋషభో వృషభో వృషః" ఇతి ।
"కలఙ్కాఙ్కో లాఞ్ఛనం చ చిహ్నం లక్ష్మ చ లక్షణమ్" ఇతి ।



"ఏతర్హి సమ్ప్రతీదానీమధునా సామ్ప్రతం తథా" ఇతి చామరః।
శంసతేర్బహుష్వర్థేషు ప్రయోగో భవతి తథా చోక్తమ్ –

శ్లో॥ ఆశంసతే స్యాదిచ్ఛాయాం శంసతీతి స్తుతౌ భవేత్ ।
హింసాయాం శంసతీచ్ఛాయామాశాస్తే శాన్తి శాసనే ॥ ఇతి।

**క్రియాదర్శము:– నిబోధ** – బుధ(బుధ్) అవగమనే (తెలిసికొనుట) భ్వాదిప్రకరణమ్, సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లోట్ – మధ్యమపురుషైకవచనము – ని–ఉపసర్గ.
రూపాలు:– **నిబోధ** / నిబోధతాత్ – నిబోధతమ్ – నిబోధత.

---

**అవతారికా:–** శంకర విషయాభిలాషమేవ స్ఫుటయతి– శంకరుడు ఆత్మధ్యాన నిష్ఠుడైన దానిని ప్రకటించుచున్నాడు.

**శ్లో॥ అమీ హి వీర్యప్రభవం భవస్య
జయాయ సేనాన్యముశన్తి దేవాః।
స చ త్వదేకేషునిపాతసాధ్యో
బ్రహ్మాఙ్గభూర్బ్రహ్మణి యోజితాత్మా॥** 15

**పదవిభాగము:–** అమీ, హి, వీర్యప్రభవమ్, భవస్య, జయాయ, సేనాన్యమ్, ఉశన్తి, దేవాః, సః, చ, త్వదేకేషునిపాతసాధ్యః, బ్రహ్మాఙ్గభూః, బ్రహ్మణి, యోజితాత్మా।

**అన్వయక్రమము:–** హి అమీ దేవాః జయాయ భవస్య వీర్యప్రభవం సేనాన్యమ్ ఉశన్తి । బ్రహ్మాఙ్గభూః బ్రహ్మణి యోజితాత్మా స చ త్వదేకేషునిపాతసాధ్యః (అస్తి)।

**ప్రతిపదార్థము:–** హి–ఎందువలననగా!, అమీ–ఈ, దేవాః–దేవతలు, జయాయ–జయముకొఱకు, భవస్య–శివునియొక్క, వీర్యప్రభవమ్–తేజస్సువల్ల జనించిన, సేనాన్యమ్–సేనానాయకుని, ఉశన్తి–కోరుచున్నారు, బ్రహ్మాఙ్గభూః–సద్యోజాతాది మన్త్రములకును, హృదయాది మన్త్రములకును స్థానమగు, బ్రహ్మణి–తన తత్త్వము నందు, యోజితాత్మా–కూర్పబడిన చిత్తముగలవాడైన, స చ–ఆ శివుడును, త్వదేకేషు నిపాతసాధ్యః–నీయొక్క ఒక్క బాణముయొక్క దెబ్బచేత సాధ్యుడు.

**తాత్పర్యము:–** ఎందువలననగా? ఈ దేవతలు జయముకొఱకు శివునియొక్క తేజస్సువలన జనించిన సేనానాయకుని కోరుచున్నారు. సద్యోజాతాదిమన్త్రములకు

హృదయాదిమన్త్రములకును స్థానమగు తన తత్త్వమునందు కూర్పబడిన చిత్తము గలవాడైన ఆ శివుడును నీయొక్క ఒక్క బాణపుదెబ్బచేత సాధ్యుడు.

**పాఠాన్తరములు :–** సాధ్యో – హార్యో

**విభక్తులు/క్రియలు:–** 1) హి,చ–అవ్యయములు, 2) అమీ–అసౌ, అమూ, **అమీ**, సకారాన్త పుంలింగ అదశ్శబ్దము, ప్ర.బ., 3) దేవాః–దేవః, దేవౌ, **దేవాః**, అకారాన్త పుంలింగ దేవశబ్దము, ప్ర.బ., 4) జయాయ–**జయాయ,** జయాభ్యామ్, జయేభ్యః, అకారాన్త పుంలింగ జయశబ్దము, చ.ఏ., 5) భవస్య– **భవస్య**, భవయోః, భవానామ్, అకారాన్త పుంలింగ భవశబ్దము, ష.ఏ., 6) వీర్యప్రభవమ్–**వీర్యప్రభవమ్**, వీర్యప్రభవౌ, వీర్యప్రభవాన్, అకారాన్త పుంలింగ వీర్యప్రభవ శబ్దము, ద్వి.ఏ., 7) సేనాన్యమ్–**సేనాన్యమ్**, సేనాన్యౌ, సేనాన్యః, ఈకారాన్త పుంలింగ సేనానీశబ్దము, ద్వి.ఏ. ప్రధీశబ్దవత్, 8) ఉశన్తి–క్రియ–వశ్+లట్– ప్రథమపురుషబహువచనము, 9) బ్రహ్మాఙ్గభూః–**బ్రహ్మాఙ్గభూః**, బ్రహ్మాఙ్గభువౌ, బ్రహ్మాఙ్గభువః, ఊకారాన్త పుంలింగ బ్రహ్మాఙ్గభూ శబ్దము, ప్ర.ఏ.,10) బ్రహ్మణి–**బ్రహ్మణి**,బ్రహ్మణోః బ్రహ్మసు, నకారాన్త పుంలింగ బ్రహ్మన్‌శబ్దము, స.ఏ., 11) యోజితాత్మా–**యోజితాత్మా**, యోజితాత్మానౌ, యోజితాత్మానః, నకారాన్త పుంలింగయో...ఆత్మన్ శబ్దము, ప్ర.ఏ., 12) త్వదేకేషునిపాతసాధ్యః –**....సాధ్యః**....సాధ్యౌ, .....సాధ్యాః, అకారాన్త పుంలింగ ...సాధ్యశబ్దము, ప్ర.ఏ.

**సమాసాలు:–**

1) వీర్యప్రభవమ్ – వీర్యాత్ ప్రభవతీతి (ఉపపదతత్పు) సః, తమ్.
2) బ్రహ్మాఙ్గభూః – బ్రహ్మణః అంగాని (ష.త.) బ్రహ్మాఙ్గాని, బ్రహ్మాఙ్గేభ్యో భవతి (ఉపపదతత్పు.) ఇతి బ్రహ్మాఙ్గభూః.
3) యోజితాత్మా – యోజితః ఆత్మా యేన (బహువ్రీహి) సః॥
4) త్వదేకేషునిపాతసాధ్యః – ఏకశ్చ అసౌ ఇషుః (కర్మధా.) ఏకేషుః, తవ ఏకేషుః (ష.త.) త్వదేకేషుః, త్వదేకేషోః నిపాతః (ష.త.) త్వదేకేషునిపాతః, త్వదేకేషు నిపాతేన సాధ్యః (తృ.త.).

**సంధులు:–**

1) సాధ్యః + బ్రహ్మాఙ్గభూః– సాధ్యో బ్రహ్మాఙ్గభూః – ఉత్వాదేశసంధిః.
2) అఙ్గభూః + బ్రహ్మణి– అఙ్గభూర్బ్రహ్మణి – విసర్గసంధిః.

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **బ్రహ్మాఙ్గభూః**–సద్యోజాతాతి మన్త్రములకు, హృదయాది మన్త్రములకును స్థానము.

**– రుద్రపఞ్చముఖధ్యానమ్ –**

a) **సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయ వై నమోనమః। భవే భవే నాతిభవే భవస్వమామ్ । భవోద్భవాయ నమః॥** – తై.ఆ. 10 ప్ర. 43-44 అను.



**– సద్యోజాతముఖధ్యానమ్ –**

శ్లో॥ ప్రాలేయాచలచంద్రకుందధవళం – గోక్షీరఫేనప్రభం
భస్మాభ్యక్తమనంగదేహదహన – జ్వాలావళీలోచనమ్।
బ్రహ్మేంద్రాదిమరుద్గణైః స్తుతిపరై – రభ్యర్చితం యోగిభిః
వందేఽహం సకలం కలంకరహితం – స్థాణోర్ముఖం పశ్చిమమ్॥

1) హిమవత్పర్వము, 2) చంద్రుడు, 3) మొల్లపూవు – వీనివలె తెల్లనిదియు, ఆవుపాలమీదినురుగువలె తెల్లనికాంతి కలదియు, విభూతిపూయ బడినదియు, మన్మథునిశరీరమును దహించు జ్వాలలపంక్తితో నిండిన కన్ను కలదియు, స్తోత్రము చేయుచున్న బ్రహ్మేంద్రాది దేవసమూహముచేతను, యోగులచేతను శ్రద్ధతో అర్చించబడుచున్నదియు, కళంకరహితమును, నిండుదనముతో కనబడుచున్నదియును అగు శివుని పశ్చిమముఖమును నమస్కరించుచున్నాను. **'సత్త్వగుణప్రధానము'** ఇట స్తుతింపబడినది.

**ఓం నమో భగవతే రుద్రాయ – ఓం శిం పశ్చిమముఖాయ నమః॥**

b) **"వామదేవాయ నమో జ్యేష్ఠాయ నమో రుద్రాయ నమః కాలాయ నమః కలవికరణాయ నమో బలవికరణాయ నమో బలప్రమథనాయ నమ స్సర్వభూతదమనాయ నమో మనోన్మనాయ నమః॥"** తై.ఆ.10ప్ర–43–44అను.

**– వామదేవముఖధ్యానమ్ –**

శ్లో॥ గౌరం కుంకుమపంకిలం సుతిలకం – వ్యాపాణ్డుగణ్డస్థలం
భ్రూవిక్షేప కటాక్షవీక్షణలస–త్సంసక్తకర్ణోత్పలమ్।
స్నిగ్ధం బిమ్బఫలాధరప్రహసితం – నీలాలకాలంకృతం
వన్దే పూర్ణశశాంకమణ్డలనిభం – వక్త్రం హరస్యోత్తరమ్॥

గౌరవర్ణము కలదియు, కుంకుమపూబూతతో బురదకలదియు, చక్కని తిలకము కలదియు, మిక్కిలిగా అంతటను తెల్లనగు చెక్కిలి ప్రదేశము కలదియు, కనుబొమలకదలికలచే – కడగంటిచూపులచే ప్రకాశించునదియు చెవికి అలంకారముగనున్న తెల్లకలువపూవుకలదియు, నల్లని ముంగురులచే అలంకరింపబడినదియు, నిండుచంద్రమండలమువలె ప్రకాశించునదియు అగు శివుని ఉత్తరపుముఖమును నమస్కరించుచున్నాను. **'గుణత్రయ మిశ్రమము'** ఇట స్తుతింపబడినది.

**ఓం నమో భగవతే రుద్రాయ – ఓం వామ్ ఉత్తరముఖాయ నమః।**

c) **అఘోరేభ్యోఽథ ఘోరేభ్యో ఘోరఘోరతరేభ్యః। సర్వతశ్శర్వ సర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః॥** (తై.ఆ.10 ప్ర.43–44)

**– అఘోరముఖధ్యానమ్ –**

శ్లో॥ కాలాభ్ర భ్రమరాఞ్జనద్యుతినిభం – వ్యావృత్తపింగేక్షణం
కర్ణోద్భాసితభోగిమస్తకమణి – ప్రోద్భిన్నదంష్ట్రాఙ్కురమ్।
సర్పప్రోతకపాలశుక్తిశకల – వ్యాకీర్ణసంచారగం
వన్దే దక్షిణమీశ్వరస్య కుటిల – భ్రూభఙ్గరౌద్రం ముఖమ్॥

నల్లనిమేఘములయు, తుమ్మెదలయు, కాటుకలయు కాంతివంటి కాంతితో బాగుగ ప్రకాశించునదియు, మిక్కిలి తిరుగుచుండు పసిమితోకూడిన ఎఱ్ఱదనము కల కన్నులు కలదియు, చెవులయందు బాగుగ ప్రకాశించు చుండు సర్పములశిరస్సులందలి మణులతో మిశ్రితమై కనబడుచుండు కోరలమొలకలుకలదియు, సర్పములతో కూర్చబడిన కపాలములయు, ముత్తెపు చిప్పల ముక్కలతో కలుగు కదలికలను పొందినదియు, వంకరలుగా నున్న కనుబొమలముడులతో భయంకరమును అగు శివుని దక్షిణముఖమును నమస్కరించుచున్నాను. **'తమోగుణప్రధానము'**ఇట స్తుతింపబడినది.

**ఓం నమో భగవతే రుద్రాయ – ఓం మం దక్షిణముఖాయ నమః।**

d) **తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి। తన్నో రుద్రః ప్రచోదయాత్॥** (తై.ఆ.10 ప్ర.43–44 అను.)

**– తత్పురుషముఖధ్యానమ్ –**

శ్లో॥ సంవర్తాగ్నితటిత్ప్రదీప్తకనక – ప్రస్పర్ధితేజోమయం
గమ్భీరధ్వని మిశ్రితోగ్రదహన – ప్రోద్భాసితామ్రాధరమ్।
అర్ధేన్దుద్యుతిలోలపింగళజటా – భారప్రబద్ధోరగం
వన్దే సిద్ధసురాసురేంద్రనమితం – పూర్వం ముఖం శూలినః॥

ప్రలయాగ్నితేజముతోను, ప్రలయకాలపు మెఱపులతేజములతోను బాగుగ కలిగిన బంగరు కాంతితోను పోటీపడుతేజముతో నిండినదియు, గంభీర ధ్వనితో మిశ్రితము అగుటతోపాటు భయంకరాగ్నివలె మిక్కిలి ప్రకాశించు





ఎఱ్ఱనిపెదవికలదియు, అర్ధచంద్రకాంతితో మెఱయు పింగళవర్ణజటల గుంపును దానిని పరివేష్టించిన సర్పములును కలదియును, సిద్ధులచేతను, సురాసురులచేతను నమస్కరింపబడుచుండునదియు అగు శివునితూర్పు ముఖమును నమస్కరించుచున్నాను. **'రజోగుణప్రధానము'** ఇట స్తుతింప బడినది.

**ఓం నమో భగవతే రుద్రాయ – ఓం నం పూర్వముఖాయ నమః।**

e) **ఈశానస్సర్వవిద్యానామీశ్వరః సర్వభూతానాం బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోఽధిపతి ర్బ్రహ్మా శివో మే అస్తు సదాశివోమ్॥** (తై.ఆ.10 ప్ర.43–44 అను.)

**– ఊర్ధ్వముఖధ్యానమ్ –**

శ్లో॥ వ్యక్తావ్యక్తగుణేతరం సువిమలం షట్త్రింశతత్త్వాత్మకం
తస్మాదుత్తరతత్త్వమక్షరమితి – ధ్యేయం సదా యోగిభిః।
వన్దే తామసవర్జితం త్రిణయనం – సూక్ష్మాతిసూక్ష్మాత్పరం
శాన్తం పఞ్చమమీశ్వరస్య వదనం–ఖవ్యాప్తితేజోమయమ్॥

వ్యక్తావ్యక్తములనెడి రెండు విధములగు గుణములు కల రూపముకంటె ఇతరమును, అతినిర్మలమును, 35 తత్త్వములును తన ఆత్మగా కలదియును వాటికంటెను ఆవలితత్త్వము, అక్షరతత్త్వము అని యోగులచేత నిత్యము ధ్యానించబడునదియు, తామసలక్షణములచే వదలబడినదియు, మూడు కన్నులు కలదియు సూక్ష్మాతిసూక్ష్మము కంటెను ఉత్కృష్టమును, ఆవలిదియును, ఆకాశమంతట వ్యాపించు తేజముతో నిండినదియు, శాంత రూపమును అగు శివుని పంచమ(ఊర్ధ్వ)ముఖమును నమస్కరించుచున్నాను. **'గుణాతీతప్రధానము'** ఇట స్తుతింపబడినది.

**ఓం నమో భగవతే రుద్రాయ – ఓం యమ్ ఊర్ధ్వముఖాయ నమః।**

ఇక 'న్యాసము' వీటినిగురించి 'మహాన్యాసమంత్రవ్యాఖ్య' చూడదగును.

**క్రియాదర్శము:– ఉశన్తి** – అదాదిప్రకరణమ్ (2), వశ (కాన్తౌ). సేట్, సకర్మకమ్, పరస్మైపదీ, లట్ ప్రథమపురుషబహువచనము.

రూపాలు:– వష్టి – ఉష్టః – **ఉశన్తి.**

---

**శ్లో॥ తస్మై హిమాద్రేః ప్రయతాం తనూజాం**
**యతాత్మనే రోచయితుం యతస్వ।**
**యోషిత్సు తద్వీర్యనిషేకభూమిః**
**సైవ క్షమేత్యాత్మభువోపదిష్టమ్॥ 16**

**పదవిభాగము:–** తస్మై, హిమాద్రేః ప్రయతామ్, తనూజామ్, యతాత్మనే, రోచయితుమ్, యతస్వ, యోషిత్సు, తద్వీర్యనిషేకభూమిః, సా, ఏవ, క్షమా, ఇతి, ఆత్మభువా, ఉపదిష్టమ్।

**అన్వయక్రమము:–** యతాత్మనే తస్మై ప్రయతాం హిమాద్రేః తనూజాం రోచయితుం యతస్వ। యోషిత్సు తద్వీర్యనిషేకభూమిః సా ఏవ క్షమా ఇతి ఆత్మభువా ఉపదిష్టమ్।

**ప్రతిపదార్థము:–** యాతాత్మనే–నియతచిత్తుడగు, తస్మై–ఆ శివునికొఱకై, ప్రయతామ్–శుద్ధురాలయిన, హిమాద్రేః–హిమవత్పర్వతముయొక్క, తనూజామ్–పుత్రికను, రోచయితుమ్–ఇష్టురాలినిగా చేయుటకు, యతస్వ–యత్నింపుము, యోషిత్సు–స్త్రీలలో, తద్వీర్యనిషేకభూమిః–ఆ శివతేజఃక్షరణమునకు క్షేత్రము, సా ఏవ–ఆ పార్వతియే, క్షమా–సమర్థురాలు, ఇతి–అని, ఆత్మభువా–బ్రహ్మదేవునిచేత, ఉపదిష్టమ్–చెప్పబడినది.

**తాత్పర్యము:–** నియతచిత్తుడగు ఆ శివునికొఱకై శుద్ధురాలయిన హిమవత్పర్వతము యొక్క పుత్రికను ఇష్టురాలినిగాచేయుటకు యత్నింపుము. స్త్రీలలో ఆ శివ తేజః క్షరణమునకు క్షేత్రము ఆ పార్వతియే సమర్థురాలు అని బ్రహ్మదేవునిచేత చెప్పబడినది.

**విభక్తులు/క్రియలు:–** 1) యతాత్మనే–**యతాత్మనే,** యతాత్మభ్యామ్, యతాత్మభిః, నకారాన్తపుంలింగ 'యతాత్మన్' శబ్దము, చ.ఏ., 2) తస్మై–**తస్మై,** తాభ్యామ్, తేభ్యః, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము, చ.ఏ., 3) ప్రయతామ్–**ప్రయతామ్,** ప్రయతే, ప్రయతాః, ఆకారాన్త స్త్రీలింగ ప్రయతాశబ్దము, ద్వి.ఏ., 4) హిమాద్రేః – **హిమాద్రేః,** హిమాద్ర్యోః, హిమాద్రీణామ్, ఇకారాన్తపుంలింగ హిమాద్రి శబ్దము, ష.ఏ., 5) తనూజామ్–**తనూజామ్,** తనూజే, తనూజాః, ఆకారాన్తస్త్రీలింగ తనూజాశబ్దము, ద్వి.ఏ., 6) రోచయితుమ్–'తుమున్' కృదంతప్రత్యయాన్తము–అవ్యయము, 7) యతస్వ–క్రియ–యత్ (ఆత్మనేపదీ) లోట్ – మధ్యమపురుషైకవచనము,8) యోషిత్సు–యోషితి, యోషితోః,**యోషిత్సు**–తకారాన్త స్త్రీలింగ యోషిత్‌శబ్దము స.బ., 9) తద్వీర్యనిషేకభూమిః–...భూమిః, ...భూమీ, ....భూమయః, ఇకారాన్త స్త్రీలింగ ....భూమిశబ్దము, ప్ర.ఏ., 10) సా–**సా**, తే, తాః, దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ప్ర.ఏ., 11) ఏవ, ఇతి – అవ్యయములు, 12) ఆత్మభువా–**ఆత్మభువా,** ఆత్మభూభ్యామ్, ఆత్మభూభిః



ఊకారాన్త పుంలింగ ఆత్మభూశబ్దము, తృ.ఏ., 13) ఉపదిష్టమ్–ఉపదిష్టమ్, ఉపదిష్టే,ఉపదిష్టాని, అకారాన్తనపుంసకలింగ ఉపదిష్టశబ్దము, ప్ర.ఏ.

**సమాసాలు:–**

1) యతాత్మనే–యత ఆత్మా యస్య(బహువ్రీహి) సః, యతాత్మా, తస్మై.
2) హిమాద్రేః–హిమస్య అద్రిః (ష.త.) తస్య.
3) తద్వీర్యనిషేకభూమిః – తస్య వీర్యం (ష.త.) తద్వీర్యమ్, తద్వీర్యస్య నిషేకః (ష.త.) తద్వీర్యనిషేకః, తద్వీర్యనిషేకస్య భూమిః (ష.త.)
4) ఆత్మభువా–ఆత్మనః భవతి (ఉపపదతత్పు.) ఇతి ఆత్మభూః, తేన.

**సంధులు:–**

1) సా+ఏవ–సైవ – వృద్ధిసంధిః – **వృద్ధిరేచి** (సూ. 6. 1. 85). అవర్ణమునకు (అ,ఆలకు) ఏ, ఓ,ఐ,ఔ లు పరమగునపుడు పూర్వపరములస్థానములో వృద్ధి ఏకాదేశమగును. ఏ,ఐ లు పరమగునపుడు ఐకారము, ఓ,ఔ లు పరమగునపుడు ఔకారము వచ్చునని తాత్పర్యము.

2) క్షమా+ఇతి–క్షమేతి – గుణసంధిః – **ఆద్గుణః** (సూ. 6. 1. 84). అవర్ణము (అ,ఆ లకు) హ్రస్వదీర్ఘములయిన ఇ,ఉ,ఋ,ౡ వర్ణములుపరముగా నున్నపుడు పూర్వపరములస్థానములో గుణమేకాదేశము అగును. క్రమముగా ఏ,ఓ,అర్,అల్ అనునవి ఆదేశమగునని గ్రహింపదగును.

3) ఇతి+ఆత్మభువా–ఇత్యాత్మభువా–యణాదేశసన్ధిః **ఇకో యణచి**(సూ. 6-1-74) ఇ,ఉ,ఋ,ౡవర్ణములకు అసవర్ణమైనఅచ్చు పరముగా నున్నప్పుడు క్రమముగ య్, వ్, ర్, ల్ (యణ్) అనునవి ఆదేశమగును.

4) ఆత్మభువా+ఉపదిష్టమ్ – ఆత్మభువోపదిష్టమ్ – గుణసంధిః

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **క్షమా** – a) క్షమతే ఆత్మోపరిస్థితానాం జీవానామ్ అపరాధం యా।
క్షమ్+అచ్+షిత్వాదఙ్ వా తతష్టాప్.

b) శ్లో॥ బాహ్యే చాధ్యాత్మికే చైవ దుఃఖే చోత్పాదితే క్వచిత్।
న కుప్యతి న వా హన్తి సా **క్షమా** పరికీర్తితా ॥ ఇతి ఏకాదశీతత్త్వమ్.

c) శ్లో॥ జ్ఞానే మౌనం **క్షమా** శక్తౌ త్యాగే శ్లాఘావిపర్యయః।
గుణా గుణానుబన్ధిత్వాత్తస్య సప్రసవా ఇవ॥ ర.వం. 1-22

"తనకు ఇతరుల విషయములు తెలిసియున్నను, ఇతరుల విషయములలో తలదూర్చుట సభ్యత కాదని, **మౌనము** వహించువాడు దిలీపుడు. తనకు ప్రతీకారము చేయగలశక్తియున్నను **సహించి** ఊరుకొనువాడు దిలీపుడు. దానము చేసినపుడు తనకు తాను **ప్రశంసించుకొనువాడు కాదు** దిలీపుడు. **జ్ఞానము - శక్తి - త్యాగము**లను గుణములకు విరుద్ధములగు **మౌనము-సహనము-శ్లాఘారాహిత్యము** అను గుణములతో కూడియున్నవాడగుటచే దిలీపునందు ఆ గుణములు ప్రకాశించినవని" తాత్పర్యము.

d) శ్లో॥ తేజః **క్షమా** వా నైకాంతః కాలజ్ఞస్య మహీపతేః।
నైకమోజః ప్రసాదో వా రసభావవిదః కవేః॥ మాఘమహాకావ్యమ్ 2-83

"సమయమెఱింగిన మహారాజునకు **క్షాత్రమే** యనియేని, **క్షమయే** యని యేని నియమము లేదు......"

e) శ్లో॥ బుద్ధిర్ జ్ఞానమసమ్మోహః - **క్షమా** సత్యం దమః శమః।
సుఖం దుఃఖం భవోऽ భావో - భయం చాభయమేవ చ॥ భ.గీ.10.4

"నిశ్చయాత్మకశక్తి, యథార్థజ్ఞానము, మోహరాహిత్యము, క్షమ, సత్యము, దమము, శమము, సుఖదుఃఖము, ఉత్పత్తి-ప్రలయములు, భయము, అభయము... అనునవి నా వలననే కలుగును" అని భగవానుడు గీతయందు విభూతియోగమున తెలిపినాడు.

---

**అవతారికా:-** సాపీదానీం సంనికృష్టైవ తస్యేత్యాహ - ఇప్పుడు పార్వతీదేవియు శివునివద్దనే యున్నదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ గుర్వోర్నియోగాచ్చ నగేన్ద్రకన్యా**
**స్థాణుం తపస్యన్తమధిత్యకాయామ్।**
**అన్వాస్త ఇత్యప్సరసాం ముఖేభ్యః**
**శ్రుతం మయా మత్ప్రణిధిః స వర్గః॥ 17**

**పదవిభాగము:-** గురోః, నియోగాత్, చ, నగేంద్రకన్యా, స్థాణుమ్, తపస్యన్తమ్, అధిత్యకాయామ్, అన్వాస్తే, ఇతి, అప్సరసామ్, ముఖేభ్యః, శ్రుతమ్, మయా, మత్ప్రణిధిః, సః, వర్గః।





**అన్వయక్రమము:-** నగేంద్రకన్యా చ గురోః నియోగాత్ అధిత్యకాయాం తపస్యన్తం స్థాణుమ్ అన్వాస్తే। ఇతి మయా అప్సరసాం ముఖేభ్యః శ్రుతమ్। సః వర్గః మత్ప్రణిధిః (అస్తి)।

**ప్రతిపదార్థము:-** నగేంద్రకన్యా చ - కొండలరాయని కూఁతురు పార్వతీదేవియును, గురోః-తండ్రి యొక్క, నియోగాత్-పంపున, అధిత్యకాయామ్-కొండపైభాగమునందు, తపస్యన్తమ్-తపస్సుచేయుచున్న, స్థాణుమ్-శివుని, అన్వాస్తే-కొలుచుచున్నది, ఇతి-అని, మయా-నాచే, అప్సరసామ్-అప్సరసలయొక్క, ముఖేభ్యః-నోరులనుండి, శ్రుతమ్-వినబడినది, సః-ఆ, వర్గః-గుంపు, మత్ప్రణిధిః-నా యొక్క వేగులవారు.

**తాత్పర్యము:-** పార్వతీదేవియు తండ్రియాజ్ఞవలన కొండపై భాగమునందు తపస్సు చేయుచున్న శివుని కొలుచుచున్నది అని నాచే అప్సరసలయొక్క నోటినుండి వినబడినది. ఆ గుంపు నా వేగులవారు.

**విభక్తులు/క్రియలు:-** 1) నగేంద్రకన్యా-**నగేంద్రకన్యా**, నగేంద్రకన్యే, నగేంద్రకన్యాః, ఆకారాన్త స్త్రీలింగ నగేంద్రకన్యాశబ్దము, ప్ర.ఏ., 2) గురోః-**గురోః**, గురుభ్యామ్, గురుభ్యః, ఉకారాన్త పుంలింగ గురుశబ్దము, పం.ఏ., 3) నియోగాత్ - **నియోగాత్**, నియోగాభ్యామ్, నియోగేభ్యః, అకారాన్త పుంలింగ నియోగశబ్దము, పం.ఏ., 4) అధిత్యకాయామ్-**అధిత్యకాయామ్**, అధిత్యకయోః, అధిత్యకాసు, ఆకారాన్త స్త్రీలింగ అధిత్యకా శబ్దము, స.ఏ.,5) తపస్యన్తమ్-తపస్యన్తమ్, తపస్యన్తౌ, **తపస్యతః**, తకారాన్త పుంలింగ తపస్యత్ శబ్దము ద్వి.ఏ., 6) స్థాణుమ్-**స్థాణుమ్**, స్థాణూ, స్థాణూన్, ఉకారాన్త పుంలింగ స్థాణుశబ్దము, ద్వి.ఏ., 7) అన్వాస్తే-క్రియ-అను+అస్+లట్ - ప్ర.ఏకవచనము, 8) మయా-**మయా**, ఆవాభ్యామ్, అస్మాభిః, దకారాన్త పుంలింగ అస్మచ్ఛబ్దము, తృ.ఏ., 9) అప్సరసామ్-అప్సరసః, అప్సరసోః, **అప్సరసామ్**, సకారాన్త స్త్రీలింగ అప్సరస్ శబ్దము, ష.బ., 10) ముఖేభ్యః-ముఖాత్, ముఖాభ్యామ్, **ముఖేభ్యః**, అకారాన్త నపుంసకలింగ ముఖశబ్దము, పంచమీ బహువచనము, 11) శ్రుతమ్-**శ్రుతమ్**, శ్రుతే, శ్రుతాని, అకారాన్త నపుంసకలింగ శ్రుతశబ్దము, ప్ర.ఏ., 12) సః-**సః**,తౌ,తే,దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము, ప్ర.ఏ., 13) వర్గః-**వర్గః**, వర్గౌ, వర్గాః అకారాన్త పుంలింగ వర్గశబ్దము, ప్ర.ఏ., 14) మత్ప్రణిధిః-**మత్ప్రణిధిః**, మత్ప్రణిధీ, మత్ప్రణిధయః, ఇకారాన్త పుంలింగ మత్ప్రణిధి శబ్దము, ప్ర.ఏ.

**సమాసాలు:-**

1) నగేంద్రకన్యా, న గచ్ఛన్తీతి (ఉపపదతత్పు.) నగాః, నగానామ్ ఇంద్రః (ష.త.) నగేంద్రః, నగేంద్రస్య కన్యా (ష.త.) నగేంద్రకన్యా.
2) మత్ప్రణిధిః - మమ ప్రణిధిః (ష.త.).

**సంధులు:-**

1) గురోః+నియోగాత్ - గురోర్నియోగాత్ - విసర్గసంధిః.

2) నియోగాత్+చ – నియోగాచ్చ – శ్చుత్వసంధిః.

3) అను+ఆస్తే – అన్వాస్తే – యణాదేశసంధిః

4) అన్వాస్తే+ఇతి – అన్వాస్త ఇతి – యవలోపః

**యవలోపః – లోపః శాకల్యస్య** (సూ. 8.3.19) అకారము పూర్వమందుగల పదాంతమందున్న యకారవకారములకు అచ్చులుకాని మృదు హల్లులుకాని పరముగా నున్నప్పుడు లోపము వికల్పముగావచ్చును.

5) ఇతి+అప్సరసామ్ – ఇత్యప్సరసామ్ – యణాదేశసంధిః

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

I. **అధిత్యకా –** a) అధిరూఢా పర్వతోపరిభాగః । అధి+త్యకన్, స్త్రియాం టాప్। పర్వతోపరిభూమిః, త్యకన్ – తద్ధిత ప్రత్యయము.

b) "ఉపత్యకాద్రేరాసన్నా భూమిరూర్ధ్వమ**ధిత్యకా**" ఇత్యమరః।

c) "**అధిత్య**కోర్ధ్వభూమిః స్యాదధోభూమిరుపత్యకా" ఇతి అభిధానచిన్తామణౌ.

d) శ్లో॥ స పాటలాయాం గవి తస్థివాంసం
ధనుర్ధరః కేసరిణం దదర్శ।
**అధిత్యకాయామివ** ధాతుమయ్యాం
లోధ్రద్రుమం సానుమతః ప్రఫుల్లమ్॥ – ర.వం. 2–29

"విల్లును ధరించిన ఆ దిలీపచక్రవర్తి ఎఱ్ఱనిగోవుపై నున్న సింహమును గైరికాది ధాతువులతో కూడిన కొండచరియపై విరియబూసిన లొద్దుగ చెట్టును వలె చూచెను."

**న యాసయోః (సూ. 7.3.45). వా॥ త్యకనశ్చ నిషేధః. ఇతి ఇత్వనిషేధః।**

e) 'ఉపాధిభ్యాం త్యకన్నాసన్నారూఢయోః" (పా.సూ. 5.2.34)
'ఆసన్నమ్ సమీపమ్। ఆరూఢమ్ ఉచ్చస్థానమ్'

శ్లో॥ సముద్రోపత్యకా హైమీ పర్వ**తాధిత్యకా** పురీ।
రత్నపారాయణం నామ్నా లఙ్కేతి మమ మైథిలి॥ భట్టికావ్యము–5.89

శ్లో॥ నతగాత్రి యదాగమేన మాం నయసే మోదగిరేర**ధిత్యకామ్।**
చిరపుణ్యఫలోదయశ్రియాం దివసో వైజననస్తదేష మే॥ చం.భారతే–6.23

**క్రియాదర్శము:–** 1) **అన్వాస్తే** – అను–ఉపసర్గ, ఆస (ఆస్) ఉపదేశనే (కూర్చొనుట) అదాది ప్రకరణమ్, 2) అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, లట్, ప్రథమపురుషైక వచనము.





రూపాలు:– అన్వాస్తే – అన్వాసాతే – అన్వాసతే.

శ్లో॥ వర్తతే తు వసత్యాస్తే ధ్రియతే చావతిష్ఠతే।
క్షియతి స్థలతి స్థిత్యా మఠత్యపి చ తిష్ఠతి॥ 5

అని 'ఆఖ్యాతచంద్రికా' తుల్యమైన లట్ ప్రథమపురుషైకవచనరూపాలను పేర్కొన్నది.

---

**అవతారికా:–** ఇంద్రుడు దేవకార్యమునకై మన్మథుని ప్రేరేపించుట చెప్పుచున్నాడు.

**శ్లో॥ తద్ గచ్ఛ సిద్ధ్యై కురు దేవకార్య–**
**మర్థోఽయమర్థాంతరభావ్య ఏవ।**
**అపేక్షతే ప్రత్యయముత్తమం త్వా**
**బీజాఙ్కురః ప్రాగుదయాదివామ్భః॥ 18**

**పదవిభాగము:–** తద్, గచ్ఛ, సిద్ధ్యై, కురు, దేవకార్యమ్, అర్థః, అయమ్, అర్థాంతరభావ్యః, ఏవ, అపేక్షతే, ప్రత్యయమ్, ఉత్తమమ్, త్వా, బీజాంకురః, ప్రాక్, ఉదయాత్, ఇవ, అమ్భః।

**అన్వయక్రమము:–** తత్ సిద్ధ్యై గచ్ఛ । దేవకార్యం కురు । అయమ్ అర్థః అర్థాంతర భావ్యః ఏవ బీజాంకురః ఉదయాత్ ప్రాక్ అమ్భ ఇవ త్వా ఉత్తమం ప్రత్యయమ్ అపేక్షతే ।

**ప్రతిపదార్థము:–** తత్ – అందువలన, సిద్ధ్యై–(దేవకార్యము) సిద్ధించుటకొఱకు, గచ్ఛ–పొమ్ము, దేవకార్యమ్–దేవతలకార్యమును, కురు– చేయుము, అయమ్–ఈ, అర్థః–కార్యము, అర్థాంతరభావ్యః+ఏవ–కారణాంతరమున కాదగినదియే, బీజాంకురః–విత్తనపుమొలక, ఉదయాత్–మొలుచుటకు, ప్రాక్–ముందు, అమ్భః +ఇవ – నీటినివలె, త్వా(మ్) – నిన్ను, ఉత్తమమ్–శ్రేష్ఠమగు, ప్రత్యయమ్–చరమ కారణముగ, అపేక్షతే–కోరుచున్నది.

**తాత్పర్యము:–** అందువలన ఈ కార్యము సిద్ధించుటకొఱకు పొమ్ము. దేవతల కార్యమును చేయుము. ఇది కారణాంతరమున కాదగినదియే. విత్తు మొలక మొలుచుటకు ముందు నీటినివలె నిన్ను శ్రేష్ఠమగు చరమ కారణముగ కోరుచున్నది.

**పాఠాన్తరములు:–** ప్రత్యయముత్తమం,త్వా – ప్రత్యయమంగలబ్ధ్యై.

**విభక్తులు/క్రియలు:–** 1) తత్–అవ్యయము, 2) సిద్ధ్యై–సిద్ధ్యై, సిద్ధిభ్యామ్, సిద్ధిభ్యః, ఇకారాన్త

స్త్రీలింగ సిద్ధిశబ్దము, చ.ఏ., 3) గచ్ఛ–క్రియ–విధ్యాద్యాశీష్షులోట్ – మధ్యమపురుషైకవచనము, 4) దేవకార్యమ్–**దేవకార్యమ్**,దేవకార్యే, దేవకార్యాణి, అకారాన్త నపుంసకలింగ దేవకార్య శబ్దము, ద్వి.ఏ., 5) కురు–క్రియ–లోట్–మధ్యమపురుషైకవచనము, 6) అయమ్–**అయమ్**, ఇమౌ, ఇమే, మకారాన్త పుంలింగ 'ఇదమ్' శబ్దము, ప్ర.ఏ., 7) అర్థః–**అర్థః**, అర్థౌ, అర్థాః అకారాన్త పుంలింగ అర్థశబ్దము, ప్ర.ఏ., 8) అర్థాంతరభావ్యః–**...భావ్యః**, ...భావ్యౌ, ...భావ్యాః, అకారాన్త పుంలింగ ....భావ్యశబ్దము, ప్ర.ఏ., 9) బీజాంకురః – **బీజాంకురః**, బీజాంకురౌ, బీజాంకురాః, అకారాన్త పుంలింగ బీజాంకురశబ్దము, ప్ర.ఏ., 10) ప్రాక్, ఏవ ఇవ– అవ్యయములు, 11) ఉదయాత్–**ఉదయాత్**, ఉదయాభ్యామ్, ఉదయేభ్యః అకారాన్త పుంలింగ ఉదయశబ్దము, పం.ఏ., 12) అమ్బుః – **అంభః**, అంభసీ, అంభాంసి, సకారాన్త నపుంసకలింగ అంభశ్శబ్దము, ప్ర.ఏ., 13) త్వా–త్వామ్/**త్వా**, యువామ్, వః, దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము, ద్వి.ఏ., 14) ఉత్తమమ్–**ఉత్తమమ్**, ఉత్తమే, ఉత్తమాని–అకారాన్త నపుంసకలింగ ఉత్తమ శబ్దము, ప్ర.ఏ., 15) ప్రత్యయమ్–**ప్రత్యయమ్**, ప్రత్యయే, ప్రత్యయాని – అకారాన్త నపుంసకలింగ ప్రత్యయ శబ్దము, ప్ర.ఏ., 16) అపేక్షతే – క్రియ, అప–ఉపసర్గ, ఈక్ష్(దర్శనే) –లట్ ప్రథమపురుషైక వచనము.

**సమాసాలు:–**

1) దేవకార్యమ్ – దేవానాం కార్యమ్ (ష.త.) దేవకార్యమ్.
2) అర్థాంతరభావ్యః – అన్యః అర్థః అర్థాంతరమ్ (మయూరవ్యంసకాదితత్పు.) అర్థాంతరేణ భావ్యః (తృ.త.) అర్థాంతరభావ్యః।
3) బీజాంకురః – బీజేన సాధ్యః అంకురః (మధ్యమపదలోపితత్పు.) బీజాంకురః

**సంధులు:–**

1) అర్థః+అయమ్ – అర్థోఽయమ్ – ఉత్వాదేశసంధిః – పూర్వరూపము.
2) అర్థాంతరభావ్యః+ఏవ – అర్థాంతరభావ్య ఏవ – విసర్గలోపసంధిః.
3) ప్రాక్+ఉదయాత్ – ప్రాగుదయాత్ – జశ్త్వసంధిః
4) ఉదయాత్+ఇవ – ఉదయాదివ – జశ్త్వసంధిః.
5) ఇవ+అమ్బుః – ఇవామ్బుః – సవర్ణదీర్ఘసంధిః.

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

I. **త్వా/త్వామ్** – త్రిషు లింగేషు సమానః సర్వనామ 'యుష్మద్' శబ్దః।

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర | త్వమ్ | యువామ్ | యూయమ్ | – కర్తా |
| ద్వి | త్వామ్/త్వా | యువామ్/వామ్ | యుష్మాన్/వః | – కర్మ |
| తృ | త్వయా | యువాభ్యామ్ | యుష్మాభిః | – కరణ |
| చ | తుభ్యమ్/తే | యువాభ్యామ్/వామ్ | యుష్మభ్యమ్/వః | – సమ్ప్ర |
| పం | త్వత్ | యువాభ్యామ్ | యుష్మత్ | – అపా |
| ష | తవ/తే | యువయోః/వామ్ | యుష్మాకమ్/వః | – సమ్బో |
| స | త్వయి | యువయోః | యుష్మాసు | – అధి |





1. **త్వమ్** – 'ఙేప్రథమయోరమ్' ఇత్యమి 'త్వాహౌసౌ' ఇతి మపర్యన్తస్య త్వాదేశే 'శేషేలోపః' ఇత్యన్త్యలోపే చ 'అతో గుణే' 'అమి పూర్వః'।
2. **యువామ్** – అమి, 'యువావౌ ద్వివచనే' ఇతి యువాదేశే 'ప్రథమయోశ్చే'తి దకారస్య ఆత్వే పరరూపే దీర్ఘే పూర్వరూపమ్.
3. **యూయమ్** – అమి 'యూయవయౌ జసి' ఇతి యూయాదేశే పరరూపే అదో లోపః।
4. **త్వామ్** – 'త్వమావేకవచనే' ఇతి త్వాదేశే 'ద్వితీయాయాం చ' ఇత్యాత్వే పర రూపే దీర్ఘే పూర్వరూపమ్.
5. **యుష్మాన్** – 'ద్వితీయాయాం చ' ఇత్యాత్వే 'శసోనః' సంయోగాన్తలోపః।
6. **త్వయా** – త్వమాదేశే 'యోఽచి' ఇతి దకారస్య యత్వే పరరూపమ్।
7. **యువాభ్యామ్**–యువాదేశే'యుష్మదస్మదోరనాదేశే'ఇతి దకారస్యాత్వే సవర్ణదీర్ఘః
8. **తుభ్యమ్** – 'తుభ్యమహ్యౌ ఙయి' 'ఙేప్రథమయోరమ్' । శేషే లోపః।
9. **యుష్మభ్యమ్** – 'భ్యసో భ్యమ్' ఇత్యత్ర భ్యమ్–అభ్యమ్ ఇతి వా భేదః। తతశ్చ భ్యసః భ్యమాదేశే అన్త్యలోపే పరరూపమ్।
10. **త్వత్** – త్వాదేశే "ఏకవచనస్య చ" ఇత్యదాదేశే పరరూపే టిలోపః।
11. **యుష్మత్** – 'పంచమ్యా అత్'
12. **తవ** – 'తవమమౌ ఙసి' ఇతి తవాదేశే 'యుష్మదస్మభ్యాం ఙసోఽశ్' ఇత్యశాదేశే పరరూపే టిలోపః।
13. **యువయోః** – యువాదేశే 'యోఽచి' ఇతి యత్వే పరరూపమ్।
14. **యుష్మాకమ్** – అస్మాకమితివత్।
15. **త్వయి** – త్వమాదేశే యత్వే పరరూపమ్।
16. **యుష్మాసు** – 'యుష్మదస్మదోరి' తి ఆత్వే సవర్ణదీర్ఘః।

– బృహత్శబ్దకుసుమాకరమునుండి

2) లగ్నద్విరేఫాంజనభక్తిచిత్రమ్ – ద్వౌ రేఫౌ యేషామ్ (బహువ్రీహి) తే, ద్విరేఫాః అంజనస్య భక్తయః (ష.త.), అంజనభక్తయః, లగ్నాశ్చ తే ద్విరేఫాః (కర్మధా.) లగ్నద్విరేఫాః, లగ్నద్విరేఫా ఏవ అంజనభక్తయః, (కర్మధా.) లగ్నద్విరేఫాంజన భక్తిభిః, చిత్రమ్ (తృ.త.)

3) బాలారుణకోమలేన – బాలాశ్చాసౌ అరుణః (కర్మధా.)బాలారుణః, బాలారుణ ఇవ కోమలః (కర్మధా.) తేన।

4) చూతప్రవాలోష్ఠమ్–చూతస్య ప్రవాలాః (ష.త.) చూతప్రవాలాః, చూతప్రవాలా ఏవ ఓష్ఠః (కర్మధా.) చూతప్రవాళోష్ఠః, తమ్।

**సంధులు:–** 1) మధుశ్రీః+తిలకమ్– మధుశ్రీస్తిలకమ్ – విసర్గసంధిః.

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **భక్తిః –** కుమారసంభవమహాకావ్యమ్ – ఏడవసర్గ–10, 94, శ్లోకభాగములను గమనించగలరు.

శ్లో॥ విన్యస్త వైడూర్యశిలాతలేఽస్మిన్
ఆబద్ధముక్తాఫల**భక్తిచిత్రే।**
ఆవర్జితాష్టాపదకుమ్భతోయైః
సతూర్య మేనాం స్నపయామ్బభూవుః॥ 7–10

"మరకతమణులచే పరుపబడిన శిలాతలముకల ముత్యములవరుసలచే **కూర్చబడిన రంగవల్లులతో చిత్రవర్ణముతో** శోభిల్లు ఆ స్నానగృహమునందు వంచిన బంగారుకుండలనుండి జాలువారు నీటితో ఉమాదేవిని స్నాన మాడించిరి."

శ్లో॥ అథ విబుధగణాం స్తానిన్దుమౌలిర్విసృజ్య
క్షితధరపతికన్యామాదధానః కరేణ।
కనకకలశయుక్తం **భక్తిశోభా** సనాథం
క్షితివిరచితశయ్యం కౌతుకాగారమాగాత్॥ 7–94

b) శ్లో॥ క్వచిత్ఖగానాం ప్రియమానసానాం
కాదమ్బసంసర్గవతీవ పంక్తిః।
అన్యత్ర కాలాగురుదత్తపత్రా
**భక్తి**ర్భువశ్చన్దనకల్పితేవ॥ – ర.వం. 13.55





"....నల్లని అగరుద్రవ్యముతో గీసిన అలంకారరేఖలుగల భూదేవియొక్క శరీరముపై గీయబడిన తెల్లని గంధపు అలంకార రేఖ కలదివలెను, ..."

c) వాల్మీకిమహర్షి విరచిత 'శ్రీమద్రామాయణ' మందలి ఈ పదప్రయోగమును చూడగలరు.

శ్లో॥ సుకృతేహామృగాకీర్ణం సుకీర్ణం **భక్తిభిస్తథా।**
మనశ్చక్షుశ్చ భూతానామాదదత్తిగ్మతేజసా॥ 2.15.36

"...ఈహామృగాలూ ఎన్నో నగిషీలు అక్కడక్కడ చెక్కబడి ఉన్నవి...."

d) శ్లో॥ "అధిరుహ్య స వజ్ర**భక్తిచిత్రమ్** (ఆసనమ్)" – బుద్ధచరితమ్ 5.44

**క్రియాదర్శము:–** 1) **అలంచకార** – అలం–అవ్యయము. డుకృఞ్ (కృ) కరణే (చేయుట) సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ, తనాదిప్రకరణమ్, లిట్–ప్రథమపురుషైకవచనమ్.

రూపాలు:– **అలంచకార** – అలంచక్రతుః – అలంచక్రుః।

a) శ్లో॥ ఆపీనభారోద్వహనప్రయత్నాత్
గృష్టిర్గురుత్వాద్వపుషో నరేంద్రః।
ఉభావ**లంచక్రతు**రంచితాభ్యాం
తపోవనావృత్తిపథం గతాభ్యామ్॥ – ర.వం. 2–18

b) బాణమహాకవి విరచిత 'కాదంబరి'–207 న గల ఈ పద ప్రయోగమును చూడగలరు. 'తత్ర చ శయనీయమలంచకార.'

**అలంకారములు:–** ఇందు **రూపకాలంకార** మున్నదని చెప్పదగును.

"ఉపమేయమును కప్పిపుచ్చక దానియందు ఉపమానగుణమును ఆరోపించినచో 'రూపకము' అని చెప్పబడును.

ఉపమేయోపమానములకు తాదాత్మ్యము కల్పించుటలోనే దీని అలంకారత్వ మున్నది. అన్వయము – సరళము.

---

**శ్లో॥ మృగాః ప్రియాళుద్రుమమఞ్జరీణాం**
**రజఃకణైర్విఘ్నితదృష్టిపాతాః।**

మదోద్ధతాః ప్రత్యనిలం విచేరు-
ర్వనస్థలీర్మర్మరపత్రమోక్షాః॥ **31**

**పదవిభాగము:-** మృగాః, ప్రియాళుద్రుమమఞ్జరీణామ్, రజఃకణైః, విఘ్నితదృష్టిపాతాః , మదోద్ధతాః, ప్రత్యనిలం, విచేరుః, వనస్థలీః, మర్మరపత్రమోక్షాః॥

**అన్వయక్రమము:-** ప్రియాళుద్రుమమంజరీణాం రజఃకణైః విఘ్నితదృష్టిపాతాః మదోద్ధతాః మృగాః ప్రత్యనిలం మర్మరపత్రమోక్షాః వనస్థలీః విచేరుః॥

**ప్రతిపదార్థము:-** ప్రియా...మంజరీణామ్- ప్రేంకణపుతీగలయొక్క గుత్తులయొక్క రజఃకణైః - పుప్పొడిరాగముచే, విఘ్నితదృష్టిపాతాః - విఘ్నముగా చేయబడిన దృష్టి ప్రసారములుగలట్టియు, మదోద్ధతాః-మదముచే విఱ్ఱవీగు, మృగాః-లేళ్లు, ప్రత్యనిలమ్-వాయువునకు ఎదురుగా, మర్మరపత్రమోక్షాః - మరమరధ్వనితో ఆకులు రాలుటలుగల, వనస్థలీః-వనప్రాంతములనుగూర్చి, విచేరుః-సంచరించినవి.

**తాత్పర్యము :-** ప్రేంకణపు తీగలయొక్క గుత్తుల సంబంధమగు పుప్పొడి రాగముచే విఘ్నముగా చేయబడిన దృష్టిప్రసారములు గలట్టియు, మదముచే విఱ్ఱవీగు లేళ్లు వాయువునకు ఎదురుగా మరమరధ్వనితో ఆకులు రాలుటలుగల వనప్రాంతములను గూర్చి సంచరించినవి.

**పాఠాన్తరములు:-** ప్రియాలు - పియాల - ప్రియాల.

**విభక్తులు/క్రియలు:-** 1) ప్రియా...మంజరీణామ్-...మంజర్యాః, మంజర్యోః, **మంజరీణామ్**, ఈకారాన్త స్త్రీలింగ ...మంజరీ శబ్దము, ష.బ., 2) రజఃకణైః-రజఃకణేన, రజఃకణాభ్యామ్, **రజఃకణైః** , అకారాన్త పుంలింగ రజఃకణశబ్దము,తృ.బ., 3) విఘ్నితదృష్టిపాతాః-...పాతః, ...పాతౌ, **...పాతాః** , అకారాన్త పుంలింగ దృష్టిపాతశబ్దము, ప్ర.బ., 4) మదోద్ధతాః-...ఉద్ధతః, ...ఉద్ధతౌ, **...ఉద్ధతాః**, అకారాన్త పుంలింగ ...ఉద్ధతశబ్దము, ప్ర.బ., 5) మృగాః-మృగః, మృగౌ, **మృగాః**, అకారాన్త పుంలింగ మృగశబ్దము, ప్ర.బ., 6) ప్రత్యనిలమ్-అవ్యయము. అనిలం ప్రతి అవ్యయీభావసమాసః, 7) మర్మర పత్రమోక్షాః - మర్మరపత్రమోక్షా, మర్మరపత్రమోక్షే, **మర్మరపత్రమోక్షాః**, ఆకారాన్త స్త్రీలింగ ...మోక్షా శబ్దము, ప్ర.బ., 8) వనస్థలీః-వనస్థలీమ్, వనస్థల్యౌ, **వనస్థలీః**, ఈకారాన్త స్త్రీలింగ వనస్థలీశబ్దము, ద్వి.బ., 9) విచేరుః-వి+చర్+లిట్ - ప్రథమపురుషబహువచనము.

**సమాసాలు:-**

1) ప్రియాలుద్రుమమంజరీణామ్-ప్రియాలూనాం ద్రుమాః (ష.త.) ప్రియాలుద్రుమాః, ప్రియాలుద్రుమాణాం మంజర్యః, (ష.త.) తాసామ్.





2) రజఃకణైః-రజసాం కణాః (ష.త.) రజఃకణాః, తైః॥
3) విఘ్నితదృష్టిపాతాః-విఘ్నితాః దృష్టిపాతాః యేషామ్ (బహువ్రీహి) తే॥
4) మదోద్ధతాః-మదేన ఉద్ధతాః (తృ.త.) మదోద్ధతాః.
5) ప్రత్యనిలమ్ - అనిలం ప్రతి - అవ్యయీభావః.
6) మర్మరపత్రమోక్షాః - పత్రాణాం మోక్షాః (ష.త.) పత్రమోక్షాః, మర్మరాః పత్రమోక్షాః యాసు (బహువ్రీహి) తాః॥
7) వనస్థలీః-వనస్య స్థల్యః (ష.త.) వనస్థల్యః, తాః॥

**సంధులు:-**

1) రజఃకణైః+విఘ్నిత - రజఃకణైర్విఘ్నిత - విసర్గసంధిః.
2) విచేరుః+వనస్థలీః - విచేరుర్వనస్థలీః - విసర్గసంధిః.
3) స్థలీః+మర్మర - స్థలీర్మర్మర - విసర్గసంధిః.

**పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణాలు-కావ్యప్రయోగాలు:-**

1) **మర్మరః** - పుంలింగము - మృ-అరన్ ముట్ చ -

a) మర్మ తత్త్వం మమత్వవ్యక్తశబ్దం వా రాతీతి। రా+క ।
   - శుష్కపర్ణధ్వనిః, వస్త్రస్య పత్రస్య చ ధ్వనిః॥

b) శ్లో॥ భూర్జేషు **మర్మరీ**భూతాః కీచకధ్వనిహేతవః॥
   గంగాశీకరిణో మార్గే మరుతస్తం సిషేవిరే॥ - ర.వం. 4-73

"భూర్జవృక్షపు ఎండుటాకులను కదల్చి, వాని మర్మర ధ్వనితో కూడినవియును, వెదురుబొంగులపై వీచి, వానిలో ఒక మధురస్వరమునుత్పాదింపజేయు నవియును..."

శ్లో॥ అభ్యభూయత వాహానాం చరతాం గాత్రశింజితైః।
   వర్మభిః పవనోద్ధూతరాజతాళీవనధ్వనిః॥ ర.వం. 4-56

సైన్యమున ఉండు గుఱ్ఱములు నడుచుచుండగా, వాని శరీరములపైనున్న కవచ భాగములు శబ్దముచేయుట, గాలికి కదలాడు పోకచెట్ల తోపులనుండి వచ్చు శబ్దమును మించియుండెను.

శ్లో॥ **మర్మరై**రగురుధూపగన్ధిభిః
   వ్యక్తహేమరశనైస్తమేకతః।

జహ్రురాగ్రథనమోక్షలోలుపం
హైమనైర్నివసనైః సుమధ్యమాః॥ ర.వం. 19-41

"గంజిపెట్టబడుటచేత **మరమరమని** చప్పుడు చేయుచున్నవియు, అగరు ధూపములవాసనలు కలవియును, ...."

**క్రియాదర్శము:–** 1) **విచేరుః** – చర(గతౌ) (భక్షణేఽపి) సకర్మకమ్, భ్వాదయః (1) సేట్, పరస్మైపదీ, లిట్– ప్రథమపురుషైకవచనమ్. వి–ఉపసర్గపూర్వకాత్.
రూపాలు:– చచార – చేరుతుః – **చేరుః.**

**అలంకారములు:–** ఇట 'స్వభావోక్త్యలంకార' మున్నదని చెప్పదగును.

ప్రకృతి అతిసుందరముగ వర్ణన చేయబడుటచే నిది 'స్వభావోక్త్యలంకార' మని చెప్పబడినది.

'జాతి–క్రియా–గుణ–ద్రవ్య స్వభావములను వర్ణించుట' – స్వభావోక్తి.

---

**శ్లో॥ చూతాఙ్కురాస్వాదకషాయకణ్ఠః**
**పుంస్కోకిలో యన్మధురం చుకూజ।**
**మనస్వినీమానవిఘాతదక్షం**
**తదేవ జాతం వచనం స్మరస్య॥ 32**

**పదవిభాగము:–** చూతాఙ్కు..కణ్ఠః, పుంస్కోకిలః, యత్, మధురమ్, చుకూజ। మనస్వినీమానవిఘాతదక్షమ్, తత్, ఏవ, జాతమ్, వచనమ్, స్మరస్య।

**అన్వయక్రమము:–** చూతా...కణ్ఠః పుంస్కోకిలః చుకూజ యత్ తత్ ఏవ మనస్వినీ... దక్షం స్మరస్య వచనం జాతమ్।

**ప్రతిపదార్థము:–**చూతాఙ్కుర+ఆస్వాదకషాయకణ్ఠః–మామిడిమొగ్గమొలక భక్షించుటచే రక్తిగల కంఠధ్వనిగల, పుంస్కోకిలః–మగకోకిల, చుకూజ యత్–కూసెననునది యేది కలదో, తత్+ఏవ–అదే, మనస్వనీ–మాన–విఘాత–దక్షమ్ – ప్రణయకలహ కుపిత లగు స్త్రీలరోషముయొక్క కొట్టుటయందు సమర్థమగు, స్మరస్య–మన్మథునియొక్క వచనమ్–మాట, జాతమ్–ఐనది.

**తాత్పర్యము :–** మామిడి మొగ్గమొలక భక్షించుటచే రక్తిగల కంఠధ్వనిగల మగకోకిల





కూసెననునది యేదికలదో అదే ప్రణయకలహకుపితలకు మన్మథునియొక్క మాట యైనది.

**విభక్తులు/క్రియలు:–** 1) చూతా...కణ్ఠః–**...కణ్ఠః**, ...కణ్ఠౌ, ...కణ్ఠాః, అకారాన్త పుంలింగ ...కణ్ఠ శబ్దము, ప్ర.ఏ., 2) పుంస్కోకిలః–**...కోకిలః**, కోకిలౌ,కోకిలాః, అకారాన్త పుంలింగ పుంస్కోకిల శబ్దము ప్ర.ఏ., 3) చుకూజ–క్రియ–కూజ్+లిట్, ప్రథమపురుషైకవచనము, ఏవ–అవ్యయము, 5) మన... దక్షమ్– **...దక్షమ్**, ...దక్షే, ...దక్షాన్, అకారాన్త పుంలింగ ...దక్ష శబ్దము, ద్వి.ఏ., 6) స్మరస్య–**స్మరస్య**, స్మరయోః, స్మరాణామ్, అకారాన్త పుంలింగ స్మరశబ్దము, ష.ఏ., 7) వచనమ్–**వచనమ్**, వచనే,వచనాని, అకారాన్త నపుంసకలింగ వచన శబ్దము, ప్ర.ఏ., 8) జాతమ్–**జాతమ్**, జాతే, జాతాని, అకారాన్త నపుంసకలింగ జాత శబ్దము, ప్ర.ఏ.

**సమాసాలు:–**

1) చూతాంకురాస్వాదకషాయకణ్ఠః–చూతనామ్ అంకురాః(ష.త)చూతాంకురాః చూతాంకురాణామ్ ఆస్వాదః (ష.త.) చూతాంకురాస్వాదః, చూతాంకు–రాస్వాదేన కషాయః కణ్ఠః యస్య (బహువ్రీహి) సః।
2) పుంస్కోకిలః–పుమాన్ చాసౌ కోకిలః (కర్మధా.)
3) మనస్వినీమాన విఘాతదక్షమ్ – మనస్విన్యా మానః (ష.త.) మనస్వినీమానః విశిష్టో ఘాతః, విఘాతః (ప్రాదితత్పు.), మనస్వినీమానస్య విఘాతః (ష.త.) మనస్వినీమానవిఘాతః మనస్వినీమానవిఘాతే దక్షః (ష.త.), తమ్।

**సంధులు:–**

1) పుంస్కోకిలః+యత్– పుంస్కోకిలో యత్ – ఉత్వాదేశసంధిః.
2) పుమ్+కోకిలః–పుఀర్+కోకిలః–పుఀస్కోకిలః,పుంస్కోకిలః, అనునాసికాను –స్వారౌ రుత్వమ్ చ.
3) యత్+మధురమ్ – యన్మధురమ్ – అనునాసికసంధిః.
4) తత్+ఏవ – తదేవ – జశ్త్వసంధిః.

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **పుంస్కోకిలః–అనునాసికానుస్వారౌ రుత్వమ్ చ.** (అనునాసికానుస్వారపూర్వక సకారాదేశః) అమ్పరకములైన అచ్చులు, హయవరఞమఙణనలు పరముగా గల వర్గ ప్రథమ, ద్వితీయాక్షరములు పరముగా నున్నప్పుడు 'పుమ్' శబ్దములోని మకారమునకు; పుమః ఖయ్యమ్పరే (సూ. 8.3.6).
పుమ్+కోకిలః–పుఀర్+కోకిలః–పుఀస్కోకిలః,పుంస్కోకిలః.

**అలంకారములు:–** ఇట 'రూపకాలంకార' మున్నదని చెప్పదగును.

అత్ర నిరర్థకస్యాపి కోకిలాలాపస్య, కామినీజనబన్ధుభూతస్య విదగ్ధతరస్య స్మరస్య ప్రియతమాభిమానవిఘాతదక్షవచనత్వేన రూపణాద్ రూపకాలంకారః। – పుంసవనీవ్యాఖ్యా

---

**శ్లో॥ హిమవ్యపాయాద్విశదాధరాణా–**
**మాపాణ్డరీభూతముఖచ్ఛవీనామ్।**
**స్వేదోద్గమః కిమ్పురుషాఙ్గనానాం**
**చక్రే పదం పత్త్రవిశేషకేషు॥ 33**

**పదవిభాగము:–** హిమవ్యపాయాత్, విశదాధరాణామ్, ఆపాణ్డరీభూతముఖచ్ఛవీనామ్, స్వేదోద్గమః, కిమ్పురుషాంగనానామ్, చక్రే, పదమ్, పత్త్రవిశేషకేషు॥

**అన్వయక్రమము:–** హిమవ్యపాయాత్ విశదాధరాణామ్ ఆపాణ్డరీభూతముఖచ్ఛవీనామ్ కింపురుషాంగనానాం పత్త్రవిశేషకేషు స్వేదోద్గమః పదమ్ చక్రే॥

**ప్రతిపదార్థము:–** హిమవ్యపాయాత్ – మంచుపోవుటవలన, విశదాధరాణామ్–బాధలేని పెదవులు గలట్టియు, ఆపాణ్డరీభీతముఖచ్ఛవీనామ్–కించిత్ పాణ్డురవర్ణము గల ముఖకాంతులు గల, కింపురుషాంగనానామ్–కింపురుషాంగనలకు, పత్త్రవిశేషకేషు–మకరికాపత్త్రరచనలయందు, స్వేదోద్గమః–స్వేదప్రాదుర్భావము, పదమ్–స్థానమును, చక్రే–చేసెను.

**తాత్పర్యము :–** మంచుపోవుటవలన బాధలేని పెదవులుగలట్టియు, కించిత్ పాణ్డుర వర్ణముగలముఖకాంతులుగల కింపురుషాంగనలకు మకరికాపత్త్రరచనలయందు స్వేదప్రాదుర్భావము స్థానమును చేసెను.

**పాఠాన్తరములు :–** ఆపాణ్డరీభూత–ఆపాణ్డురీభూత.

**విభక్తులు/క్రియలు:–** 1) హిమవ్యపాయాత్–**హిమవ్యపాయాత్**, హిమవ్యపాయాభ్యామ్, హిమవ్యపాయేభ్యః – అకారాన్తపుంలింగ హిమవ్యపాయశబ్దము, పంచమీ ఏకవచనము, 2) విశదాధరాణామ్–విశదాధరాయాః, విశదాధరయోః, **విశదాధరాణామ్**, ఆకారాన్త స్త్రీలింగ విశదాధరా శబ్దము, ష.బ., 3) ఆపాణ్డరీభూతముఖచ్ఛవీనామ్ – ...చ్ఛవ్యాః, ...చ్ఛవ్యోః, **...చ్ఛవీనామ్**, ఈకారాన్త స్త్రీలింగ ....చ్ఛవీశబ్దము, ష.బ., 4) కింపురుషాంగనానామ్– కింపురుషాంగనాయాః, కింపురుషాంగనయోః, **కింపురుషాంగనానామ్**, ఆకారాన్త స్త్రీలింగ కింపురుషాంగనా శబ్దము, ష.బ., 5) పత్త్రవిశేషకేషు–





పత్త్రవిశేషకే–పత్త్రవిశేషకయోః, **పత్త్రవిశేషకేషు**, అకారాన్త నపుంసకలింగ పత్త్రవిశేషకశబ్దము, స.బ., 6) స్వేదోద్గమః – **స్వేదోద్గమః**, స్వేదోద్గమౌ, స్వేదోద్గమాః, అకారాన్త పుంలింగ స్వేదోద్గమ శబ్దము, ప్ర.ఏ., 7) పదమ్–**పదమ్**, పదే, పదాని, అకారాన్త నపుంసకలింగ పదశబ్దము, ద్వి.ఏ., 8) చక్రే–క్రియ – లిట్ – ప్రథమపురుషైకవచనము.

**సమాసాలు:–**

1) హిమవ్యపాయాత్–హిమస్య వ్యపాయః (ష.త.) హిమవ్యపాయః, తస్మాత్।
2) విశదాధరాణామ్ – విశదాః అధరాః యాసామ్ (బహువ్రీహి) తాః, తాసామ్।
3) కింపురుషాంగనానామ్ – కింపురుషాణామ్ అంగనాః (ష.త.) కింపురుషాంగనాః, తాసామ్.
4) పత్త్రవిశేషకేషు – పత్త్రాణాం విశేషకాని (ష.త.) పత్త్రవిశేషకాని, తేషు।
5) స్వేదోద్గమః – స్వేదస్య ఉద్గమః (ష.త.) స్వేదోద్గమః।

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **కిమ్పురుషః** – a) కుత్సితః పురుషః (నరః) – కిన్నరః.

b) కిన్నరః స్యాత్ **కింపురుషో** మయురశ్వముఖస్తథా। అని హలాయుధకోశము.

c) శ్లో॥ గీతాన్తరేషు శ్రమవారిలేశైః–కించిత్స ముచ్ఛ్వాసితపత్త్రలేఖమ్।
పుష్పాసవాఘూర్ణితనేత్రశోభి–ప్రియాముఖం **కిమ్పురుష**శ్చుచుమ్బే॥
కు.సం. 3–37.

d) శ్రీ కుమారసంభవమహాకావ్యము – 1–14 ను చూడగలరు.

e) శ్రీమద్భాగవత ఏకాదశస్కంధమునందు 16–29 న గల ఈ పద ప్రయోగమును చూడండి.

శ్లో॥ వాసుదేవో భగవతాం త్వం తు భాగవతేష్వహమ్।
కింపురుషాణాం హనుమాన్విద్యాధ్రాణాం సుదర్శనః॥

**క్రియాదర్శము:– చక్రే** – డుకృఞ్(కృ) కరణే (చేయుట), సకర్మకమ్, అనిట్, (ఉభయ) ఆత్మనేపదీ, తనాది ప్రకరణమ్, లిట్ – ప్రథమపురుషైకవచనము.

రూపాలు:– **చక్రే** –చక్రాతే–చక్రిరే.

శ్లో॥ తతః ప్రజానాం చిరమాత్మనా ధృతాం
నితాన్తగుర్వీం లఘయిష్యతా ధురమ్।
నిసర్గసంస్కారవినీత ఇత్యసౌ
నృపేణ **చక్రే** యువరాజశబ్దభాక్। – ర.వం. 3–35

---

**శ్లో॥ తపస్వినః స్థాణువనౌకసస్తా -**
**మాకాలికీం వీక్ష్య మధుప్రవృత్తిమ్।**
**ప్రయత్నసంస్తమ్భితవిక్రియాణాం**
**కథఞ్చిదీశా మనసాం బభూవుః॥ 34**

**పదవిభాగము:-** తపస్వినః, స్థాణువనౌకసః, తామ్, ఆకాలికీమ్, వీక్ష్య, మధుప్రవృత్తిమ్, ప్రయత్నసంస్తమ్భితవిక్రియాణామ్, కథంచిత్, ఈశాః, మనసామ్, బభూవుః।

**అన్వయక్రమము:-** స్థాణువనౌకసః తపస్వినః తామ్ ఆకాలికీం మధుప్రవృత్తిం వీక్ష్య ప్రయత్న...విక్రియాణాం మనసాం కథంచిత్ ఈశాః బభూవుః।

**ప్రతిపదార్థము:-** స్థాణువనౌకసః-శివవనమున నివసించు, తపస్వినః-తపశ్శాలురు, తామ్-ఆ, ఆకాలికీమ్-కాలముకాని కాలమున పుట్టినశించిన, మధుప్రవృత్తిమ్-వసంతావిర్భావమును, వీక్ష్య-చూచి, ప్రయత్న...విక్రియాణామ్ - ప్రయత్నపూర్వకముగ అణుచుకొనబడిన వికారములుగల, మనసామ్-చిత్తములకు, కథంచిత్- ఎటులనో, ఈశాః-అధిపతులు, బభూవుః-అయిరి.

**తాత్పర్యము :-** శివవనమున నివసించు తపశ్శాలురు ఆ కాలము కాని కాలమున పుట్టి నశించిన వసంతావిర్భావమును చూచి ప్రయత్నపూర్వకముగ అణుచుకొనబడిన వికారములుగల చిత్తములకు ఎటులనో అధిపతులు అయిరి.

**విభక్తులు/క్రియలు:-** 1) స్థాణువనౌకసః-స్థాణువనౌకాః, స్థాణువనౌకసౌ, **స్థాణువనౌకసః** సకారాన్త పుంలింగ ...ఓకస్ శబ్దము, ప్ర.బ., 2) తపస్వినః-తపస్వీ, తపస్వినౌ, **తపస్వినః**, నకారాన్త పుంలింగ తపస్విన్ శబ్దము, ప్ర.బ., 3) తామ్-**తామ్**, తే, తాః, దకారాన్త స్త్రీలింగతచ్ఛబ్దము, ద్వి.ఏ., 4) ఆకాలికీమ్-**ఆకాలికీమ్**, ఆకాలిక్యౌ, ఆకాలికీః, ఈకారాన్త స్త్రీలింగ ఆకాలికీ శబ్దము, ద్వి.ఏ., 5) మధుప్రవృత్తిమ్ - **మధుప్రవృత్తిమ్**, మధుప్రవృత్తీ,మధుప్రవృత్తీః- ఇకారాన్త స్త్రీలింగ మధు ప్రవృత్తి శబ్దము, ద్వి.ఏ., 6) వీక్ష్య-అవ్యయము - వి+ఈక్ష్+క్త్వా-ల్యబన్తము, 7) ప్రయత్న...విక్రియాణామ్-...విక్రియాయాః, ...విక్రియయోః, **...విక్రియాణామ్.**, ఆకారాన్త స్త్రీలింగ ....విక్రియాశబ్దము, ష.బ., 8) మనసామ్ -మనసః, మనసోః, **మనసామ్**, సకారాన్త నపుంసక మనస్ శబ్దము, ష.బ., 9) కథంచిత్-అవ్యయము, 10) ఈశాః-ఈశః, ఈశౌ, **ఈశాః**, అకారాన్త పుంలింగ ఈశశబ్దము ప్ర.బ., 11) బభూవుః - క్రియ-భూ+లిట్-ప్రథమపురుషబహువచనము.

**సమాసాలు:-**

1) స్థాణువనౌకసః - స్థాణోః వనమ్ (ష.త.) స్థాణువనమ్, స్థాణువనమ్, ఓకో యేషామ్ (బహుబ్రీహి) తే।





2) మధుప్రవృత్తిమ్ - మధోః ప్రవృత్తిః (ష.త.) మధుప్రవృత్తిః, తామ్।

3) ప్రయత్నసంస్తమ్భితవిక్రియాణామ్ - ప్రకృష్టో యత్నః - ప్రయత్నః (ప్రాదితత్పు.) విరుద్ధా క్రియా - విక్రియా (ప్రాదితత్పు.) ప్రయత్నేన సంస్తమ్భితా విక్రియా యేషామ్ (బహుబ్రీహి) తే, తేషామ్.

**సంధులు:-**

1) స్థాణువనౌకసః+తామ్-స్థాణువనౌకసస్తామ్ - విసర్గసంధిః।

2) కథంచిత్+ఈశాః - కథంచిదీశాః - జశ్త్వసంధిః।

**పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణాలు-కావ్యప్రయోగాలు:-**

1) **ఆకాలికీ** -a) అకాలే భవః ఠఞ్ - దీనిపై జీప్ ప్రత్యయము.

టిడ్ఢాణఞ్ద్వయసజ్దఘ్నఞ్మాత్రచ్ తయప్ ఠక్ ఠఞ్ కఞ్ క్వరపః (సూ. 4. 1. 15)

(టిత్, ఢ, అణ్, అఞ్, ద్వయసచ్, దఘ్నచ్, మాత్రచ్, తయప్, ఠక్, **ఠఞ్**, కఞ్, క్వరపః, సూ. 4. 1. 15)

b) **'ఆకాలికం** సపది దుర్దినమన్తరిక్షమ్' - మృచ్ఛకటికమ్ - 5.1

ఈపద ప్రయోగమున లింగభేదమును గమనింతురుగాక!

**క్రియాదర్శము:- బభూవుః** - భూ సత్తాయామ్ (ఉండుట), అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్(1), భూతానద్యతనపరోక్షే లిట్.

రూపాలు:- బభూవ - బభూవతుః - **బభూవుః**

శ్లో॥ తాం ప్రత్యభివ్యక్తమనోరథానాం
మహీపతీనాం ప్రణయాగ్రదూత్యః।
ప్రవాలశోభా ఇవ పాదపానాం
శృంగారచేష్టా వివిధా **బభూవుః**॥ - ర.వం. 6.12

---

**శ్లో॥ తం దేశమారోపితపుష్పచాపే**
**రతిద్వితీయే మదనే ప్రపన్నే।**
**కాష్ఠాగతస్నేహరసానువిద్ధం**
**ద్వన్ద్వాని భావం క్రియయా వివవ్రుః॥ 35**

**పదవిభాగము:–** తమ్, దేశమ్, ఆరోపితపుష్పచాపే, రతిద్వితీయే, మదనే, ప్రపన్నే, కాష్ఠ...విద్ధమ్, ద్వంద్వాని, భావమ్, క్రియయా, వివవ్రుః॥

**అన్వయక్రమము:–** ఆరోపితపుష్పచాపే రతిద్వితీయే మదనే తం దేశం ప్రపన్నే ద్వన్ద్వాని కాష్ఠగతస్నేహరస+అనువిద్ధం భావం క్రియయా వివవ్రుః॥

**ప్రతిపదార్థము:–** ఆరోపిత–పుష్పచాపే –ఎక్కుపెట్టబడిన పూవులబాణము గలట్టియు, రతిద్వితీయే–రతియే తనకు రెండవదిగా నున్నట్టియు, మదనే–మన్మథుడు, తం దేశమ్ –ఆ చోటునుగూర్చి, ప్రపన్నే–రాగా, ద్వన్ద్వాని–స్థావరజంగమాత్మకములగు మిథునములు, కాష్ఠగత–స్నేహరస–అనువిద్ధమ్ – ఉత్కర్షను పొందిన ప్రేమ రసముచే కూడిన, భావమ్ – శృంగారభావమును, క్రియయా–చేష్టచే, వివవ్రుః –ప్రకటించినవి.

**తాత్పర్యము :–** ఎక్కుపెట్టబడిన పూవుల బాణముగలట్టియు, రతియే తనకు రెండవదిగా నున్నట్టియు అగు మన్మథుడు ఆ చోటునుగూర్చి రాగా స్థావర జంగమాత్మకములగు మిథునములు ఉత్కర్షను పొందిన ప్రేమరసముచే కూడిన శృంగారభావమును చేష్టచే ప్రకటించినవి.

**విభక్తులు/క్రియలు:–**1) ఆరోపితపుష్పచాపే–**...చాపే**, ...చాపయోః, ....చాపేషు, అకారాన్త పుంలింగ ...చాపశబ్దము, స.ఏ., 2) రతిద్వితీయే–**రతిద్వితీయే**, రతిద్వితీయయోః, రతిద్వితీయేషు, అకారాన్త పుంలింగ రతిద్వితీయశబ్దము, స.ఏ., 3) మదనే – **మదనే**, మదనయోః, మదనేషు, అకారాన్త పుంలింగ మదనశబ్దము, స.ఏ., 4) తమ్–**తమ్**, తౌ, తాన్, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము, ద్వి.ఏ., 5) దేశమ్–**దేశమ్**, దేశౌ, దేశాన్, అకారాన్త పుంలింగ దేశశబ్దము, ద్వి.ఏ., 6) ప్రపన్నే–**ప్రపన్నే**, ప్రపన్నయోః, ప్రపన్నేషు, అకారాన్త పుంలింగ ప్రపన్న శబ్దము, స.ఏ., 7) ద్వంద్వాని – ద్వంద్వమ్,ద్వంద్వే,**ద్వంద్వాని**, అకారాన్త నపుంసకలింగ ద్వంద్వశబ్దము, ప్ర.బ., 8) కాష్ఠ...అనువిద్ధమ్–**...అనువిద్ధమ్**, అనువిద్ధౌ, అనువిద్ధాన్, అకారాన్త పుంలింగ ...అనువిద్ధశబ్దము, ద్వి.ఏ., 9) భావమ్–**భావమ్**, భావౌ, భావాన్ – అకారాన్త పుంలింగ భావశబ్దము, ద్వి.ఏ., 10) క్రియయా–**క్రియయా**, క్రియాభ్యామ్, క్రియాభిః, ఆకారాన్త స్త్రీలింగ క్రియా శబ్దము, తృ.ఏ., 11) వివవ్రుః–వి+వృ+ లిట్ –ప్రథమ పురుషబహువచనము, క్రియ.

**సమాసాలు:–**

1) ఆరోపితపుష్పచాపే–పుష్పాణాం చాపమ్ (ష.త.) పుష్పచాపమ్, ఆరోపితం పుష్పచాపం యేన (బహువ్రీహి) సః, తస్మిన్।
2) రతిద్వితీయే – రతిః ద్వితీయా యస్య (బహువ్రీహి) సః, తస్మిన్।

53



3) కాష్ఠగతస్నేహరసానువిద్ధమ్–స్నేహ ఏవ రసః (కర్మధా.) స్నేహరసః, కాష్ఠగతః చాసౌ స్నేహరసః (కర్మధా) కాష్ఠగతస్నేహరసః తేన అనువిద్ధః (తృ.త.) తమ్.

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) ఇచట **'రస'** స్వరూపమును – పరిశీలించుట భావ్యమని తలంతును.

కా॥ కారణాన్యథ కార్యాణి – సహకారీణి యాని చ।
రత్యాదేః స్థాయినో లోకే–తాని చేన్నాట్యకావ్యయోః॥ 27

కా॥ విభావా అనుభావాశ్చ కథ్యన్తే వ్యభిచారిణః।
వ్యక్తః స తైర్విభావాద్యైః స్థాయీ భావో **రసః** స్మృతః॥ 28

– కావ్యప్రకాశే – చతుర్థోల్లాసే.

లోకంలో రతి మొదలైన స్థాయిభావంయొక్క ఏ కారణములు మరియు కార్యాలూ, సహకారులు ఉన్నవో అవియే నాట్యకావ్యములయందైతే విభావాలు అనీ, అనుభవాలు అనీ, వ్యభిచారిభావాలు అనీ చెప్పబడుచున్నవి. ఆ విభావాదులచేత వ్యంజింపచేయబడిన స్థాయి అయిన భావము **రసము** అని చెప్పబడినది.

కా॥ శృంగారహాస్యకరుణరౌద్రవీరభయానకాః।
బీభత్సాద్భుతసంజ్ఞౌ చేత్యష్టౌ నాట్యే **రసాః** స్మృతాః॥ 29

రసవిశేషాలు:– నాట్యంలో శృంగారము, హాస్యం, కరుణం, రౌద్రం, వీరం, భయానకం, బీభత్సం, అద్భుతం – అనే ఎనిమిది రసాలు చెప్పబడ్డాయి.

కా॥ రతిర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా।
జుగుప్సా విస్మయశ్చేతి స్థాయిభావాః ప్రకీర్తితాః॥

వీటికి స్థాయిభావాలను చెప్పుచున్నాడు – 'రతి, హాసం, శోకం, క్రోధం, ఉత్సాహం, భయం, జుగుప్స, విస్మయం – శృంగారాదులకు క్రమముగా స్థాయిభావాలుగా చెప్పబడినవి.

ఈ స్థాయిభావాలకు రసగంగాధరములో ఇచ్చిన లక్షణాలు – దిగువనీయ బడినవి.

1) స్త్రీపుంసయోరన్యోన్యాలమ్బనః ప్రేమాఖ్యశ్చిత్తవృత్తివిశేషః రతిః స్థాయిభావః

– "స్త్రీ పురుషులలో ఉండే పరస్పరం ఆలంబనంగా గల ప్రేమ అనే ఒక చిత్తవృత్తి రతి అనే స్థాయిభావం". స్త్రీ చిత్తంలో కలిగిన ప్రేమకి (రతికి) పురుషుడు, పురుషుని చిత్తంలో కలిగిన రతికి స్త్రీ ఆలంబనం.

2) వాగఙ్గాది వికారదర్శనజన్మా వికాసాఖ్యో హాసః।
3) పుత్రాదివియోగమరణాది జన్మా వైక్లబ్యాఖ్యశ్చిత్తవృత్తివిశేషః శోకః।
4) గురుబన్ధువధాది పరమాపరాధజన్మా ప్రజ్వలనాఖ్యః క్రోధః।
5) పరపరాక్రమదానాది స్మృతిజన్మా ఔన్నత్యాఖ్య ఉత్సాహః।
6) వ్యాఘ్రదర్శనాది జన్మా పరమానర్థవిషయకో వైక్లబ్యాఖ్యః సః భయమ్।
7) కదర్యవస్తువిలోకనజన్మా విచికిత్సాఖ్యః చిత్తవృత్తివిశేషో జుగుప్సా।
8) అలౌకికవస్తుదర్శనాది జన్మా ఆశ్చర్యాఖ్యో విస్మయః।

ఒక నాయకుని మనసులో నాయికను చూడగానే రతి అనే భావం పుట్టింది. లేదా నాయికుణ్ణి చూడగానే నాయిక మనసులో రతి పుట్టింది. నాయకుని మనసులో పుట్టిన రతికి నాయిక, నాయిక మనసులో పుట్టిన రతికి నాయకుడు కారణము. చంద్రోదయం, వివిక్త ప్రదేశం మొదలైన వాటివల్ల ఆ రతి పుష్టిచెందుతుంది. ఈ కారణాలకే కావ్యాదుల్లో విభావాలు అని పేరు. మనసులో రతి జనించి కొంచెం పుష్టం కాగానే లోకంలో క్రీగంటి చూపులు, ఆయా అవయవాల కదలిక, ఒకరకమైన సంభాషణ మొదలైనవి ప్రారంభం అవుతాయి. ఇవి మనసులో పుట్టిన రతివల్ల జనించాయి గాన దాని కార్యాలు. వీటినే కావ్యాదులలో అనుభావాలు అంటారు.

ఆయా కార్యాలను పుట్టించటానికి సహకరించే భావాలకే కావ్యాదుల్లో వ్యభిచారులు అని పేరు. మనస్సులో పుట్టిన రతి అంతటా వ్యాపించేటట్లు, శరీరం అంతా దాని ప్రభావం కనబడేటట్లు చేయటానికి, దానివలన మరికొన్ని కార్యాలు పుట్టటానికి ఇవి ఉపకరిస్తాయి.

**'విభావానుభావవ్యభిచారిసంయోగాత్ రసనిష్పత్తిః'** ఇతి – 'విభావ, అనుభావ, వ్యభిచారి భావాల సంయోగాలవల్ల రసం నిష్పన్నం అవుతుంది' అని భరతుడు చెప్పినాడు. – బాలానందినినుండి.

చక్కని అవగాహనకు ఈ విషయాలను కూలంకషంగా చర్చించిన – భరతుని నాట్యశాస్త్రం, రసగంగాధరము, సాహిత్యదర్పణములను చూడగలరు.





**క్రియాదర్శము:–** 1) **వివవ్రుః** – వృఞ్ (వృ) వరణే (కోరుట) సకర్మక్, సేట్, క్ర్యాది ప్రకరణమ్ (ఉభయ) పరస్మైపదీ, లిట్ ప్రథమపురుషబహువచనము. వి–ఉపసర్గ పూర్వకాత్.

రూపాలు:– **వివవార** – వివవరతుః, వివవ్రుః/వివవురుః
రఘువంశములోని ఈ పదప్రయోగము చూడండి –

శ్లో॥ శశినముపగతేయం కౌముదీ మేఘముక్తం
జలనిధిమనురూపం జహ్నుకన్యావతీర్ణా।
ఇతి సమగుణయోగప్రీతయస్తత్ర పౌరాః
శ్రవణకటు నృపాణామేకవాక్యం **వివవ్రుః**॥ 6–85.

– – –

**అవతారికా:–** తాశ్చేష్టా ఆహ 'మధు ఇత్యాదిభిశ్చతుర్భిః' – ఆ శృంగారభావములనే నాల్గు శ్లోకములతో చెప్పుచున్నాడు –

**శ్లో॥ మధు ద్విరేఫః కుసుమైకపాత్రే**
**పపౌ ప్రియాం స్వామనువర్తమానః।**
**శృఙ్గేణ సంస్పర్శనిమీలితాక్షీం**
**మృగీమకణ్డూయత కృష్ణసారః॥ 36**

**పదవిభాగము:–** మధు, ద్విరేఫః, కుసుమైకపాత్రే, పపౌ, ప్రియామ్, స్వామ్, అనువర్తమానః,శృంగేణ,సంస్పర్శనిమీలితాక్షీమ్,మృగీమ్,అకణ్డూయత,కృష్ణసారః।

**అన్వయక్రమము:–** ద్విరేఫః కుసుమైకపాత్రే మధు స్వాం ప్రియామ్ అనువర్తమానః పపౌ। కృష్ణసారః సంస్పర్శనిమీలితాక్షీం మృగీం శృంగేణ అకణ్డూయత।

**ప్రతిపదార్థము:–** ద్విరేఫః–తుమ్మెద, కుసుమైకపాత్రే–పూవు అనెడి ఒక గిన్నెయందు, మధు–మకరందమును, స్వామ్–తన, ప్రియామ్– ప్రేయసిని, అనువర్తమానః–అనుసరించుచున్నదై, పపౌ–త్రాగెను, కృష్ణసారః–నల్లలేడి, సంస్పర్శనిమీలితాక్షీమ్–మూయబడిన కన్నులుగల, మృగీమ్–ఆడులేడిని, శృంగేణ–కొమ్ముతో, అకణ్డూయత–గోకెను.

**తాత్పర్యము :–** తుమ్మెద పూవు అనెడి ఒక గిన్నెయందు మకరందమును తన

ప్రేయసిని అనుసరించుచున్నదై త్రాగెను. నల్లలేడి మూయబడిన కన్నులుగల ఆడులేడిని కొమ్ముతో గోకెను.

**పాఠాన్తరములు :–** సంస్పర్శ–చ స్పర్శ.

**విభక్తులు/క్రియలు:–** 1) ద్విరేఫః–**ద్విరేఫః**, ద్విరేఫౌ, ద్విరేఫాః, అకారాన్త పుంలింగ ద్విరేఫ శబ్దము, ప్ర.ఏ., 2) కుసుమైకపాత్రే–**...పాత్రే**, పాత్రయోః, పాత్రేషు, అకారాన్త నపుంసకలింగ కుసుమైకపాత్ర శబ్దము, స.ఏ., 3) మధు–**మధు**, మధునీ, మధూని, ఉకారాన్త నపుంసకలింగ మధుశబ్దము, ప్ర.ఏ., 4) స్వామ్–**స్వామ్**, స్వే, స్వాః, ఆకారాన్త స్త్రీలింగ స్వాశబ్దము, ద్వి.ఏ., 5) ప్రియామ్–**ప్రియామ్**, ప్రియే, ప్రియాః, ఆకారాన్త స్త్రీలింగ ప్రియాశబ్దము, ద్వి.ఏ., 6) అనువర్తమానః–**అనువర్తమానః**, అనువర్తమానౌ, అనువర్తమానాః, అకారాన్త పుంలింగ అనువర్తమాన శబ్దము, ప్ర.ఏ., 7) పపౌ–క్రియ, పా+లిట్–ప్రథమపురుషైకవచనము, 8) కృష్ణసారః – **కృష్ణసారః**, కృష్ణసారౌ, కృష్ణసారాః, అకారాన్త పుంలింగ కృష్ణసారశబ్దము, ప్ర.ఏ., 9) సంస్పర్శనిమీలితాక్షీమ్–**...అక్షీమ్**, ...అక్ష్యౌ, ...అక్షీః, ఈకారాన్త స్త్రీలింగ ...అక్షీ శబ్దము, ద్వి.ఏ., 10) మృగీమ్–**మృగీమ్**, మృగ్యౌ, మృగీః,ఈకారాన్త స్త్రీలింగ మృగీశబ్దము, ద్వి.ఏ., 11) శృంగేణ–**శృంగేణ**, శృంగాభ్యామ్, శృంగైః, అకారాన్త పుంలింగశృంగ శబ్దము, తృ.ఏ., 12) అకణ్డూయత – క్రియ – కండూఞ్ (ఆత్మనేపది) లఙ్, ప్రథమపురుషైకవచనము. – 'కణ్డ్వాదిభ్యో యక్' ఇతి యక్–తతః కర్తరి లఙ్.

**సమాసాలు:–**

1) ద్విరేఫః – ద్వౌ రేఫౌ యస్య (బహువ్రీహి) సః।

2) కుసుమైకపాత్రే – ఏకం చ తత్ పాత్రమ్ (కర్మధా.) ఏకపాత్రమ్।
కుసుమమ్ ఏవ ఏకపాత్రమ్ (కర్మధా.) తస్మిన్।

3) కృష్ణసారః – కృష్ణః చాసౌ సారః చ (కర్మధా.) ఇతి కృష్ణసారః।

4) సంస్పర్శనిమీలితాక్షీమ్ – సంస్పర్శేన నిమీలితే అక్షిణీ యస్యాః (బహువ్రీహి) సా సంస్పర్శనిమీలితాక్షీ, తామ్।

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **కృష్ణసారః –** a) కృష్ణః చాసౌ సారః శబలః చేతి – హరిణభేదః।

b) **కృష్ణసారస్తు** చరతి మృగో యత్ర స్వభావతః।
స జ్ఞేయో యజ్ఞియో దేశో మ్లేచ్ఛదేశస్తతః పరః॥ ఇతి మనుః 2–23

c) శ్లో॥ ఏణః కురంగో హరిణో మృగః స్యాత్
సారంగ ఋష్యః పృషతో రురుశ్చ।
న్యఙ్కుస్తథా రఙ్కురితి ప్రసిద్ధా
వాతప్రమీశమ్బర**కృష్ణసారాః**॥ 230 (హలాయుధకోశము)

అని 13 నామములను పేర్కొన్నది.





d) శ్లో॥ **కృష్ణసారే** దదచ్చక్షుస్త్వయి చాధిజ్యకార్ముకే।
మృగానుసారిణం సాక్షాత్ పశ్యామీవ పినాకినమ్॥

– అభిజ్ఞానశాకున్తలే – ప్రథమాంకే–6

"కృష్ణసారమును, ఆరోపిత ధనుర్ధారివగు నిన్ను చూచుచున్న నేను, పూర్వము దక్షాధ్వరమున మృగరూపము దాల్చి పరుగిడు యాగపశువును వెన్నంటి వెళ్లు సాక్షాత్ పినాకపాణియగు శివునిగా చూచుచున్నట్లు ఉన్నాను."

e) శ్లో॥ **కృష్ణసారచ్ఛవిర్యోఽసౌ** దృశ్యతే కాననశ్రియా।
వనశోభావలోకాయ కటాక్ష ఇవ పాతితః॥ 31–విక్రమోర్వశీయమ్4వ అంకం.

"వనశోభను గాంచుటకు వనలక్ష్మి విలాసముగ తన కటాక్షమును ప్రసరింపజేయుచున్నదో అన్నట్లు ఆ నలుపుచిత్రవర్ణము కలగలసిన రంగులో ఈ సారంగము కనబడుచున్నది."

**క్రియాదర్శము:–** 1) **పపౌ** – పా(పానే) త్రాగుట, భ్వాదిప్రకరణమ్, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లిట్–ప్రథమపురుషైకవచనము.

రూపాలు:– **పపౌ** – పపతుః – పపుః

శ్లో॥ వశిష్ఠధేనోరనుయాయినం తమావర్తమానం వనితా వనాంతాత్।
**పపౌ** నిమేషాలసపక్ష్మపంక్తిరుపోషితాభ్యామివ లోచనాభ్యామ్॥ ర.వం.2.19

2) **అకణ్డూయత**–(ఉభయ) ఆత్మనేపదీ – 'కణ్డ్వాదిభ్యో యక్' – కర్తరిలఙ్. కండూఞ్ – గాత్రవిఘర్షణే.

రూపాలు:– **అకణ్డూయత** – అకణ్డూయేతామ్ – అకణ్డూయన్త.

**అలంకారము:–** ఇట 'స్వభావోక్తి' అలంకారమున్నదని చెప్పదగును.

---

**అవతారికా:–** గజమిథునానాం చక్రవాకమిథునానాం చ భావప్రకాశనమాహ –

**శ్లో॥ దదౌ రసాత్పఙ్కజరేణుగన్ధి**
**గజాయ గణ్డూషజలం కరేణుః।**
**అర్ధోపభుక్తేన బిసేన జాయాం**
**సంభావయామాస రథాఙ్గనామా॥** **37**

**పదవిభాగము:–** దదౌ, రసాత్, పంకజరేణుగన్ధి, గజాయ, గణ్డూషజలమ్, కరేణుః అర్ధోపభుక్తేన, బిసేన, జాయాయ్, సంభావయామాస, రథాంగనామా।

**అన్వయక్రమము:–** రసాత్ కరేణుః పంకజరేణుగన్ధి గణ్డూషజలం గజాయ దదౌ। రథాంగనామా అర్ధోపభుక్తేన బిసేన జాయాం సంభావయామాస॥

**ప్రతిపదార్థము:–** రసాత్–అనురాగమువలన, కరేణుః–ఆడు ఏనుగు, పంకజరేణుగన్ధి –పద్మపరాగముచే సువాసనగల, గణ్డూషజలమ్–పుక్కిటియందలి నీటిని, గజాయ–మగ ఏనుగుకొఱకు, దదౌ–ఇచ్చెను, రథాంగనామా–చక్రవాకము, అర్ధోపభుక్తేన–సగము తినబడిన, బిసేన–తామరతూటిచే, జాయామ్–ప్రియురాలిని, సంభావయామాస–గౌరవించెను.

**తాత్పర్యము:–** అనురాగమున ఆడు ఏనుగు పద్మపరాగముచే సువాసనగల పుక్కిటి యందలి నీటిని మగ ఏనుగుకొఱకు ఇచ్చెను. చక్రవాకము సగము తినబడిన తామరతూటిచే ప్రియురాలిని గౌరవించెను.

**పాఠాన్తరములు :–** 1) రసాత్పంకజ–సరఃపంకజ, 2) భుక్తేన–యుక్తేన.

**విభక్తులు/క్రియలు:–** 1) రసాత్–**రసాత్**, రసాభ్యామ్, రసేభ్యః, అకారాన్త పుంలింగ రసశబ్దము, పంచమీ ఏకవచనము, 2) కరేణుః–**కరేణుః**, కరేణూ, కరేణవః, ఉకారాన్త స్త్రీలింగ కరేణుశబ్దము, ప్ర.ఏ., 3) పంకజరేణుగన్ధి–**...గన్ధి**, ...గన్ధినీ, ....గన్ధీని, ఇకారాన్త నపుంసకలింగ ...గన్ధిశబ్దము, ద్వి.ఏ., 4) గణ్డూషజలమ్– **...జలమ్**, జలే, జలాని, అకారాన్త నపుంసకలింగ ...జలశ్దము, ద్వి.ఏ., 5) గజాయ – **గజాయ**, గజాభ్యామ్, గజేభ్యః, అకారాన్త పుంలింగ గజశబ్దము, చ.ఏ., 6) దదౌ–క్రియ, దా+లిట్ – ప్రథమపురుషైకవచనము., 7) రథాంగనామా–**రథాంగనామా**, రథాంగనామానౌ, రథాంగ నామానః, నకారాన్త పుంలింగ రతాంగనామన్ శబ్దము, ప్ర.ఏ., 8) అర్ధోపభుక్తేన – **అర్ధోపభుక్తేన**, అర్ధోపభుక్తాభ్యామ్, అర్ధోపభుక్తైః, అకారాన్త నపుంసకలింగ అర్ధోపభుక్తశబ్దము, తృ.ఏ., 9) బిసేన–**బిసేన**, బిసాభ్యామ్, బిసైః, అకారాన్త నపుంసకలింగ బిస శబ్దము, తృ.ఏ., 10) జాయామ్–**జాయామ్**, జాయే, జాయాః, ఆకారాన్త స్త్రీలింగ జాయాశబ్దము, ద్వి.ఏ., 11) సంభావయామాస–సమ్+భూ+ణి+అస్+లిట్, ప్రథమపురుషైకవచనము.

**సమాసాలు:–**

1) పంకజరేణుగన్ధి– పంకాత్ జాయతే (ఉపపదతత్పు.) ఇతి పంకజమ్, పంకజస్య రేణుః (ష.త.) పంకజరేణుః, పంకజరేణోః గంధః (ష.త.) పంకజ రేణుగంధః, పంకజరేణుగన్ధోఽ స్యాస్తీతి (బహువ్రీహి) తత్।
2) గండూషజలమ్–గండూషస్య జలమ్ (ష.త.)



3) రథాంగనామా–రథస్య అంగమ్ (ష.త.) రథాంగమ్, రథాంగం నామ యస్య (బహువ్రీహి) సః।
4) అర్ధోపభుక్తేన – అర్ధమ్ ఉపభుక్తమ్ (కర్మధా.) అర్ధోపభుక్తమ్, తేన।

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **సంభావయామాస –** సముపసర్గపూర్వకాత్ ణిజన్తాద్ 'భూ సత్తాయామ్' ఇతి ధాతోర్లిట్.

ప్రయోజకవ్యాపారమును గాని, ప్రేరణార్థకమునుగాని చెప్పుటకు ధాతువుపై ణిచ్(ఇ) ప్రత్యయము చేరును. హేతుమతి చ (సూ.3.1.26). ఈ ణిజన్తము **సనాద్యన్తా ధాతవః** (సూ.3.1.32) అనుసూత్రముచే ధాతుసంజ్ఞ కల్గి యుండుటచే దీనిపై లడాదులు వచ్చును. ఇవి ఉభయపదులు.

భవన్తం ప్రేరయతి–భూ+ఇ – భావి (ఉంచుట)–పరస్మైపదిరూపాలు. లిట్

1) సంభావయాఞ్చకార – సంభావయాఞ్చక్రతుః – సంభావయాఞ్చక్రుః
2) సంభావయామాస – సంభావయామసతుః – సంభావయామాసుః।
3) సంభావయామ్బభూవ – సంభావయామ్బభూవతుః – సంభావయామ్బభూవుః।

2. ఈ శ్లోకమును 'రసాభాస' కు ఉదాహరణగా చెప్పదగును.

---

**అవతారికా:–** ఇత్థం ఖగమృగకామవికారం వర్ణయిత్వా ఇదానీం కింపురుషాదినాం మనోవికారమాహ – ఈలాగు ఖగమృగముల కామవికారమును వర్ణించి ఇప్పుడు కింపురుషుల మనోవికారమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ గీతాన్తరేషు శ్రమవారిలేశైః**
**కిఞ్చిత్సముచ్ఛ్వాసితపత్రలేఖమ్।**
**పుష్పాసవాఘూర్ణితనేత్రశోభి**
**ప్రియాముఖం కిమ్పురుషశ్చుచుమ్బ॥** **38**

**పదవిభాగము:–** గీతాన్తరేషు, శ్రమవారిలేశైః, కించిత్‌సముచ్ఛ్వాసితపత్రలేఖమ్, పుష్పా....శోభి, ప్రియాముఖమ్, కింపురుషః, చుచుమ్బ॥

**అన్వయక్రమము:–** కింపురుషః శ్రమవారిలేశైః కించిత్సముచ్ఛ్వాసితపత్రలేఖం పుష్పాసవాఘూర్ణితనేత్రశోభి ప్రియాముఖం గీతాన్తరేషు చుచుమ్బ॥

**ప్రతిపదార్థము:–** కింపురుషః–కిన్నరుడు, శ్రమవారిలేశైః–చెమట బిందువులచే, కించిత్ సముచ్ఛ్వాసితపత్రలేఖమ్ – కొంచెము శిథిలమైన మకరికాపత్రరచనలు గలది, పుష్పాసవ–ఆఘూర్ణిత–నేత్ర–శోభి – పుష్పమద్యముచే అంతట చలించుచున్న కండ్లచే ప్రకాశించుచున్న, ప్రియాముఖమ్–ప్రేయసిమోమును, గీతాన్తరేషు–గానాన్తరములయందు, చుచుమ్బ–ముద్దిడుకొనియెను.

**తాత్పర్యము:–** కిన్నరుడు, చెమట బిందువులచే కొంచెము చెదరి లేదా కఱిగిన మకరికాపత్రరచనలు గలదియు, పుష్పమద్యముచే అంతట చలించుచున్న కండ్లచే ప్రకాశించుచున్న ప్రేయసి మోమును గానాన్తరములయందు ముద్దిడుకొనియెను.

**పాఠాన్తరములు :–** 1) శోభి–శోభమ్, 2) చుచుమ్బే–చుచుమ్బ.

**విభక్తులు/క్రియలు:–** 1) కింపురుషః–**కింపురుషః**, కింపురుషౌ, కింపురుషాః, అకారాన్త పుంలింగ కింపురుషశబ్దము, ప్ర.ఏ., 2) శ్రమవారిలేశైః–...లేశేన, ...లేశాభ్యామ్, **...లేశైః**, అకారాన్త పుంలింగ ...లేశశబ్దము, తృ.బ., 3) కించిత్ స ...లేఖమ్ – **...లేఖమ్**, ...లేఖే, ...లేఖాని, అకారాన్త నపుంసకలింగ ...లేశశబ్దము, తృ.బ., 4) పుష్పా...శోభి – **...శోభి**, ....శోభినీ, ...శోభీని, ఇకారాన్త నపుంసకలింగ ...శోభిశబ్దము, ద్వి.ఏ., 5) ప్రియాముఖమ్–**ప్రియాముఖమ్**, ప్రియాముఖే, ప్రియాముఖాని, అకారాన్త నపుంసకలింగ ...ముఖశబ్దము, ద్వి.ఏ., 6) గీతాన్తరేషు–గీతాన్తరే, గీతాన్తరయోః, **గీతాన్తరేషు**, అకారాన్త నపుంసకలింగగీతాన్తరశబ్దము, స.బ., 7) చుచుమ్బ– క్రియ, లిట్–ప్రథమపురుషైకవచనము.

**సమాసాలు:–**

1) గీతాన్తరేషు – గీతానామ్ అంతరాణి (ష.త.) గీతాంతరాణి, తేషు।

2) శ్రమవారిలేశైః–శ్రమస్యవారి(ష.త.),శ్రమవారి,శ్రమవారిణో లేశాః (ష.త.),తైః

3) కించిత్సముచ్ఛ్వాసితపత్రలేఖమ్–పత్త్రాణాం లేఖాః (ష.త), పత్త్రలేఖాః, కించిత్సముచ్ఛ్వాసితాః పత్త్రలేఖాః యస్య (బహుప్రీహి) తత్।

4) పుష్పాసవాఘూర్ణితనేత్రశోభి – పుష్పాణామ్ ఆసవః (ష.త.) పుష్పాసవః, పుష్పాసవేన ఆఘూర్ణితే (తృ.త.) పుష్పాసవాఘూర్ణితే, పుష్పాసవాఘూర్ణితే చ తే నేత్రే (కర్మధా.) పుష్పాసవాఘూర్ణితనేత్రే, పుష్పాసవాఘూర్ణితనేత్రాభ్యాం శోభతే (ఉపపదతత్పు.) ఇతి తత్।

5) ప్రియాముఖమ్ – ప్రియాయాః ముఖమ్ (ష.త.) ప్రియాముఖమ్.





**సంధులు:–** కింపురుషః+చుచుమ్బ–కింపురుషశ్చుచుమ్బ – శ్చుత్వసంధిః

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **ఆసవః** – a) ఆఙ్+సుఞ్+అణ్ – మద్యవిశేషః।

b) శ్లో॥ **మధ్వాసవః** శీధు సురాప్రసన్నా
పరిస్రుతా స్యాన్మదిరా మదిష్ఠా।
కాదంబరీ స్వాదురసా చ శుణ్డా
గన్ధోత్తమా మాధవకశ్చ హాలా॥ 329

శ్లో॥ కల్యం కశ్యం తథా మద్యం మైరేయం కాపిశాయనమ్।
మాధ్వీకమాసవః ప్రోక్తః పరిస్రుద్వారుణీ మధు॥ 330
అని హలాయుధకోశము '24' నామములను పేర్కొన్నది.

c) శ్లో॥ యక్షరక్షః పిశాచాన్నం మద్యం మాంసం సురాసవమ్।
తద్బ్రాహ్మణేన నాత్తవ్యం దేవానమశ్నతా హవిః॥

శ్లో॥ యచ్చ పక్వౌషధామ్బుభ్యాం సిద్ధం మద్యం స **ఆసవః** । ఇతి శార్ఙ్గధరః

d) శ్లో॥ మృష్టో భిన్నశకృద్వాతో గౌడస్తర్పణదీపనః।
ఛేదీ **మధ్వాసవస్తీక్ష్ణో** మైరేయో మధురో గురుః॥ ఇతి చరకః

e) శ్లో॥ తీక్ష్ణః **సురాసవో** హృద్యో మూత్రలః కఫవాతనుత్।
సుఖప్రియః స్థిరమదో విజ్ఞేయోఽనిలనాశనః॥ ఇతి సుశ్రుతే.

f) శ్లో॥ శీధురిక్షురసైః పక్వైరపక్వైరాసవో భవేత్।
మైరేయం ధాతకీపుష్పైర్గుడదానామ్లసంహితమ్॥ – మాధవనిదానమ్

**క్రియాదర్శము:– చుచుమ్బ** – చుబి(వక్త్రసంయోగే) సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాదయః(1) – లిట్ – ప్రథమపురుషైకవచనము.

రూపాలు:– **చుచుమ్బ** – చుచుమ్బతుః – చుచుమ్బుః।

---

**శ్లో॥ పర్యాప్తపుష్పస్తబకస్తనాభ్యః
స్ఫురత్ప్రవాలోష్ఠమనోహరాభ్యః।
లతావధూభ్యస్తరవోఽప్యవాపు–
ర్వినమ్రశాఖాభుజబన్ధనాని॥ 39**

**పదవిభాగము:–** పర్యాప్త....నాభ్యః, స్ఫురత్...హరాభ్యః, లతావధూభ్యః, తరవః, అపి, అవాపుః, వినమ్రశాఖాభుజబన్ధనాని.

**అన్వయక్రమము:–** తరవః అపి పర్యాప్త....నాభ్యః స్ఫురత్....హరాభ్యః లతావధూభ్యః వినమ్రశాఖాభుజబన్ధనాని అవాపుః।

**ప్రతిపదార్థము:–** తరవః+అపి – వృక్షములును, పర్యాప్త–పుష్ప–స్తబక–స్తనాభ్యః – సంపూర్ణమగు పూగుత్తులనెడు స్తనములు గలట్టియు, స్ఫురత్–ప్రవాళ–ఓష్ఠ–మనోహరాభ్యః – ప్రకాశించుచున్న చిగుళ్లను పెదవులచే మనోహరములగు, లతా–వధూభ్యః – తీగలనెడు కాంతలవలన, వినమ్ర–శాఖా–భుజ–బన్ధనాని – వంగిన కొమ్మలనెడు భుజములచే కౌగిలింతలను, అవాపుః – పొందినవి.

**తాత్పర్యము :–** వృక్షములును, సంపూర్ణమగు, పూగుత్తులను స్తనములు గలట్టియు, ప్రకాశించుచున్న చిగుళ్లను పెదవులచే మనోహరములగు తీగలనెడు కాంతలవలన వంగిన కొమ్మలనెడు భుజములచే కౌగిలింతలను పొందినవి.

**విభక్తులు/క్రియలు:–** 1) తరవః–తరుః, తరూ, **తరవః**, ఉకారాన్త పుంలింగ తరుశబ్దము ప్ర.బ., 2) పర్యాప్త...స్తనాభ్యః – ...స్తనాయాః, ...స్తనాభ్యామ్, **...స్తనాభ్యః**, ఆకారాన్త స్త్రీలింగ ...స్తనాశబ్దము, పం.బ., 3) స్ఫురత్...మనోహరాభ్యః – మనోహరాయాః, మనోహరాభ్యామ్, **మనోహరాభ్యః**, ఆకారాన్త స్త్రీలింగ ...మనోహరాశబ్దము, పం.బ., 4) లతావధూభ్యః – లతావధ్వాః, లతావధూభ్యామ్, **లతావధూభ్యః**, ఊకారాన్త స్త్రీలింగ ...వధూశబ్దము, పంచమీ బహువచనము, 5) వినమ్ర...బన్ధనాని–బన్ధనమ్, ...బన్ధనే, **...బన్ధనాని**, అకారాన్త నపుంసకలింగ బన్ధనశబ్దము, ద్వి.బ., 6) అవాపుః – అవ+ఆప్+లిట్ – ప్రథమపురుషబహువచనాంతము.

**సమాసాలు:–**

1) పర్యాప్తపుష్పస్తబకస్తనాభ్యః – పుష్పాణాం స్తబకాః (ష.త.) పుష్పస్తబకాః, పర్యాప్తః చ తే పుష్పస్తబకాః (కర్మధా.) పర్యాప్తపుష్పస్తబకాః, పర్యాప్తపుష్పస్తబకా ఏవ స్తనాః యాసామ్ (బహువ్రీహి) తాః, తాభ్యః।

2) స్ఫురత్ప్రవాలోష్ఠమనోహరాభ్యః – స్ఫురన్తః చ తే ప్రవాలాః (కర్మధా.), స్ఫురత్ప్రవాలాః, స్ఫురత్ప్రవాలా ఏవ ఓష్ఠాః (కర్మధా), స్ఫురత్ప్రవాలోష్ఠాః, మనసః హరాః (ష.త.) మనోహరాః, స్ఫురత్ప్రవాలోష్ఠైః మనోహరాః (తృ.త.) తాభ్యః।

3) లతావధూభ్యః – లతా ఏవ వధ్వః (కర్మధా.) లతావధ్వః, తాభ్యః।





4) వినమ్రశాఖాభుజబన్ధనాని – వినమ్రాః చ తాః శాఖాః (కర్మధా.) వినమ్రశాఖాః, వినమ్రశాఖా ఏవ భుజాః (కర్మధా.), వినమ్రశాఖాభుజైః బన్ధనమ్ (తృ.త.) తాని।

**సంధులు:–** 1) లతావధూభ్యః + తరవః – లతావధూభ్యస్తరవః – విసర్గసంధిః

2) తరవః+అపి – తరవోఽపి – ఉత్వాదేశము – పూర్వరూపము।

3) అపి+అవాపుః – అప్యవాపుః – యణాదేశసంధిః

4) అవాపుః + వినమ్ర – అవాపుర్వినమ్ర – విసర్గసంధిః.

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **స్తబకః** – a) తిష్ఠతీతి। స్థా+'స్థః స్తోఽమ్బుజబకౌ' ఇతి అవక, ధాతోశ్చ స్తాదేశః

b) పుష్పాదిస్తవకే గుచ్ఛో ముక్తాహారకలాపయోః – ఇతి రన్తిదేవః।

c) 'స్యాద్ గుచ్ఛః **స్తవకే** స్తమ్బే హారభేదకలాపయోః।' – ఇతి మేదినీ।

d) '**స్తవకే** హారభేదే చ గుత్సః స్తమ్బే చ కీర్తితః – ఇతి రుద్రః।

e) 'ముకురః కుడ్మలశ్చాపి **స్తవకో** గుత్సకావితి' – ఇతి హడ్డః।

f) 'స్తమ్బో గుచ్ఛస్తృణాదికః'। '**స్తబకః** పుష్పగుచ్ఛః' ఇతి పాణిని సూత్రవ్యాఖ్యా.

g) **స్తబకో** గుచ్ఛకో గుచ్ఛో గులుఞ్ఛః పరికీర్తితః – ఇతి హలాయుధః

h) శ్లో॥ ఇదమపాస్య విరాగి పరాగిణీరలికదమ్బకమ్బురుహాం తతీః।
స్తనభరేణ జిత**స్తబ**కానమన్నవలతే వలతేఽభిముఖం తవ॥

–శి.వధే –6.11

**క్రియాదర్శము:–** 1) **అవాపుః**–ఆప్లృ (ఆప్) వ్యాప్తౌ (వ్యాపించుట) అవ ఉపసర్గ పూర్వకాత్, స్వాదిప్రకరణమ్(5), సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లిట్–ప్రథమ పురుషైకవచనము.

రూపాలు:– అవాప – అవాపతుః – **అవాపుః**

**అలంకారము:–** ఇట 'రూపకాలంకార' మున్నదని చెప్పదగును.

లక్షణము:– ఉపమేయమును కప్పిపుచ్చక దానియందు ఉపమానగుణమును ఆరోపించినచో 'రూపకము'.

లక్షణ విశేషము – ఉపమేయోపమానములకు తాదాత్మ్యము కల్పించుటలో దీని అలంకారత్వమున్నది. కాని ఆ ఐక్యములో ఉపమేయమును దాచకూడదు. సందేహ – అపహ్నుతి – భ్రాంతిమత్ – అతిశయోక్తి అలంకారములలో

ఉపమేయమును దాచుటయే లక్షణము. రూపకములో అది జరుగకూడదు. ఉపమానము తనరూపమును ఉపమేయమునకిచ్చునది కాబట్టి రూపకమైనది.

ఇట పుష్పగుచ్ఛము – స్తనము
కంపమానపల్లము – ఓష్ఠము
లతలు – యువతులు
వృక్షము – కామాతురుడైన పురుషుడు
కొమ్మలు – భుజములుగా రూపింపబడుటచే నిది 'రూపకాలంకార' మగును.

---

శ్లో॥ శ్రుతాప్సరోగీతిరపి క్షణేఽస్మిన్
హరః ప్రసంఖ్యానపరో బభూవ।
ఆత్మేశ్వరాణాం న హి జాతు విఘ్నాః
సమాధిభేదప్రభవో భవన్తి॥ 40

**పదవిభాగము:–** శ్రుతాప్సరోగీతిః, అపి, క్షణే, అస్మిన్,హరః ప్రసంఖ్యానపరః బభూవ, ఆత్మేశ్వరాణామ్, న, హి, జాతు, విఘ్నాః, సమాధిభేదప్రభవః, భవన్తి।

**అన్వయక్రమము:–** అస్మిన్ క్షణే శ్రుతాప్సరోగీతిః అపి హరః ప్రసంఖ్యానపరః బభూవ। హి ఆత్మేశ్వరాణాం విఘ్నాః జాతు సమాధిభేదప్రభవః న భవన్తి॥

**ప్రతిపదార్థము:–** అస్మిన్ – ఈ, క్షణే – వసంతసమయమందు, శ్రుతాప్సరోగీతిః –వినబడిన అప్సరస్ స్త్రీ గానముకలవాడు, అపి – ఐనను, హరః – శివుడు, ప్రసంఖ్యానపరః – ఆత్మానుసంధానమునందు ఆసక్తిగలవాడు, బభూవ–ఆయెను, హి – ఏలయన, ఆత్మేశ్వరాణామ్ – చిత్తస్వాధీనముగలవారికి, విఘ్నాః – అంతరాయములు, జాతు–ఒకానొకప్పుడు, సమాధిభేదప్రభవః–ఆత్మానుసంధాన భంగజనితములు, న భవన్తి–కావు.

**తాత్పర్యము :–** ఈ వసంతసమయమందు వినబడిన అప్సరస్ స్త్రీగానము కలవాడైనను శివుడు ఆత్మానుసంధానమునందు ఆసక్తిగలవాడు ఆయెను. ఏలయన చిత్త స్వాధీనము గలవారికి అంతరాయములు ఒకానొకప్పుడు ఆత్మానుసంధానభంగ జనితములు కావు.





**పాఠాన్తరములు :–** ప్రభవః–ప్రభవాః।

**విభక్తులు/క్రియలు:–** 1) అస్మిన్ – **అస్మిన్**, అనయోః ఏషు, దకారాన్త పుంలింగఇదమ్ శబ్దము, స.ఏ., 2) క్షణే–**క్షణే**, క్షణయోః, క్షణేషు, అకారాన్త పుంలింగ క్షణశబ్దము, స.ఏ., 3) శ్రుతాప్సరోగీతిః –**...గీతిః**, గీతీ, గీతయః, ఇకారాన్తపుంలింగ ...గీతిశబ్దము, ప్ర.ఏ., 4) హరః–**హరః**,హరౌ, హరాః అకారాన్త పుంలింగ హరశబ్దము ప్ర.ఏ., 5) అపి, హి, న – అవ్యయములు, 6) జాతు – అవ్యయము, 7) ప్రసంఖ్యాపరః–**...పరః**, ...పరౌః ...పరాః, అకారాన్త పుంలింగ ...పరశబ్దము, ప్ర.ఏ., 8) ఆత్మేశ్వరాణామ్–...ఈశ్వరస్య, ...ఈశ్వరయోః, **...ఈశ్వరాణామ్**, అకారాన్త పుంలింగ ...ఈశ్వరశబ్దము, ష.బ, 9) విఘ్నాః – విఘ్నః, విఘ్నౌ, **విఘ్నాః**, అకారాన్త పుంలింగ విఘ్నశబ్దము, ప్ర.బ., 10) సమాధిభేదప్రభవః– **...ప్రభుః**, ...ప్రభూ, ...ప్రభవః, ఉకారాన్త పుంలింగ ...ప్రభుశబ్దము, ప్ర.బ., 11) భవన్తి–క్రియ, 12) బభూవ – క్రియ.

**సమాసాలు:–**

1) శ్రుతాప్సరోగీతిః – అప్సరసాం గీతిః (ష.త.) అప్సరోగీతిః, శ్రుతా అప్సరోగీతిః యేన (బహువ్రీహి) సః।
2) ప్రసంఖ్యానపరః – ప్రసంఖ్యానే పరః (స.త.)।
3) ఆత్మేశ్వరాణామ్ – ఆత్మనః ఈశ్వరాః (ష.త.) ఆత్మేశ్వరాః, తేషామ్।
4) సమాధిభేదప్రభవః–సమాధేః భేదః (ష.త.) సమాధిభేదః, సమాధిభేదే ప్రభుః (స.త.), సమాధిభేదప్రభుః, తే । అథవా సమాధి భేదే ప్రభవః(స.త.) సమాధిభేదప్రభవః।

**సంధులు:–** 1) గీతిః + అపి – గీతిరపి – విసర్గసంధిః
2) క్షణే+అస్మిన్ – క్షణేఽస్మిన్ – పూర్వరూపసంధిః।
ఏఙః పదాన్తాదతి (సూ.6.1.105) పదాంతమందున్న ఏ ఓలకు హ్రస్వ అకారము పరముగా నున్నప్పుడు పూర్వపరముల స్థానమున పూర్వరూపము ఏకాదేశమగును.
3) ప్రసంఖ్యానపరః+బభూవ – ప్రసంఖ్యానపరో బభూవ – ఉత్వాదేశసంధిః
4) ప్రభవః + భవన్తి – ప్రభవో భవన్తి – ఉత్వాదేశసంధిః.

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **జాతు–** a) **'ఖేదామర్షసమ్భావనానిశ్చయకదాచిదర్థేషు దృశ్యతే'।** (అవ్యయకోశము)
1) ఖేదే – 'న జాత్వహం భుంజే'।
2) అమర్షే – 'న జాత్వస్య సుకృతమస్తి'।

3) సంభావనాయామ్ – 'శూద్రం కో **జాతు** యాజయేత్'।
4) నిశ్చయే – 'కో **జాతు** యుధ్యతేఽర్జునేన?
5) కదాచిదర్థే–'న **జాతు** కామః కామానాముపభోగేన' (మనుస్మృతి–2.94)

b) **కారణోపదేశేఽపి దృశ్యతే।**
యథా – 'స్వస్థో న జాతు బహుభుక్'।

c) **గర్హాయామప్యనుశాసనాత్ సిద్ధమ్ ।** యథా – '**జాతు** నిందసి గోవిందమపి నిందసి శంకరమ్' ముగ్ధబోధే.

శ్లో॥ తదాప్రభృత్యున్మదనా పితుర్గృహే
లలాటికా చన్దనధూసరాలకా।
న **జాతు** బాలా లభతే స్మ నిర్వృతిం
తుషారసంఘాతశిలాతలేష్వపి ॥ కు.సం.– 5.55

"...శిలలుగా మారిన హిమశిలలమీద పరుండి కూడ ఏ ఒక్క క్షణమును సుఖమును పొందలేదు".

**క్రియాదర్శము:–** 1) **భవన్తి** – భూ సత్తాయామ్ (ఉండుట) అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, వర్తమానే లట్ –

ప్రథమపురుషరూపాలు – భవతి – భవతః – **భవన్తి।**

2) **బభూవ** – భూతానద్యతనపరోక్షే లిట్.

ప్రథమపురుషరూపాలు – **బభూవ** – బభూవతుః – బభూవుః।

**అలంకారము:–** ఇట 'అర్థాంతరన్యాసాలంకార' మున్నదని చెప్పదగును.

లక్షణము:– సామాన్యమైన ఒక అర్థము చెప్పి దానిచే విశేషార్థమును గాని, విశేషము చెప్పి సామాన్యార్థమునుగాని సమర్థించుట అర్థాంతరన్యాసము. ఇట సామాన్యముచే విశేషము సమర్థింపబడినది. కనుక అర్థాంతరన్యాసమని చెప్పబడినది.

---

**అవతారికా:–**నందీశ్వరుడు–ప్రమథగణములను శబ్దముచేయవద్దని సంజ్ఞతో చెప్పుచున్నాడు.

**శ్లో॥ లతాగృహద్వారగతోఽథ**
**వామప్రకోష్ఠార్పితహేమవేత్రః।**





**ముఖార్పితైకాఙ్గులిసంజ్ఞయైవ**
**మా చాపలాయేతి గణాన్ వ్యనైషీత్॥ 41**

**పదవిభాగము:–** లతాగృహద్వారగతః, అథ, నన్దీ, వామప్రకోష్ఠార్పితహేమవేత్రః ముఖార్పితైకాఙ్గులిసంజ్ఞయా, ఏవ, మా, చాపలాయ, ఇతి, గణాన్, వ్యనైషీత్।

**అన్వయక్రమము:–** అథ లతాగృహద్వారగతః వామప్రకోష్ఠార్పితహేమవేత్రః నన్దీ ముఖార్పితైకాఙ్గులిసంజ్ఞయా ఏవ గణాన్ 'చాపలాయ మా' ఇతి వ్యనైషీత్।

**ప్రతిపదార్థము:–** అథ–పిమ్మట, లతాగృహద్వారగతః – లతాగృహద్వారము వద్ద ఉన్నవాడును, వామప్రకోష్ఠార్పితహేమవేత్రః – ఎడమ ముంజేత ఉంచుకొనబడిన బంగరుదండముకలవాడును అగు, నన్దీ–నందీశ్వరుడు, ముఖార్పితైకాఙ్గులి సంజ్ఞయా ఏవ– నోటిమీద ఉంచబడిన ఒక వ్రేలియొక్క సంజ్ఞచేతనే, గణాన్–ప్రమథ గణములను, మా చాపలాయ–'అల్లరి మానుడు', ఇతి–అని, వ్యనైషీత్–ఆజ్ఞాపించెను.

**తాత్పర్యము :–** పిమ్మట, లతాగృహద్వారమువద్ద ఉన్నవాడును, ఎడమ ముంజేత ఉంచుకొనబడిన బంగరుదండము కలవాడును అగు నందీశ్వరుడు నోటిమీద ఉంపబడిన ఒక వ్రేలియొక్క సంజ్ఞచేతనే ప్రమథగణములను 'అల్లరి మానుడు' అని ఆజ్ఞాపించెను.

**పాఠాన్తరములు :–** 1) ద్వార–ద్వారి, 2) ముఖా–నాసా, 3) వ్యనైషీత్–న్యషేధీత్.

**విభక్తులు/క్రియలు:–** 1) లతాగృహద్వారగతః– **...గతః**, ...గతౌ, ....గతాః, అకారాన్త పుంలింగ ....గత శబ్దము, ప్ర.ఏ., 2) వామ...వేత్రః–**...వేత్రః**, ...వేత్రౌ, ...వేత్రాః, అకారాన్త పుంలింగ ...వేత్ర శబ్దము, ప్ర.ఏ., 3) నన్దీ – **నన్దీ**, నన్దినౌ, నన్దినః, నకారాన్త పుంలింగ నన్దిన్ శబ్దము, ప్ర.ఏ., 4) ముఖార్పిత...సంజ్ఞయా–**...సంజ్ఞయా**, ...సంజ్ఞాభ్యామ్, ...సంజ్ఞాభిః, ఆకారాన్త స్త్రీలింగ ...సంజ్ఞా శబ్దము, తృ.ఏ., 5) గణాన్ – గణమ్, గణౌ, **గణాన్**, అకారాన్త పుంలింగ గణశబ్దము, ద్వి.బ., 6) మా, అథ, ఏవ, ఇతి – అవ్యయాలు, 7) చాపలాయ–**చాపలాయ**, చాపలాభ్యామ్, చాపలేభ్యః, అకారాన్త నపుంసకలింగ చాపలశబ్దము, చ.ఏ., 8) వ్యనైషీత్–వి+నీ+లుఙ్, ప్రథమపురుషైకవచనము.

**సమాసాలు:–**

1) లతాగృహద్వారగతః–లతాభిః నిర్మితం గృహం (మధ్యమపదలోపి తత్పురుష) లతాగృహమ్, లతాగృహస్య ద్వారమ్ (ష.త.) లతాగృహద్వారమ్, లతాగృహ ద్వారం గతః (ద్వి.త.) లతాగృహద్వారగతః।

2) వామప్రకోష్ఠార్పితహేమవేత్రః – హేమ్నః వేత్రమ్ (ష.త.) హేమవేత్రమ్, వామః చాసౌ ప్రకోష్ఠః (కర్మధా.) వామప్రకోష్ఠః, వామప్రకోష్ఠే అర్పితహేమ వేత్రం యేన సః (బహు) వామప్రకోష్ఠార్పితహేమవేత్రః.

3) ముఖార్పితైకాఙ్గులిసంజ్ఞయా – ముఖే అర్పితా (స.త.)। ముఖార్పితా ఏకా చాసౌ అంగులిః (కర్మధా.) ఏకాంగులిః, ముఖార్పితా చాసౌ ఏకాంగులిః (కర్మధా.)ముఖార్పితైకాంగులిః, ముఖార్పితైకాంగుల్యాః సంజ్ఞా (ష.త.) తయా।

**సంధులు:–** 1) గతః + అథ – గతోఽథ – ఉత్వాదేశ పూర్వరూపసంధిః।

2) సంజ్ఞయా+ఏవ – సంజ్ఞయైవ – వృద్ధిసంధిః – **వృద్ధిరేచి** (సూ.6–1–85)

3) చాపలాయ + ఇతి – చాపలాయేతి – గుణసంధిః–**ఆద్గుణః** (సూ.6–1–84)

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **నన్దీ – a) నకారాన్త పుంలింగ నన్దిన్‌శబ్దము।** ప్ర.ఏ.

b) **నంద్ – ణిని –** నందయతి వపుః సౌష్ఠవగమనగాయనతాలాదినా ఇతి నన్దీ, నన్దీ ఏవ నందకః। నందకః ఈశ్వరశ్చ – నందికేశ్వరః।

c) **శివద్వారపాలః।** ....నందీశో తణ్డునందినౌ॥ అని అభిధానచిన్తామణి.

d) శ్లో॥ తతో **నన్దిం** మహాదేవః ప్రాహ గంభీరయా గిరా।
నందికేశ్వర! సంయాహి యతో బాణో రణే స్థితః॥
– ఇతి హరివంశే 192/96

e) శ్లో॥ బాణార్థం భగవాన్రుద్రస్ససుతైః ప్రమథైర్వృతః।
ఆరుహ్య **నంది** వృషభం యుయుధే రామకృష్ణయోః॥
– శ్రీమద్భాగవతము–10–63–6

శ్రీశంకరుడు బాణునకు సాయముచేయగోరి కొడుకులతో ప్రమథగణములతో **నంది వృషభము**ను అధిరోహించి బలరామకృష్ణులతో యుద్ధము చేసెను.

f) శ్లో॥ **నంది**నా చ గణైః సార్ధం విశ్వరూపై ర్మహాత్మభిః।
తథా రుద్రగణైశ్చాపి తుల్యౌదార్యపరాక్రమైః॥
– వాయుమహాపురాణము–2 – 39–235

**క్రియాదర్శము:– వ్యనైషీత్**–ణీ ఞ్(నీ) ప్రాపణే (తీసికొనివెళ్లుట) భ్వాది ప్రకరణమ్, సకర్మకమ్, అకర్మకమ్, (ఉభయ) పరస్మైపదీ, లుఙ్–ప్రథమపురుషైకవచనము – వి–ఉపసర్గపూర్వకాత్.

రూపాలు – **వ్యనైషీత్** – వ్యనైష్టామ్ – వ్యనైషుః

–––





**అవతారికా:–** న కేవలం ప్రమథాః, జరాయుజాది చతుర్విధప్రాణినోఽపి నన్దీశ్వస్యాజ్ఞాబద్ధా బభూవుః ఇత్యాహ। ప్రమథులే కాదు జరాయుజములు మొదలైన చతుర్విధ ప్రాణులు కూడ నందీశ్వరుని ఆజ్ఞకు లోబడిరని చెప్పుచున్నాడు.

**శ్లో॥ నిష్కమ్పవృక్షం నిభృతద్విరేఫం**
**మూకాణ్డజం శాన్తమృగప్రచారమ్।**
**తచ్ఛాసనాత్ కాననమేవ సర్వం**
**చిత్రార్పితారమ్భమివావతస్థే॥** **42**

**పదవిభాగము:–** నిష్కమ్పవృక్షమ్, నిభృతద్విరేఫమ్, మూకాణ్డజమ్, శాన్తమృగ ప్రచారమ్, తచ్ఛాసనాత్, కాననమ్, ఏవ, సర్వమ్, చిత్రార్పితారమ్భమ్, ఇవ, అవతస్థే।

**అన్వయక్రమము:–** నిష్కమ్పవృక్షం నిభృతద్విరేఫం మూకాణ్డజం శాన్తమృగప్రచారం సర్వం కాననం తచ్ఛాసనాత్ చిత్రార్పితారమ్భమ్ ఇవ అవతస్థే।

**ప్రతిపదార్థము:–** నిష్కమ్పవక్షమ్–కదలని వృక్షములు గలదియు, నిభృతద్విరేఫమ్–చలించని తుమ్మెదలు గలదియు, మూకాణ్డజమ్–మూగవోయిన అండజములు గలదియు, శాన్తమృగప్రచారమ్–తిరుగాడని జంతువులు గలదియునగు, సర్వమ్+కాననమ్+ఏవ–సమస్తారణ్యమే, తచ్ఛాసనాత్–ఆ నందీశ్వరుని యాజ్ఞవలన, చిత్రార్పితారమ్భమ్+ఇవ–చిత్తరువునందు వ్రాయబడినదివలె, అవతస్థే–ఒప్పెను.

**తాత్పర్యము :–** కదలని వృక్షములుగలదియు, చలించని తుమ్మెదలు గలదియు, మూగవోయిన అండజములు గలదియు, తిరుగాడని జంతువులు గలదియునగు సమస్తారణ్యమే ఆ నందీశ్వరుని యాజ్ఞవలన చిత్తరువునందు వ్రాయబడినదివలె ఒప్పెను.

**పాఠాన్తరములు :–** ఆరమ్భ – ఆరణ్య

**విభక్తులు/క్రియలు:–** 1) నిష్కమ్పవృక్షమ్–...వృక్షమ్, ....వృక్షే, ....వృక్షాణి, అకారాన్త నపుంసక లింగ ....వృక్షశబ్దము, ప్ర.ఏ., 2) నిభృతద్విరేఫమ్–...ద్విరేఫమ్, ...ద్విరేఫే, ...ద్విరేఫాని, అకారాన్త నపుంసకలింగ ...ద్విరేఫశబ్దము, ప్ర.ఏ., 3) మూకాణ్డజమ్–...అండజమ్, ...అండజే, ...అండజాని, అకారాన్త నపుంసకలింగ ....అండజశబ్దము, ప్ర.ఏ., 4) శాన్తమృగప్రచారమ్–...ప్రచారమ్, ...ప్రచారే, ...ప్రచారాణి, అకారాన్తనపుంసకలింగ ...ప్రచారశబ్దము, ప్ర.ఏ., 5) సర్వమ్–సర్వమ్, సర్వే, సర్వాణి, అకారాన్తనపుంసకలింగ సర్వశబ్దము, ప్ర.ఏ.,6) కాననమ్–కాననమ్, కాననే, కాననాని, అకారాన్త నపుంసకలింగ కానన శబ్దము, ప్ర.ఏ., 7) ఏవ, ఇవ – అవ్యయములు, 8) తచ్ఛాసనాత్–తచ్ఛాసనాత్,

తచ్ఛాసనాభ్యామ్, తచ్ఛాసనేభ్యః, అకారాన్త నపుంసకలింగ తచ్ఛాసనశబ్దము, పం.ఏ., 9) చిత్రార్పితారమ్భమ్– ...ఆరమ్భమ్, ...ఆరమ్భే, ...ఆరమ్భాణి, అకారాన్త నపుంసకలింగ ...ఆరమ్భ శబ్దము, (ప్ర.ఏ., 10) అవతస్థే–అవ+స్థా+లిట్ – ప్రథమపురుషైకవచనము.

**సమాసాలు:–**

1) నిష్కమ్పవృక్షమ్ – నిర్గతః కమ్పః యేభ్యః (బహువ్రీహి) తే నిష్కమ్పాః, నిష్కమ్పాః వృక్షాః యస్మిన్ (బహువ్రీహి) తత్।
2) నిభృతద్విరేఫమ్ – ద్వౌ రేఫౌ యేషాం (బహువ్రీహి) తే ద్విరేఫాః, నిభృతాః ద్విరేఫాః యస్మిన్ (బహువ్రీహి) తత్।
3) మూకాణ్డజమ్ – అండాత్ జాయన్తే (ఉపపదతత్పు) ఇతి అండజాః, మూకాః అండజాః యస్మిన్ (బహువ్రీహి) తత్।
4) శాన్తమృగప్రచారమ్ – మృగాణాం ప్రచారః (ష.త.) మృగప్రచారః, శాంతః మృగప్రచారః యస్మిన్ (బహువ్రీహి) తత్।
5) చిత్రార్పితారమ్భమ్ – చిత్రే అర్పితః ఆరమ్భః యస్మిన్ (బహువ్రీహి) తత్।

**సంధులు:–** ఇవ + అవతస్థే – ఇవాతస్థే – సవర్ణదీర్ఘసంధిః।

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **కాననమ్ –** a) కం జలమ్ అననం జీవనమస్య। యద్వా కానయతి దీపయతి, కన్ దీప్తౌ+ణిచ్+ల్యుట్.

b) అరణ్యమటవీ సత్త్రం కాన్తారం **కాననం** వనమ్।
విపినం గహనం చేతి నాతిభిన్నార్థమిష్యతే॥ 210
– అని హలాయుధకోశము '8' నామములను పేర్కొన్నది.

c) శ్లో॥ త్వన్నిష్యన్దోచ్ఛ్వసిత .....
శీతే వాతః పరిణమయితా **కాననో**దుమ్బరాణామ్। – మేఘదూతమ్–42

d) శ్లో॥ అనసూయాతిసృష్టేన పుణ్యగన్ధేన **కాననమ్।**
సా చకారాఙ్గరాగేణ పుష్పోచ్చలితషట్పదమ్॥ – రఘువంశమ్–12–27

"…. ఆ వనమంతయు ఆ సుగంధముచే నిండినది…"

**క్రియాదర్శము:– అవతస్థే**–అవ–ఇతి ఉపసర్గపూర్వకాత్, ష్ఠా గతి నివృత్తౌ–విత్యస్మాద్ధాతోరకర్మకాత్కర్తరి భూతే లిట్, ఆత్మనేపదీ ప్రథమపురుషైకవచనాంతః।

రూపాలు – **అవతస్థే** – అవతస్థాతే – అవతస్థిరే।





ఈ వాక్య ప్రయోగమునకై, రఘువంశమునందు 2–31 శ్లోకమును చూడండి

శ్లో॥ వామేతరస్తస్య కరః ప్రహర్తుః
నఖప్రభాభూషితకఙ్కపత్త్రే ।
సక్తాఙ్గులిస్సాయకపుంఖ ఏవ
**చిత్రార్పితారమ్భ ఇవావతస్థే ॥**

**అలంకారము:–** ఇట 'ఉత్ప్రేక్షాలంకార' మున్నదని చెప్పదగును.

లక్షణము:– ఉపమానగతములైన జాతి–క్రియ–గుణ–ద్రవ్య నిమిత్తములచే ఉపమేయమును ఉపమానముగా సంభావించుట – **ఉత్ప్రేక్ష.**

ఉపమానము ప్రసిద్ధమైనచో అది ఉపమాలంకారమని, అట్లుగాక అది అప్రసిద్ధమో, కవికల్పితమో అయినచో అది 'ఉత్ప్రేక్షాలంకార' మని **విద్యానాథాదులు** వివేచించిరి.

ఇట – సమస్తారణ్యము – చిత్తరువునందువలె స్థాణువైనదని చెప్పబడుటచే నిది **'ఉత్ప్రేక్షాలంకార'** మగును.

---

**అవతారికా:–** పరమేశ్వరస్య ధ్యానస్థితిః – పరమేశ్వరుని ధ్యానస్థితి।

**శ్లో॥ దృష్టిప్రపాతం పరిహృత్య తస్య**
**కామః పురశ్శుక్రమివ ప్రయాణే।**
**ప్రాన్తేషు సంసక్తనమేరుశాఖం**
**ధ్యానాస్పదం భూతపతేర్వివేశ॥ 43**

**పదవిభాగము:–** దృష్టిప్రపాతమ్, పరిహృత్య, తస్య, కామః, పురః, శుక్రమ్, ఇవ, ప్రయాణే, ప్రాన్తేషు, సంసక్త–నమేరుశాఖమ్, ధ్యానాస్పదమ్, భూతపతేః, వివేశ।

**అన్వయక్రమము:–** ప్రయాణే పురః శుక్రమ్ ఇవ తస్య దృష్టిప్రపాతం పరిహృత్య కామః ప్రాన్తేషు సంసక్తనమేరుశాఖం భూతపతేః ధ్యానాస్పదం వివేశ।

**ప్రతిపదార్థము:–** ప్రయాణే–పయనమందు, పురః–ఎదుట, శుక్రమ్+ఇవ–శుక్రుడుండుతావునువలె, తస్య–ఆ నందీశ్వరునియొక్క, దృష్టిప్రపాతమ్–దృగ్గోచరమును, పరిహృత్య–తప్పించి, కామః–మన్మథుడు, ప్రాన్తేషు–ప్రక్కలయందు, సంసక్త నమేరు

శాఖమ్-కూడుకొన్న సురపొన్నలకొమ్మలు గల, భూతపతేః-శివునియొక్క, ధ్యానాస్పదమ్-సమాధి ప్రదేశమునుగూర్చి, వివేశ-ప్రవేశించెను.

**తాత్పర్యము :-** పయనమందు ఎదుట శుక్రుడుండు తావును వలె, ఆ నందీశ్వరుని యొక్క దృగ్గోచరమును తప్పించి మన్మథుడు ప్రక్కలయందు కూడుకొన్న సురపొన్నల కొమ్మలు గల శివుని సమాధి ప్రదేశమును ప్రవేశించెను.

**పాఠాన్తరములు :-** 1) ప్రపాతం-ప్రతీపం, ప్రదీపం, 2) ప్రయాణే-ప్రతస్థే.

**విభక్తులు/క్రియలు:-** 1) ప్రయాణే-**ప్రయాణే**, ప్రయాణయోః, ప్రయాణేషు, అకారాన్త నపుంసకలింగ ప్రయాణశబ్దము, స.ఏ., 2) ఇవ, అవ్యయము, 3) శుక్రమ్-...**శుక్రమ్**, ...శుక్రమౌ, ...శుక్రాన్, అకారాన్త పుంలింగ ...శుక్రశబ్దము, ద్వి.ఏ., 4) తస్య- తస్య, తయోః, తేషామ్, దకారాన్త పుంలింగ తచ్ఛశబ్దము, ష.ఏ., 5) దృష్టిప్రపాతమ్-**దృష్టిప్రపాతమ్**, దృష్టిప్రపాతౌ, దృష్టిప్రపాతాన్, అకారాన్త పుంలింగ దృష్టి ప్రపాతశబ్దము, ద్వి.ఏ., 6) పరిహృత్య-ల్యబన్తము, 7) కామః-**కామః**, కామౌ, కామాన్, అకారాన్త పుంలింగ కామశబ్దము, ప్ర.ఏ., 8) ప్రాన్తేషు-ప్రాన్తే, ప్రాన్తయోః, **ప్రాన్తేషు**, అకారాన్త పుంలింగ ప్రాన్త శబ్దము, స.బ., 9) సంసక్తనమేరుశాఖమ్-**...శాఖమ్**, ...శాఖే, ...శాఖాని, అకారాన్త నపుంసకలింగ ....శాఖ శబ్దము, ద్వి.ఏ., 10) భూతపతేః-**భూతపతేః**, భూతపత్యోః, భూతపతీనామ్, ఇకారాన్త పుంలింగ భూతపతిశబ్దము, ష.ఏ., 11) ధ్యానాస్పదమ్-**...ఆస్పదమ్**, ...ఆస్పదే, ...ఆస్పదాని, అకారాన్త నపుంసకలింగ ధ్యానాస్పదశబ్దము, ద్వి.ఏ., 12) వివేశ-క్రియ-విశ్+లిట్-ప్రథమపురుషైక వచనము.

**సమాసాలు:-**

1) పురఃశుక్రమ్ - పురః శుక్రః యస్మిన్ (బహువ్రీహి) సః పురః శుక్రః, తమ్.
2) దృష్టిప్రపాతమ్ - దృష్టీనాం ప్రపాతః (ష.త.) తమ్।
3) సంసక్తనమేరుశాఖమ్ - నమేరూణాం శాఖాః (ష.త.) నమేరుశాఖాః, సంసక్తాః నమేరుశాఖాః యస్య (బహువ్రీహి) తత్।
4) భూతపతేః - భూతానాం పతిః (ష.త.) భూతపతిః, తస్య।
5) ధ్యానాస్పదమ్-ధ్యానస్య ఆస్పదమ్ (ష.త.) తత్।

**సంధులు:-** భూతపతేః + వివేశ - భూతపతేర్వివేశ - విసర్గసంధిః।

**పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణాలు-కావ్యప్రయోగాలు:-**

1) **ధ్యాన -** a) ధ్యై - భావే - ల్యుట్

b) శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ - జ్ఞానాద్ధ్యానం విశిష్యతే।
ధ్యానాత్ కర్మఫలత్యాగః - త్యాగాత్ శాంతిరనంతరమ్॥
- 12 భగవద్గీతాయాం - ద్వాదశాధ్యాయే.





"తత్త్వము నెఱుంగకయే చేయు అభ్యాసముకంటెను జ్ఞానము శ్రేష్ఠము. జ్ఞానము కంటెను పరమేశ్వరస్వరూపధ్యానము శ్రేష్ఠము. ధ్యానముకంటెను కర్మఫల త్యాగము మిక్కిలి శ్రేష్ఠమైనది. ఏలనన త్యాగమువలన వెంటనే పరమశాంతి లభించును."

c) శ్లో॥ తస్మిన్నండే స భగవానుషిత్వా పరివత్సరమ్।
స్వయమేవాత్మనో **ధ్యానాత్త**దండమకరోత్ ద్విధా॥ - మనుస్మృతి1-12

d) శ్లో॥ ప్రాణాయామైర్దహేద్దోషాన్ ధారణాభిశ్చ కిల్బిషమ్।
ప్రత్యాహారేణ సంసర్గాన్ **ధ్యానేనా**నీశ్వరాన్ గుణాన్॥ - మనుస్మృతి 6-72

".... పరబ్రహ్మను ధ్యానించుటవలన ఈశ్వరసంబంధంలేని కామక్రోధాది దుర్గుణాలను తొలగించుకొంటాడు."

e) శ్లో॥ ఇతి విజ్ఞాపితో రాజ్ఞా **ధ్యానస్తి**మితలోచనః।
క్షణమాత్రమృషిస్తస్థౌ సుప్తమీన ఇవ హ్రదః॥ - ర.వం. 1-73

".... ఆ వసిష్ఠుడు ధ్యానినిమగ్నుడై కన్నులను మూసికొని, నిద్రించిన చేపలుగల సరోవరమువలె నిశ్చలుడై కొంతసేపు ఉండెను."

f) శ్లో॥ యమో నియమశ్చాసనం చ ప్రాణాయామస్తతః పరమ్।
ప్రత్యాహారో ధారణా చ **ధ్యానం** సార్ధం సమాధినా।
అష్టాంగాన్యాహురేతాని యోగినాం యోగసిద్ధయే॥

**క్రియాదర్శము:-** 1) **వివేశ**-విశ(విశ్) ప్రవేశనే (ప్రవేశించుట), సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, తుదాది ప్రకరణమ్ (6). లిట్ - ప్రథమపురుషైకవచనము.

రూపాలు - **వివేశ** - వివిశతుః - వివిశుః।

**అలంకారము:-** ఇట 'ఉపమాలంకార' మున్నదని చెప్పదగును.

చుక్కెదురుగానున్నప్పుడు ప్రయాణము చేయునట్లే మన్మథుడును నందీశ్వరుని నేత్ర ప్రసారమును తప్పించి వెళ్లెనని సాదృశ్యము చెప్పబడుటచే నిది 'ఉపమాలంకార' మగును.

శ్లో॥ ప్రతి శుక్రం ప్రతిబుధం ప్రత్యఙ్గారకమేవ చ।
అపి శక్రసమో రాజా హతసైన్యో నివర్తతే॥ ఇతి ప్రతిషేధాత్.

ఉపమా:- లక్షణమ్:-

మూ:- **యథా కథంచిత్సాదృశ్యం యత్రోద్భూతం ప్రతీయతే।**
**ఉపమా నామ సా తస్యాం ప్రపంచోయం ప్రదర్శ్యతే॥**

"రెండు వస్తువుల మధ్య సాదృశ్యము స్పష్టముగ తెలియవలెను. అది చమత్కార జనకముగ కూడ ఉండవలెను."

---

**శ్లో॥ స దేవదారుద్రుమవేదికాయాం**
**శార్దూలచర్మవ్యవధానవత్యామ్।**
**ఆసీనమాసన్నశరీరపాత -**
**స్త్రియమ్బకం సంయమినం దదర్శ॥ 44**

**పదవిభాగము:-** సః, దేవదారుద్రుమవేదికాయామ్, శార్దూలచర్మవ్యవధానవత్యామ్, ఆసీనమ్, ఆసన్నశరీరపాతః, త్రియమ్బకమ్, సంయమినమ్, దదర్శ.

**అన్వయక్రమము:-** ఆసన్నశరీరపాతః సః శార్దూలచర్మవ్యవధానవత్యాం దేవదారుద్రుమవేదికాయామ్ ఆసీనం సంయమినం త్రియంబకం దదర్శ।

**ప్రతిపదార్థము:-** ఆసన్నశరీరపాతః - చావుమూడినవాడై, సః - ఆ మన్మథుడు, శార్దూలచర్మవ్యవధానవత్యామ్-పులితోలుతో నెడముగల, దేవదారుద్రుమవేది కాయామ్-దేవదారువృక్షపుటరుగుపైన , ఆసీనమ్-కూర్చునియున్నట్టియు, సంయమినమ్-సమాధినిష్ఠలో నున్న, త్రియంబకమ్-త్రిలోచనుని (శివుని), దదర్శ-చూచెను.

**తాత్పర్యము :-** చావుమూడినవాడై ఆ మన్మథుడు దేవదారువృక్షపు మొదట అరుగుపై పులితోలుపఱచియుండగా దానిపై కూర్చొని యున్నట్టియు సమాధినిష్ఠలోనున్న త్రిలోచనుని శివుని చూచెను.

**పాఠాన్తరములు :-** స్త్రియమ్బకం - తం త్ర్యమ్బకం, (త్రిలోచనమ్.)

**విభక్తులు/క్రియలు:-** 1) ఆసన్నశరీరపాతః-**...పాతః**, ....పాతౌ, ...పాతాః, అకారాన్త పుంలింగ ....పాత శబ్దము, ప్ర.ఏ., 2) సః- **సః**, తౌ, తే, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము, ప్ర.ఏ., 3) శార్దూలచర్మ వ్యవధానవత్యామ్-**...వత్యామ్**, ...వత్యోః, ....వతీషు, ఈకారాన్త స్త్రీలింగ ...వతీశబ్దము, స.ఏ., 4) దేవదారుద్రుమవేదికాయామ్-**...వేదికాయామ్**, వేదికయోః, వేదికాసు, ఆకారాన్తస్త్రీలింగ ...వేదికా శబ్దము, స.ఏ., 5) ఆసీనమ్-**ఆసీనమ్**, ఆసీనౌ, ఆసీనాన్, అకారాన్త పుంలింగ ఆసీనశబ్దము, ద్వి.ఏ., 6) సంయమినమ్-**సంయమినమ్**, సంయమినౌ, సంయమినః, నకారాన్త పుంలింగ సంయమిన్





శబ్దము, ద్వి.ఏ., 7) త్రియంబకమ్-**త్రియంబకమ్**, త్రియంబకౌ, త్రియంబకాన్, అకారాన్త పుంలింగ త్రియంబక శబ్దము, ద్వి.ఏ., 8) దదర్శ-క్రియ - దృశ్+లిట్- ప్రథమపురుషైకవచనము.

**సమాసాలు:-**

1) ఆసన్నశరీరపాతః - శరీరస్య పాతః (ష.త.) శరీరపాతః, ఆసన్నః శరీరపాతః యస్య (బహువ్రీహి) సః।

2) శార్దూలచర్మవ్యవధానవత్యామ్ - శార్దూలస్య చర్మ (ష.త.) శార్దూలచర్మ, శార్దూల చర్మణా వ్యవధానవతీ (తృ.త.) తస్యామ్।

3) దేవదారుద్రుమవేదికాయామ్ - దేవదారుశ్చాసౌ ద్రుమః దేవదారుద్రుమః (కర్మ.) దేవదారుద్రుమస్య వేదికా (ష.త.) దేవదారుద్రుమవేదికా, తస్యామ్।

4) త్రియంబకమ్ - త్రీణి అమ్బకాని యస్య (బహు.) సః, తమ్।

**సంధులు:-** 1) సః + దేవదారు - స దేవదారు - సులోపః.
2) శరీరపాతః + త్రియంబకమ్ - శరీరపాతస్త్రియంబకమ్ - విసర్గసంధిః।

**పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణాలు-కావ్యప్రయోగాలు:-**

1) **త్ర్యమ్బకః** - a) త్రీణ్యమ్బకాన్ యస్య। త్రిష్వమ్బకమస్యేతి వా। 'అంబకం నయనం దృష్టిః' ఇతి హలాయుధః। త్రయాణాం లోకానామ్ అమ్బకః పితా ఇతి వా। త్రీన్వేదానమ్బతే శబ్దాయతే వా। 'అబి శబ్దే'। 'కర్మణ్యణ్'। సంజ్ఞాయామ్ ఇతి కః (న్)। త్రిషు లోకేషు కాలేషు వా అమ్బః శబ్దో వేదలక్షణో యస్యేతి వా। త్రయః అకారోకారమకారా అమ్బాః శబ్దా వాచకా యస్యేతి వా। తిస్రోఽమ్బాః దౌర్భ్యామ్యాపో యస్యేతి తు భారతమ్॥-'సుధా'ఖ్యయా (అమరకోశమ్)

b) శ్లో॥ శమ్భురీశః పశుపతిః శివః శూలీ మహేశ్వరః।
ఈశ్వరః శర్వ ఈశానః శంకరశ్చంద్రశేఖరః॥ 30

శ్లో॥ కృశానురేతాః సర్వజ్ఞో ధూర్జటిర్నీలలోహితః।
హరః **స్మరహరో** భర్గః **త్ర్యమ్బక**స్త్రిపురాంతకః॥ 33

శ్లో॥ గంగాధరోఽన్ధరిపుః క్రతుధ్వంసీ వృషధ్వజః।
వ్యోమకేశో భవో భీమః స్థాణూ రుద్ర ఉమాపతిః॥ 34

- అని 'అమరకోశము'

c) శ్లో॥ ప్రత్యబ్రవీచ్చైనమిషుప్రయోగే
తత్పూర్వభఙ్గే వితథప్రయత్నః।

జడీకృతస్త్ర్యమ్బకవీక్షణేన
వజ్రం ముముక్షన్నివ వజ్రపాణిః॥ - ర.వం. 2-42

d) శ్లో॥ హరిర్యథైకః పురుషోత్తమః స్మృతః
మహేశ్వరస్త్ర్యమ్బక **ఏవ** నాపరః।
తథా విదుర్మాం మునయః శతక్రతుం
ద్వితీయగామీ నహి శబ్ద ఏష నః॥ - ర.వం. 3-49

e) ఈ పదవివరణకై 'వివరణమ్' వ్యాఖ్య చూడదగును.

f) త్రియంబకం, త్ర్యమ్బకం - రెండున్నూ సాధువులే.

g) 61వ శ్లోకమునగల 'త్ర్యమ్బక' పదప్రయోగమును చూతురుగాక!

**క్రియాదర్శము:-** 1) **దదర్శ**-దృశిర్ (దృశ్) ప్రేక్షణే (చూచుట) భ్వాదిప్రకరణమ్ (1), సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లిట్ - ప్రథమపురుషైకవచనాంతః।

రూపాలు - **దదర్శ** - దదృశతుః - దదృశుః।

---

**అవతారికా:-** తమేవ దేవం షడ్భిః శ్లోకైర్వర్ణయతి।
ఆ శివునే ఆఱు శ్లోకములతో వర్ణించుచున్నాడు.

**శ్లో॥ పర్యఙ్కబన్ధస్థిరపూర్వకాయ-**
**మృజ్వాయతం సన్నమితోభయాంసమ్।**
**ఉత్తానపాణిద్వయసన్నివేశాత్**
**ప్రఫుల్లరాజీవమివాఙ్కమధ్యే॥ 45**

**పదవిభాగము:-** పర్యఙ్కబన్ధస్థిరపూర్వకాయమ్, ఋజ్వాయతమ్, సన్నమితోభయాం-సమ్, ఉత్తానపాణిద్వయసన్నివేశాత్, ప్రఫుల్లరాజీవమ్, ఇవ, అఙ్కమధ్యే॥

**అన్వయక్రమము:-** పర్యఙ్క... పూర్వకాయమ్ ఋజ్వాయతం సన్నమితోభయాంసమ్ ఉత్తాన .... వేశాత్ అఙ్కమధ్యే ప్రఫుల్లరాజీవమ్ ఇవ।

**ప్రతిపదార్థము:-** పర్యఙ్కబన్ధ-స్థిరపూర్వకాయమ్ - వీరాసనముచే స్థిరమగు దేహోర్ధ్వ భాగము గలిగినట్టియు, ఋజ్వాయతమ్-నిటారుగా పొడవైనట్టియు, సన్నమితో





భయాంసమ్-లెస్సగా వంపబడిన రెండు బాహువులుగలట్టియు, ఉత్తాన-పాణిద్వయ -సన్నివేశాత్ - వెలికిలగా ఉంచబడిన రెండు చేతులయొక్క ఉంచుటవలన, అఙ్కమధ్యే-తొడలనడుమన, ప్రఫుల్లరాజీవమ్+ఇవ - వికసించిన కమలము గలవాడో యనునట్లు, (స్థితమ్-ఉన్నట్టి) త్ర్యమ్బకుని మన్మథుడు చూచెను.

**తాత్పర్యము :-** వీరాసనముచే స్థిరమగు దేహోర్ధ్వభాగముగలిగినట్టియు, నిటారుగా పొడవైనట్టియు, లెస్సగా వంపబడిన రెండు బాహువులు గలట్టియు, వెలికిలగా ఉంచబడిన రెండు చేతులయొక్క ఉంచుటవలన తొడలనడుమన వికసించిన కమలము గలవాడో యనునట్లు (ఉన్నట్టి) త్ర్యమ్బకుని మన్మథుడు చూచెను.

**ధ్యానస్థితాసనము** - ఇట ప్రదర్శితమైనది.

**విభక్తులు/క్రియలు:-** 1) పర్యఙ్క....కాయమ్-**...కాయమ్**, కాయౌ, కాయాన్, అకారాన్త పుంలింగ ...కాయ శబ్దము, ద్వి.ఏ., 2) ఋజ్వాయతమ్-**ఋజ్వాయతమ్**, ఋజ్వాయతౌ, ఋజ్వాయతాన్, అకారాన్త పుంలింగ ఋజ్వాయతశబ్దము, ద్వి.ఏ., 3) సన్న....సమ్ - **...అంసమ్**,...అంసౌ, ...అంసాన్, అకారాన్త పుంలింగ ...అంసశబ్దము, ద్వి.ఏ., 4) ఉత్తాన ....సన్నివేశాత్-**...వేశాత్**, ...వేశాభ్యామ్, ....వేశేభ్యః, అకారాన్త పుంలింగ ...వేశశబ్దము, పం.ఏ., 5) అంకమధ్యే-**అంకమధ్యే**, అంకమధ్యయోః , అంకమధ్యేషు, అకారాన్త నపుంసకలింగ అంకమధ్య శబ్దము, స.ఏ., 6) ప్రఫుల్లరాజీవమ్-**...రాజీవమ్,** ....రాజీవౌ, ...రాజీవాన్, అకారాన్త పుంలింగ ...రాజీవ శబ్దము, ద్వి.ఏ., 7) ఇవ-అవ్యయము.

**సమాసాలు:-**

1) పర్యఙ్కబన్ధస్థిరపూర్వకాయమ్-పర్యఙ్కస్య బన్ధః (ష.త.) పర్యఙ్కబన్ధః। పూర్వం కాయస్య (ఏకదేశితత్పు) పూర్వకాయః । పర్యఙ్కబన్ధేన స్థిరః పూర్వకాయః యస్య (బహువ్రీహి) సః, తమ్।
2) ఋజ్వాయతమ్-ఋజుః చాసౌ ఆయతశ్చ (కర్మధా.) ఇతి ఋజ్వాయతః, తమ్।
3) సన్నమితోభయాంసమ్ - సన్నమితౌ ఉభౌ అంసౌ యస్య (బహువ్రీహి) సః, తమ్।
4) ఉత్తానపాణిద్వయసన్నివేశాత్ - పాణ్యోః ద్వయమ్ (ష.త.) పాణిద్వయమ్, పాణిద్వయస్య సన్నివేశః (ష.త.) పాణిద్వయసన్నివేశః, తస్మాత్।
5) అంకమధ్యే-అంకస్య మధ్యమ్ (ష.త.) అంకమధ్యమ్, తస్మిన్।
6) ప్రఫుల్లరాజీవమ్-ప్రఫుల్లం రాజీవం యస్య (బహువ్రీహి) సః, ప్రఫుల్లరాజీవః తమ్।

**సంధులు:-** ఇవ+అంకమధ్యే- ఇవాఙ్కమధ్యే - సవర్ణదీర్ఘసంధిః।

**పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణాలు-కావ్యప్రయోగాలు:-**

1) **రాజీవమ్**-a) రాజీ దలశ్రేణిరస్యాస్తీతి। రాజీ+'అన్యేభ్యోఽపి దృశ్యతే' ఇత్యుక్త్యా వ।

b) శ్లో॥ సహస్రపత్త్రం శతపత్త్రమమ్బుజం
కుశేశయం తామరసం సరోరుహమ్।
విసప్రసూనం కమలం మహోత్పలం
సరోజమబ్జం నలినం చ పుష్కరమ్॥

శ్లో॥ **రాజీవ**మరవిందం చ పద్మం పంకజమిష్యతే।
- అని హలాయుధకోశము 17 నామములను పేర్కొన్నది.

2) **"త్ర్యమ్బకు'ని మన్మథుడు చూచెను"**- 44వ శ్లోకమునుండి 50వ శ్లోకము వఱకు గల భాగమునకు 44వ శ్లోకమున గల 'దదర్శ' క్రియను - అన్వయించు కొనవలసియుండుటచే నిది **'కులక'** మను వర్గమునకు చెందినదగును.

శ్లో॥ ద్వాభ్యాం యుగ్మమితి ప్రోక్తం త్రిభిః శ్లోకైర్విశేషకమ్।
కలాపకం చతుర్భిః స్యాత్తదూర్ధ్వం **కులకం** స్మృతమ్॥

3) **వీరాసనే - వసిష్ఠః**

శ్లో॥ ఏకం పాదమథైకస్మిన్విన్యస్యోరుణి సంస్థితమ్।
ఇతరస్మింస్తథైవోరుం వీరాసనముదాహృతమ్॥ ఇతి.

**తథా యోగసారే -**

శ్లో॥ ఉత్తానితే కరతలే కరముత్తాని తం పరమ్।
ఆధాయాఙ్కగతం కృత్వా ధ్యాయేద్యస్తత్ర నాన్తరమ్॥ ఇతి.

**అలంకారము:-** ఇట 'స్వభావోక్తి' అలంకారమున్నదని చెప్పదగును. దీనిని 'క్రియాస్వభావోక్తి' గా పేర్కొనదగును. దీనిలో ధ్యానాసనము హృద్యముగా వర్ణితమైనది.

---

**శ్లో॥ భుజఙ్గమోన్నద్ధజటాకలాపం
కర్ణావసక్తద్విగుణాక్షసూత్రమ్।
కణ్ఠప్రభాసఙ్గవిశేషనీలాం
కృష్ణత్వచం గ్రన్థిమతీం దధానమ్॥ 46**





**పదవిభాగము:-** భుజఙ్గ .... కలాపమ్, కర్ణావ...సూత్రమ్, కణ్ఠ....నీలామ్, కృష్ణత్వచమ్, గ్రన్థిమతీమ్, దధానమ్.

**అన్వయక్రమము:-** భుజఙ్గ...కలాపం కర్ణావ .... సూత్రం కణ్ఠ ... నీలాం గ్రన్థిమతీం కృష్ణత్వచం దధానమ్।

**ప్రతిపదార్థము:-** భుజఙ్గమ + ఉన్నద్ధ - జటాకలాపమ్ - పాముచే ఎత్తికట్టబడిన జడలు గుంపు గలట్టియు, కర్ణావసక్త-ద్విగుణ+అక్షసూత్రమ్- చెవులకు తగిలింపబడి రెండు పేటలుగా చేయబడిన జపమాల గలట్టియు, కణ్ఠప్రభా+ఆసఙ్గ - విశేషనీలామ్ - కంఠకాన్తి యోగముచే మిక్కిలి నల్లనగు, గ్రన్థిమతీమ్-ముడిగల, కృష్ణత్వచమ్- నల్లచారల లేడిచర్మమును, దధానమ్ - ధరించిన (త్ర్యమ్బకుని మన్మథుడు చూచెను)

**తాత్పర్యము :-** పాముచే ఎత్తి కట్టబడిన జడల గుంపు గలట్టియు, చెవులకు తగిలింపబడి రెండు పేటలుగ చేయబడిన జపమాల గలట్టియు, కంఠకాన్తి యోగముచే మిక్కిలి నల్లనగు ముడిగల నల్లచారల లేడి చర్మమును ధరించిన (త్ర్యమ్బకుని మన్మథుడు చూచెను.)

**పాఠాన్తరములు :-** 1) ఉన్నద్ధ - ఆబద్ధ, ఆవిద్ధ, 2) కర్ణ - కరా, 3) కర్ణావసక్త - కర్ణావతంస, 4) కృష్ణత్వచం - మృగత్వచమ్.

**విభక్తులు/క్రియలు:-** 1) భుజఙ్గ ... కలాపమ్ - **...కలాపమ్**, ... కలాపౌ, ...కలాపాన్, అకారాన్త పుంలింగ .... కలాపశబ్దము, ద్వి.ఏ., 2) కర్ణా...సూత్రమ్ - **...సూత్రమ్**, ...సూత్రౌ, ...సూత్రాన్, అకారాన్త పుంలింగ ...సూత్ర శబ్దము, ద్వి.ఏ., 3) కణ్ఠ....నీలామ్ - **...నీలామ్**, ..నీలే, ...నీలాః, ఆకారాన్త స్త్రీలింగ ...నీలా శబ్దము, ద్వి.ఏ., 4) గ్రన్థిమతీమ్-**గ్రన్థిమతీమ్**, గ్రన్థిమత్యౌ, గ్రన్థిమతీః, ఈకారాన్త స్త్రీలింగ ... మతీశబ్దము, ద్వి.ఏ., 5) కృష్ణత్వచమ్-**కృష్ణత్వచమ్**, కృష్ణత్వచౌ, కృష్ణత్వచః, చకారాన్త స్త్రీలింగ కృష్ణత్వక్ఛబ్దము, ద్వి.ఏ., 6) దధానమ్-**దధానమ్**, దధానౌ, దధానాన్, అకారాన్త పుంలింగ దధాన శబ్దము, ద్వి.ఏ.

**సమాసాలు:-**

1) భుజఙ్గమోన్నద్ధజటాకలాపమ్ - జటానాం కలాపః (ష.త.), జటాకలాపః, భుజఙ్గమేన ఉన్నద్ధః (తృ.త.), జటాకలాపో యేన (బహువ్రీహి) సః, తమ్।

2) కర్ణావసక్తద్విగుణాక్షసూత్రమ్ - కర్ణే అవసక్తమ్ (స.త.) కర్ణావసక్తమ్, ద్వౌ గుణౌ ఆవృత్తీ యస్య (బహువ్రీహి) తత్ ద్విగుణమ్ అక్షాణాం సూత్రమ్ అక్షసూత్రం కర్ణావసక్తం ద్విగుణమ్ అక్షసూత్రం యస్య (బహువ్రీహి) సః, కర్ణావసక్తద్విగుణాక్షసూత్రః తమ్।

3) కణ్ఠప్రభాసఙ్గవిశేషనీలామ్ – కణ్ఠస్య ప్రభా(ష.త.) కణ్ఠప్రభా, కణ్ఠప్రభాణాం సఙ్గః (ష.త.), విశేషేణ నీలా (ప్రాదితత్పు), విశేషనీలా, కణ్ఠప్రభాసంగేన విశేషనీలా (తృ.త.) కణ్ఠప్రభాసంగవిశేషనీలా, తామ్।

4) గ్రన్థిమతీమ్ – గ్రన్థిః అస్యా అస్తీతి గ్రన్థిమతీ, తాం గ్రన్థిమతీమ్।

5) కృష్ణత్వచమ్ – కృష్ణస్య త్వక్ కృష్ణత్వక్ తాం కృష్ణత్వచమ్ (మధ్యమపదలోపి తత్పురుష)

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **భుజంగమః –** a) భుజ్ కౌటిల్యే + 'ఇగుపధేతి' క, భుజః కుటిలీభవన్ గచ్ఛతీతి। భుజ+గమ్+'గమేః సుపి వాచ్యః' ఇతి ఖచ్, 'ఖచ్చ డిద్వా వాచ్యః' ఇతి డిదభావే టిలోపాభావః।

b) శ్లో॥ విషధరదంతశూకపవనాశనసర్పసరీసృపోరగవ్యాల –
భుజగభుజంగకుంభీనసపన్నగనాగభోగినః।
అహిఫణభృత్పృదాకుకాకోదరకఞ్చుకిచక్రిగూఢపాద్
ద్విరసనకాద్రవేయదర్వీకరదృక్ శ్రుతయో **భుజంగమాః**॥ 640

శ్లో॥ ఆశీవిషో దీర్ఘపృష్ఠః కుణ్డలీ జిహ్మగః స్మృతః।
– అని హలాయుధకోశము 29 నామములను పేర్కొన్నది.

c) శ్లో॥ ఆరూఢమద్రీనుదధీన్ వితీర్ణం
**భుజంగమానాం** వసతిం ప్రవిష్టమ్।
ఊర్ధ్వం గతం యస్య న చానుబంధి
యశః పరిచ్ఛేతుమియత్తయాలమ్॥ – ర.వం. 6–77

"…. నాగలోకములోకి (భుజంగమానాం వసతిం) ప్రవేశించినదియు, స్వర్గమును చేరినదియును, త్రికాలములయందు వ్యాపించినదియును అగు రఘుమహారాజు కీర్తి ఇంతటిది అని పరిమాణములో కొల్చుటకు శక్యము కానంతటిది."

**అలంకారము:–** ఇట 'స్వభావోక్తి' అలంకారమున్నదని చెప్పదగును.
లక్షణమ్ – పూర్వము చెప్పబడినది.

---





**శ్లో॥ కిఞ్చిత్ప్రకాశస్తిమితోగ్రతారైః –**
**భ్రూవిక్రియాయాం విరతప్రసంగైః।**
**నేత్రైరవిస్పన్దితపక్ష్మమాలైః –**
**ర్లక్ష్యీకృతఘ్రాణమధోమయూఖైః॥ 47**

**పదవిభాగము:–** కించిత్ప్రకాశస్తిమితోగ్రతారైః, భ్రూవిక్రియాయామ్, విరతప్రసంగైః నేత్రైః, అవిస్పన్దితపక్ష్మమాలైః, లక్ష్యీకృతఘ్రాణమ్, అధోమయూఖైః॥

**అన్వయక్రమము:–** కించిత్ప్రకాశస్తిమితోగ్రతారైః భ్రూవిక్రియాయాం విరతప్రసంగైః అవిస్పన్దితపక్ష్మమాలైః అధోమయూఖైః నేత్రైః లక్ష్యీకృతఘ్రాణమ్॥

**ప్రతిపదార్థము:–** కించిత్ ప్రకాశస్తిమిత+ఉగ్రతారైః – ఇంచుక కాంతి, నైశ్చల్యము భయంకరములగు నల్లగుడ్లు గలట్టియు, భ్రూవిక్రియాయామ్–భ్రూవికారమునందు, విరతప్రసంగైః – చలనములేని ప్రసక్తి గలట్టియు, అవిస్పన్దితపక్ష్మమాలైః – చలింపని ఱెప్పవెండ్రుకల పంక్తులు గలట్టియు, అధోమయూఖైః – క్రింది ముఖముగానున్న కిరణములుగల, నేత్రైః – నేత్రములచే, లక్ష్యీకృతఘ్రాణమ్–గుఱిగా నుంపబడిన ముక్కుగల (త్ర్యమ్బకం దదర్శ – త్ర్యమ్బకుని చూచెను).

**తాత్పర్యము :–** ఇంచుక కాంతి, నైశ్చల్యము, భయంకరములు అగు నల్లగుడ్లు గలట్టియు, భ్రూవికారమునందు చలనములేని ప్రసక్తి గలట్టియు, చలింపని ఱెప్ప వెండ్రుకల పంక్తులు గలట్టియు, క్రింది ముఖముగా నున్న కిరణములుగల నేత్రములచే గుఱిగానుంపబడిన ముక్కుగల (త్ర్యమ్బకుని మన్మథుడు చూచెను).

**విభక్తులు/క్రియలు:–** 1) కించిత్ …తారైః – …తారేణ, …తారాభ్యామ్, **…తారైః**, అకారాన్త నపుంసకలింగ…తారశబ్దము, తృ.బ., 2) భ్రూవిక్రియాయామ్ – **భ్రూవిక్రియాయామ్**, భ్రూవిక్రియయోః భ్రూవిక్రియాసు, ఆకారాన్త స్త్రీలింగ భ్రూవిక్రియాశబ్దము, స.ఏ., 3) విరతప్రసంగైః – విరతప్రసంగేన, విరతప్రసంగాభ్యామ్, **విరతప్రసంగైః**, అకారాన్త నపుంసకలింగ విరతప్రసంగ శబ్దము, తృ.బ., 4) అవిస్పన్దితపక్ష్మమాలైః – …మాలేన, …మాలాభ్యామ్, **…మాలైః**, అకారాన్త నపుంసకలింగ …మాల శబ్దము, తృ.బ., 5) అధోమయూఖైః–అధోమయూఖేన, అధోమయూఖాభ్యామ్, **అధోమయూఖైః,** అకారాన్త నపుంసకలింగ అధోమయూఖశబ్దము, తృ.బ., 6) నేత్రైః – నేత్రేణ, నేత్రాభ్యామ్, **నేత్రైః,** అకారాన్త నపుంసకలింగ నేత్ర శబ్దము, 7) లక్ష్యీకృతఘ్రాణమ్ – **లక్ష్యీకృతఘ్రాణమ్**, …ఘ్రాణౌ, …ఘ్రాణాన్, అకారాన్త పుంలింగ లక్ష్యీకృత ఘ్రాణశబ్దము, ద్వి.ఏ.

**సమాసాలు:–**

1) కించిత్ప్రకాశస్తమితోగ్రతారైః – కించిత్ ప్రకాశః యాసామ్ (బహువ్రీహి), తాః, కించిత్ప్రకాశాః, కించిత్ప్రకాశాః స్తిమితా ఉగ్రాః తారా యేషామ్ (బహువ్రీహి), తాని, కించిత్ప్రకాశస్తిమితోగ్రతారాణి, తైః।

2) భ్రూవిక్రియాయామ్ – భ్రువోః విక్రియా (ష.త.) భ్రూవిక్రియా, తస్యామ్।

3) విరతప్రసంగైః–విరతః ప్రసంగః(బహువ్రీహి) యేషాం తాని విరతప్రసంగాని,తైః

4) అవిస్పన్దితపక్ష్మమాలైః – పక్ష్మణాం మాలా (ష.త.) పక్ష్మమాలా, న విస్పన్దితా (నఞ్తత్పురుష), అవిస్పన్దితా, అవిస్పన్దితా పక్ష్మమాలా యేషామ్ (బహువ్రీహి), తాని, తైః।

5) అధోమయూఖైః – అధః మయూఖా యేషామ్ (బహువ్రీహి) తాని, తైః।

6) లక్ష్యీకృతఘ్రాణమ్ – లక్ష్యీకృతం ఘ్రాణం యేన (బహువ్రీహి) సః, తమ్।

**సంధులు:–** 1) తారైః + భ్రూవిక్రియాయామ్ – తారైర్భ్రూవిక్రియాయామ్ – విసర్గసంధిః

2) నేత్రైః + అవిస్పన్దిత – నేత్రైరవిస్పన్దిత – విసర్గసంధిః।

3) మాలైః + లక్ష్యీకృత – మాలైర్లక్ష్యీకృత – విసర్గసంధిః।

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **నేత్రమ్** – a) నీయతే నయతి వానేనేతి, 'దామ్నీశసేతి' కరణేష్ట్రన్।

b) శ్లో॥ దృగ్దృష్టి **నేత్ర** లోచనచక్షుర్నయనామ్బకేక్షణాక్షీణి।
– అని హలాయుధకోశము '9' నామములను పేర్కొన్నది.

c) శ్లో॥ నాఞ్జయన్తీం స్వకే **నేత్రే** నచాభ్యక్తామనావృతామ్।
న పశ్యేత్ప్రసవన్తీం చ తేజస్కామో ద్విజోత్తమః॥ ఇతి మనుస్మృతిః4-44

d) శ్లో॥ శైలస్సమ్పూర్ణకామోఽపి–మేనాముఖముదైక్షత ।
ప్రాయేణ గృహిణీ **నేత్రాః**–కన్యార్థేషు కుటుంబినః॥ – కు.సం. 6-85

"....కుమార్తెల వివాహము జరిపింపవలసినవచ్చినప్పుడు భార్యయే కన్నుగా గలవారగుదురు కదా।"

e) **నేత్రైః** అను బహువచన ప్రయోగముచే 'త్ర్యమ్బకు' ని సూచించినట్లైనది.

**అలంకారము:–** ఇట 'స్వభావోక్త్యలంకార' మున్నదని చెప్పదగును. –––

68



**శ్లో॥ అవృష్టిసంరమ్భమివామ్బువాహ –**
**మపామివాధారమనుత్తరఙ్గమ్।**
**అన్తశ్చరాణాం మరుతాం నిరోధా–**
**న్నివాతనిష్కమ్పమివ ప్రదీపమ్॥ 48**

**పదవిభాగము:–** అవృష్టిసంరమ్భమ్, ఇవ, అమ్బువాహమ్, అపామ్, ఇవ, ఆధారమ్, అనుత్తరఙ్గమ్, అన్తశ్చరాణామ్, మరుతామ్, నిరోధాత్, నివాతనిష్కమ్పమ్, ఇవ, ప్రదీపమ్।

**అన్వయక్రమము:–** అన్తశ్చరాణాం మరుతాం నిరోధాత్ అవృష్టిసంరమ్భమ్ అమ్బువాహమ్ ఇవ అనుత్తరఙ్గమ్ అపామ్ ఆధారమ్ ఇవ నివాతనిష్కమ్పం ప్రదీపమ్ ఇవ।

**ప్రతిపదార్థము:–** అన్తశ్చరాణామ్–లోపల చరించు, మరుతామ్–వాయువులయొక్క, నిరోధాత్ – నిరోధమువలన, అవృష్టిసంరమ్భమ్–వర్షము హడావుడిలేని, అమ్బువాహమ్+ఇవ–మేఘమువలెను, అనుత్తరఙ్గమ్–అలలు పైకెగరని, అపామ్ ఆధారమ్+ఇవ – మడుగువలెను, నివాతనిష్కమ్పమ్–వాయుచలనములేనిచోట కదలని, ప్రదీపమ్+ఇవ – దీపము వలెను (ఉన్నట్టి త్ర్యమ్బకుని మన్మథుడు చూచెను.)

**తాత్పర్యము :–** లోపల చరించు వాయువుల నిరోధమువలన వర్షము హడావుడిలేని మేఘమువలెను, అలలు పైకెగరని మడుగువలెను, వాయుచలనములేనిచోట కదలని దీపమువలెను (ఉన్నట్టి త్ర్యమ్బకుని మన్మథుడు చూచెను.)

**పాఠాన్తరములు :–** నివాత – నిర్వాణ, నిర్వాత.

**విభక్తులు/క్రియలు:–** 1) అన్తశ్చరాణామ్–అన్తశ్చరస్య, అన్తశ్చరయోః, **అన్తశ్చరాణామ్**, అకారాన్త పుంలింగ అన్తశ్చర శబ్దము, ష.బ., 2) మరుతామ్–మరుతః, మరుతోః, మరుతామ్ – తకారాన్త పుంలింగ మరుచ్ఛబ్దము, ష.బ., 3) నిరోధాత్–**నిరోధాత్**, నిరోధాభ్యామ్, నిరోధేభ్యః, అకారాన్త పుంలింగ నిరోధ శబ్దము పంచమీ – ఏకవచనము, 4) అవృష్టిసంరమ్భమ్–**అవృష్టిసంరమ్భమ్**, ...సంరమ్భౌ, ...సంరమ్భాన్, అకారాన్త పుంలింగ ...సంరమ్భ శబ్దము, ద్వి.ఏ., 5) అమ్బువాహమ్ –**అమ్బువాహమ్**, అమ్బువాహౌ, అమ్బువాహాన్, అకారాన్త పుంలింగ అమ్బువాహశబ్దము, ద్వి.ఏ., 6) అనుత్తరఙ్గమ్–**అనుత్తరఙ్గమ్**, అనుత్తరఙ్గౌ, అనుత్తరఙ్గాన్, అకారాన్త పుంలింగ అనుత్తరఙ్గ శబ్దము, ద్వి.ఏ., 7) అపామ్–'పా' అన్తః స్త్రీలింగః అప్ శబ్దోనిత్యం బహువచనాన్తః, ఆపః, అపః, అద్భిః, అద్భ్యః, అద్భ్యః, **అపామ్,** అప్సు, 8) ఆధారమ్ – **ఆధారమ్,** ఆధారౌ, ఆధారాన్, అకారాన్త పుంలింగ ఆధారశబ్దము, ద్వి.ఏ., 9) నివాతనిష్కమ్పమ్ – **నిష్కమ్పమ్,** నిష్కమ్పౌ, నిష్కమ్పాన్, అకారాన్త పుంలింగ

నివాత నిష్కమ్పశబ్దము, ద్వి.ఏ., 10) ప్రదీపమ్ - **ప్రదీపమ్**, ప్రదీపౌ, ప్రదీపాన్, అకారాన్త పుంలింగ ప్రదీపశబ్దము, ద్వి.ఏ.

**సమాసాలు:-**

1) అన్తశ్చరాణామ్ - అన్తశ్చరన్తీతి (ఉపపదతత్పు.) అన్తశ్చరాః, తేషామ్ ।

2) అవృష్టిసంరమ్భమ్ - వృష్టేః సంరమ్భః (ష.త.) వృష్టిసంరమ్భః అవిద్యమానః వృష్టిసంరమ్భః యస్య (బహువ్రీహి) సః, తమ్।

3) అమ్బువాహమ్-అమ్బు వహతి (ఉపపదతత్పు.) ఇతి అమ్బువాహః, తమ్।

4) అనుత్తరఙ్గమ్ - అవిద్యమానః ఉత్తరఙ్గః యస్య (బహువ్రీహి) అనుత్తరఙ్గః, తమ్।

5) నివాతనిష్కమ్పమ్-నిర్గతః వాతః యస్మాత్ (బహువ్రీహి) సః నివాతః, నిర్గతః కమ్పః యస్మాత్ (బహువ్రీహి) సః, నిష్కమ్పః, నివాతే నిష్కమ్పః (స.త.) నివాతనిష్కమ్పః, తమ్।

6) ప్రదీపమ్ - ప్రకృష్టో దీపః ప్రదీపః తం ప్రదీపమ్।

**సంధులు:-** 1) ఇవ + అమ్బువాహమ్ - ఇవామ్బువాహమ్ - సవర్ణదీర్ఘసంధిః।

2) ఇవ+ఆధారమ్ - ఇవాధారమ్ - సవర్ణదీర్ఘసంధిః।

3) నిరోధాత్ + నివాత - నిరోధాన్నివాత - అనునాసికసన్ధిః।

**యరోఽనునాసికే అనునాసికో వా** (సూ.8-4-44) రహలు తప్ప తక్కిన పదాంతమందలి హల్లులకు (యర్లులకు) అనునాసికవర్ణము పరముగా నున్నచో ఆయా వర్గలకు సంబంధించిన అనునాసిక (ఞమఙణన) వర్ణమాదేశముగ వికల్పముగ వచ్చును.

**పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణాలు-కావ్యప్రయోగాలు:-**

1) **అపామ్**-a) 'పాన్తః' స్త్రీలింగః అప్ శబ్దో నిత్యం బహువచనాన్తః,ఆపః,అపః, అద్భిః, అద్భ్యః, అద్భ్యః **అపామ్**, అప్సు।

b) ఆపః - 'అప్నోతే ర్హ్రస్వశ్చ' ఇత్యుణాది సూత్రేణ హ్రస్వః చకారాత్ క్విపి 'అప్' శబ్దః । తస్మాజ్జసి 'అప్సున్ని'తి దీర్ఘే రుత్వవిసర్గౌ। - బృహచ్ఛబ్దకుసుమాకరః

c) ఆపః కర్మాఖ్యాయాం హ్రస్వో నుట్ చ వా। అప్నః, అపః । ఆపః । ఆప్యతే సుఖం యేన తత్ అప్నః, అపః, అపత్యం సుకర్మవా। హ్రస్వస్యాపి వికల్పే -





'ఆపః' ఇత్యపి భవతి। 'ఆపోభిర్మార్జనం కృత్వా' ఇత్యాది సత్ప్రయోగదర్శనాత్॥ - ఉణాదికోషః।

c) శ్లో॥ ఖాని చైవ స్పృశే**దద్భి** రాత్మానం శిర ఏవ చ । (60) మనుస్మృతి-ద్వి.

శ్లో॥ **ఆప** ఏవ ససర్జాదౌ తాసు బీజమవాసృజత్ । (8) మనుస్మృతి-ప్ర.

శ్లో॥ జ్యోతిషశ్చ వికుర్వాణా**దాపో** రసగుణాః స్మృతాః ।
**అద్భ్యో** గంధగుణా భూమిరిత్యేషా సృష్టిరాదితః॥ (78) మనుస్మృతి-ప్ర.

**అలంకారము:-** ఇట **'మాలోపమాలంకార'** మున్నదని చెప్పదగును.

'ఉపమ' అనగా సాదృశ్యము. ఒక పదార్థమును మరియొక పదార్థముతో పోల్చి చెప్పుట 'ఉపమ'. దీనికి 1) ఉపమేయము, 2) ఉపమానము, 3) సమానధర్మము, 4) ఉపమావాచకము - అను నాల్గు అవయవములున్నవి. సమాన ధర్మభేదము లనుబట్టి దండి మహాశయుడు 32 ఉపమాభేదములు తెలిపినాడు. అందు 'మాలోపమ' ఒకటి.

త్ర్యమ్బకుని సమాధి నిశ్చలత్వము - వర్షము హడావుడిలేని మేఘమువలెను, అలలు పైకెగరని మడుగువలెను, వాయుసంచారములేనిచోట కదలని దీపము వలె నున్నదని చెప్పబడుటచే నిది 'మాలోపమాలంకార' మగును.

లక్షణము - పూష్ణ్యాతప ఇవాహ్నీవ పూషా వ్యోమ్నీవ వాసరః।
విక్రమస్త్వయ్యధాల్లక్ష్మీమితి **మాలోపమా** మతా॥

మిగిలిన 'ఉపమాభేదములకై' దండి కావ్యాదర్శము చూడగలరు.

---

**శ్లో॥ కపాలనేత్రాన్తరలబ్ధమార్గైః**
**జ్యోతిఃప్రరోహైరుదితైశ్శిరస్తః।**
**మృణాళసూత్రాధికసౌకుమార్యాం**
**బాలస్య లక్ష్మీం గ్లపయన్తమిన్దోః॥** 49

**పదవిభాగము:-** కపాలనేత్రాన్తరమార్గైః, జ్యోతిఃప్రరోహైః, ఉదితైః, శిరస్తః, మృణాళ... సౌకుమార్యామ్, బాలస్య, లక్ష్మీమ్, గ్లపయన్తమ్, ఇన్దోః।

**అన్వయక్రమము:-** కపాల...మార్గైః శిరస్తః ఉదితైః జ్యోతిఃప్రరోహైః మృణాళ ... సౌకుమార్యాం బాలస్య ఇందోః లక్ష్మీం గ్లపయన్తమ్।

**ప్రతిపదార్థము:–** కపాలనేత్రాన్తరలబ్ధమార్గైః – బ్రహ్మకపాలముయొక్క కంటి రంధ్రము గుండ పొందబడిన దారిగలవై, శిరస్తః – బ్రహ్మరంధ్రమునుండి, ఉదితైః –వెడలిన, జ్యోతిఃప్రరోహైః–తేజోంకురములచేత, మృణాళసూత్రాధికసౌకుమార్యామ్ –తామరదూటి దారముకంటె మిక్కిలి కోమలమగు, బాలస్య – చిన్నదైన, ఇన్దోః– చందమామయొక్క లక్ష్మీమ్ – శోభను, గ్లపయన్తమ్ – వాడించుచున్న (త్ర్యమ్బకుని మన్మథుడు చూచెను.)

**తాత్పర్యము :–** బ్రహ్మకపాలముయొక్క కంటి రంధ్రముగుండ పొందబడిన దారిగలవై బ్రహ్మరంధ్రమునుండి వెడలిన తేజోంకురములచేత, తామరతూటి దారముకంటె మిక్కిలి కోమలమగు చిన్న / లేతచందమామ యొక్క శోభను వాడించుచున్న (త్ర్యమ్బకుని మన్మథుడు చూచెను.)

**పాఠాన్తరములు:–** సౌకుమార్యామ్ బాలస్య లక్ష్మీమ్–సౌకుమార్యాన్ బాలస్య రశ్మీన్.

**విభక్తులు/క్రియలు:–** 1) కపాల....మార్గైః – ...మార్గేణ, ...మార్గాభ్యామ్, ...మార్గైః, అకారాన్త పుంలింగ ...మార్గశబ్దము, తృ.బ., 2) శిరస్తః – తద్ధితాన్తావ్యయము, 3) ఉదితైః – ఉదితేన, ఉదితాభ్యామ్, **ఉదితైః** అకారాన్త పుంలింగ ఉదిత శబ్దము, తృ.బ., 4) జ్యోతిఃప్రరోహైః – జ్యోతిః ప్రరోహేన, జ్యోతిఃప్రరోహాభ్యామ్, **జ్యోతిఃప్రరోహైః**, అకారాన్త పుంలింగ జ్యోతిఃప్రరోహశబ్దము,తృ.బ. 5) మృణాళ...సౌకుమార్యామ్–**...సౌకుమార్యామ్**, ...సౌకుమార్యే, ...సౌకుమార్యాః, ఆకారాన్త స్త్రీలింగ ...సౌకుమార్యాశబ్దము, ద్వి.ఏ., 6) బాలస్య – **బాలస్య**, బాలయోః, బాలానామ్, అకారాన్త పుంలింగ బాలశబ్దము, ష.ఏ., 7) **ఇన్దోః** – ఇన్దోః, ఇన్ద్వోః, ఇన్దూనామ్, ఉకారాన్త పుంలింగ ఇన్దు శబ్దము, ష.ఏ., 8) లక్ష్మీమ్ – **లక్ష్మీమ్**, లక్ష్మ్యౌ, లక్ష్మీః, ఈకారాన్త స్త్రీలింగ లక్ష్మీశబ్దము, ద్వి.ఏ., 9) గ్లపయన్తమ్–**గ్లపయన్తమ్**, గ్లపయన్తౌ, గ్లపయతః, శత్రన్తోగ్లపయత్‌శబ్దః, ద్వి.ఏ.

**సమాసాలు:–**

1) కపాలనేత్రాన్తరలబ్ధమార్గైః – కపాలస్య నేత్రమ్ (ష.త.) కపాలనేత్రమ్, కపాలనేత్రస్య అన్తరమ్ (ష.త.) కపాలనేత్రాన్తరమ్, కపాలనేత్రాన్తరాత్, లబ్ధః మార్గః యైః (బహువ్రీహి) తే కపాలనేత్రాన్తలబ్ధమార్గాః, తైః।

2) జ్యోతిఃప్రరోహైః – జ్యోతిషాం ప్రరోహాః (ష.త.) తైః।

3) మృణాలసూత్రాధికసౌకుమార్యామ్ – మృణాలస్య సూత్రమ్ (ష.త.) మృణాల సూత్రమ్, మృణాలసూత్రాద్ అధికమ్ (పం.త.) మృణాలసూత్రాధికమ్, మృణాలసూత్రాధికం సౌకుమార్యం యస్యాః (బహువ్రీహి) సా, తామ్।

**సంధులు:–** 1) ప్రరోహైః + ఉదితైః – ప్రహోహైరుదితైః – విసర్గసంధిః।

2) ఉదితైః + శిరస్తః – ఉదితైశ్శిరస్తః – విసర్గాదేశసంధిః – **వా శరి** (సూ. 8.3.36)





**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **ఇన్దుః –** a) ఉనత్తి అమృతధారయా భువం క్లిన్నాం కరోతి ఇతి। ఉన్ద్+ఉ+ ఆదేరిచ్చ । **(ఉణాదిసూత్రమ్ 1–12)**

b) శ్లో॥ **ఇన్దు**శ్చంద్రశ్చంద్రమా ఓషధీశః
సోమో రాజా రోహిణీవల్లభోఽబ్జః।
ఋక్షేశః స్యాదత్రినేత్రప్రసూతః
ప్రాలేయాంశుః శ్వేతరోచిః శశాంకః॥ 42

శ్లో॥ ద్విజరాజో రజనికరః పీయూషరుచిర్నిశీథినీనాథః।
జైవాతృకో మృగాంకో విధుశ్చ దాక్షాయణీరమణః॥ 43
– అని హలాయుధకోశము 21 నామములను పేర్కొన్నది.

c) శ్లో॥ తదన్వయే శుద్ధిమతి ప్రసూతశ్శుద్ధిమత్తరః।
దిలీప ఇతి రాజేన్దు**రిన్దుః** క్షీరనిధావివ॥ – ర.వం. 1–12

"....క్షీరసముద్రమునందు చంద్రుడుదయించినట్లు ఆ నిర్దుష్టమైన వంశము నందు మిక్కిలి పరిశుద్ధుడగు **దిలీపు** డను రాజచంద్రుడు పుట్టెను."

d) చంద్రుని **షోడశకలలు –**

'అమృతా మానదా పూషా తుష్టిః పుష్టి రతిర్ధృతిః।
శశినీ చంద్రికా జ్యోతిర్జ్యోత్స్నా శ్రీః ప్రీతిరేవ చ।
అంగదా చ తథా పూర్ణామృతా షోడశా వై కలాః॥'

---

**శ్లో॥ మనో నవద్వారనిషిద్ధవృత్తి
హృది వ్యవస్థాప్య సమాధివశ్యమ్।
యమక్షరం క్షేత్రవిదో విదుస్త –
మాత్మానమాత్మన్యవలోకయన్తమ్॥ 50**

**పదవిభాగము:–** మనః, నవద్వారనిషిద్ధవృత్తి, హృది, వ్యవస్థాప్య, సమాధివశ్యమ్, యమ్, అక్షరమ్, క్షేత్రవిదః, విదుః, తమ్, ఆత్మానమ్, ఆత్మని, అవలోకయన్తమ్।

**అన్వయక్రమము:–** నవద్వారనిషిద్ధవృత్తి సమాధివశ్యం మనః హృది వ్యవస్థాప్య క్షేత్రవిదః యమ్ అక్షరం విదుః తమ్ ఆత్మానమ్ ఆత్మని అవలోకయన్తమ్।

**ప్రతిపదార్థము:–** నవద్వారనిషిద్ధవృత్తి – నవరంధ్రములచే నిషేధింపబడిన సంచారము గలదియై, సమాధివశ్యమ్–సమాధిచే స్వాధీనమగు, మనః–మనస్సును, హృది– హృదయమునందు, వ్యవస్థాప్య–నిలిపి, క్షేత్రవిదః–క్షేత్రజ్ఞులగు పురుషులు, యమ్–ఎవనిని, అక్షరమ్–నాశరహితునిగాను, విదుః–తెలిసికొందురో, తమ్–ఆ, ఆత్మానమ్–పరమాత్మను, ఆత్మని–తనయందు, అవలోకయన్తమ్–సాక్షాత్కారము చేసికొనుచున్న (త్ర్యమ్బకుని మన్మథుడు చూచెను.)

**తాత్పర్యము :–** నవరంధ్రములచే నిషేధింపబడిన సంచారముగలదియై సమాధిచే స్వాధీనమగు మనస్సును హృదయమున నిలిపి క్షేత్రజ్ఞులగు పురుషులు ఎవనిని నాశరహితునిగాను తెలిసికొందురో ఆ పరమాత్మను తనయందు సాక్షాత్కారము చేసికొనుచున్న (త్ర్యమ్బకుని మన్మథుడు చూచెను.)

**పాఠాన్తరములు :–** 1) క్షేత్రవిదో–వేదవిదో, 2) నిషిద్ధా–నిరుద్ధా.

**విభక్తులు/క్రియలు:–** 1) నవద్వారనిషిద్ధవృత్తి–**...వృత్తి**, ...వృత్తినీ, ...వృత్తీని, ఇకారాన్త నపుంసక లింగ నవద్వారనిషిద్ధవృత్తి శబ్దము, ద్వి.ఏ., 2) సమాధివశ్యమ్–**సమాధివశ్యమ్**, సమాధివశ్యే, సమాధి వశ్యాని, అకారాన్త నపుంసకలింగ సమాధివశ్య శబ్దము, ద్వి.ఏ., 3) మనః–**మనః**, మనసీ, మనాంసి, సకారాన్త నపుంసకలింగ 'మనస్' శబ్దము, ద్వి.ఏ., 4) హృది–**హృది**, హృదోః, హృత్సు, దకారాన్త నపుంసకలింగ హృచ్ఛబ్దము, స.ఏ., 5) వ్యవస్థాప్య–వి+అవ+స్థా+ణి+క్త్వా – ల్యబన్తము, 6) క్షేత్రవిదః – క్షేత్రవిత్, క్షేత్రవిదౌ, **క్షేత్రవిదః**, దకారాన్త పుంలింగ క్షేత్రవిచ్ఛబ్దము, 7) యమ్–**యమ్**, యౌ, యాన్, దకారాన్త పుంలింగ యద్ శబ్దము, ద్వి.ఏ., 8) అక్షరమ్–**అక్షరమ్**, అక్షరౌ, అక్షరాన్, అకారాన్త పుంలింగ అక్షర శబ్దము, ద్వి.ఏ., 9) విదుః–క్రియ–విద్+లట్ (ప్రథమపురుష బహువచనాంతము), 10) తమ్–తమ్, తౌ, తాన్, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము, ద్వి.ఏ., 11) ఆత్మానమ్–**ఆత్మానమ్**, ఆత్మానౌ, ఆత్మనః, నకారాన్త పుంలింగ ఆత్మన్ శబ్దము, ద్వి.ఏ., 12) ఆత్మని–**ఆత్మని** ఆత్మనోః, ఆత్మసు, నకారాన్త పుంలింగ ఆత్మన్ శబ్దము, స.ఏ., 13) అవలోకయన్తమ్–**అవలోకయన్తమ్**, అవలోకయన్తౌ, అవలోకయతః, శత్రన్తో అవలోకయత్ శబ్దః, పుంలింగః, ద్వి.ఏ.

**సమాసాలు:–**

1) నవద్వారనిషిద్ధవృత్తి – నవాని చ తాని ద్వారాణి (కర్మధా.) నవద్వారాణి, నవద్వారేభ్యః – నిషిద్ధా వృత్తిః యస్య (బహువ్రీహి) తత్।

2) సమాధివశ్యమ్–సమాధినా వశ్యం సమాధివశ్యం తత్।

3) క్షేత్రవిదః – క్షేత్రం విదన్తీతి (ఉపపదతత్పు.) క్షేత్రవిదః।

**సంధులు:–**

1) మనః+నవద్వార – మనో నవద్వార – ఉత్వాదేశసన్ధిః।





2) క్షేత్రవిదః+విదుః – క్షేత్రవిదో విదుః – ఉత్వాదేశసన్ధిః।

3) విదుః+తమ్–విదుస్తమ్ – విసర్గసంధిః।

4) ఆత్మని+అవలోకయన్తమ్ – ఆత్మన్యవలోకయన్తమ్ – యణాదేశసన్ధిః।

**ఇకోయణచి** (సూ.6–1–74) – ఇ ఉ ఋ ఌ వర్ణములకు అసవర్ణమైన అచ్చు పరముగానున్నప్పుడు క్రమముగా య్, వ్, ర్, ల్ (యణ్) అనునవి ఆదేశమగును.

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **శరీరస్య నవద్వారాణి సన్తి । తథా హి –**

1. శ్లో॥ నయనశ్రవణే ద్వే ద్వే నాసికే వదనం తథా ।
పాయూపస్థౌ చ దేహేఽస్మిన్ నవ ద్వారాణి దేహినమ్॥ ఇతి.

2. శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ।
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥ ఇతి.

3. శ్లో॥ ఇదం శరీరం కౌన్తేయ। క్షేత్రమిత్యభిధీయతే।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥ ఇతి గీతా।

2) తుల్యభావమున్న ఈ దిగువ గీతా శ్లోకమును చూడుడు.

శ్లో॥ సర్వకర్మాణి మనసా – సన్న్యస్యాస్తే సుఖం వశీ।
**నవద్వారే** పురే దేహీ – నైవ కుర్వన్ న కారయన్ ॥ భగవద్గీత 5-13.

'అంతఃకరణమును అదుపులోనుంచుకొని సాంఖ్యయోగమును ఆచరించు పురుషుడు కర్మలను ఆచరింపకయే, ఆచరింపజేయకయే నవద్వారములుగల శరీరమునందు సమస్తకర్మలను మానసికముగా త్యజించి, సచ్చిదానంద ఘన పరమాత్మ స్వరూపమున స్థితుడై ఆనందమును అనుభవించును.

**క్రియాదర్శము:–** 1) **విదుః** – విద (విద్) జ్ఞానే (తెలియుట) అదాది ప్రకరణమ్(2), సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లట్ – ప్రథమపురుష బహువచనాంతః।

రూపాలు – 1) వేద – విదతుః – **విదుః**, 2) అభావపక్షే – వేత్తి–విత్తః, విదన్తి. విద్–ధాతువు – 4,6,7,10 వ గణముల్లోను ఉన్నది. వాటి ప్రథమపురుష లట్ రూపాలు దిగువనీయబడినవి. వైవిధ్యమును గమనించగలరు.

4వ గణము–లట్ ప్రథమపురుషరూపాలు – విద్యతే–విద్యేతే–విద్యన్తే (ఆత్మనేపది)
6వ గణము–లట్ ప్రథమపురుషరూపాలు– విన్దతి–విన్దతః–విన్దన్తి &
విన్దతే–విన్దేతే–విన్దన్తే (ఉభయపది)
7వ గణము–లట్ ప్రథమపురుషరూపాలు – విన్తే – విన్దాతే – విన్దతే (ఆత్మనేపది)
10వ గణము–లట్ ప్రథమపురుషరూపాలు –వేదయతే–వేదయేతే–వేదయన్తే

(4) విద్ (సత్తాయామ్), (6) విద్ (లాభే), (7) విద్ (విచారణే),
(10) విద్ (చేతనాఖ్యాననివాసేషు) అను నర్థములలో నుండును.

శ్లో॥ వేత్తి జానాతి జానీతే వేద బోధతి బుధ్యతే।
నిబోధతే చేతయతే మన్యతే ప్రతిపద్యతే ॥ 24

శ్లో॥ ప్రేక్షతే పణ్డతే ప్రత్యేత్యవగచ్ఛతి చేతతి।
మనుతే చోపలభతేఽవైతి వేదయతేఽఇచ్ఛతి ॥ 25

శ్లో॥ జ్ఞానే (గారయతే) మానయతే సంవేత్త్యాత్మనేఽయమకర్మకః।
గృహ్ణాత్యపి చ గృహ్ణీతే చికేత్తి చ చికేతి చ ॥ 26

శ్లో॥ ఏతౌ ఛందసి కేషాంచిత్ జ్ఞానార్థాః షచ్ చ వింశతిః।
ధాతూ చ నీవదీ జ్ఞానవిషయౌస్తః క్వచిద్యథా॥ 27

శ్లో॥ విద్యాసు నయతే ప్రాజ్ఞో వదతే తాసు పణ్డితః॥
– అని 'ఆఖ్యాతచంద్రికా' – 1-2-24,25,26,27

---

**అవతారికా:–** భయపడినవానికి ఒళ్లు తెలియదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ స్మరస్తథాభూతమయుగ్మనేత్రం**
**పశ్యన్నదూరాన్మనసాప్యధృష్యమ్।**
**నాలక్షయత్ సాధ్వససన్నహస్తః**
**స్రస్తం శరం చాపమపి స్వహస్తాత్॥ 51**

**పదవిభాగము:–** స్మరః, తథాభూతమ్, అయుగ్మనేత్రమ్, పశ్యన్, అదూరాత్, మనసా, అపి, అధృష్యమ్, న, అలక్షయత్, సాధ్వససన్నహస్తః, స్రస్తమ్, శరమ్, చాపమ్, అపి, స్వహస్తాత్॥





**అన్వయక్రమము:–** స్మరః తథాభూతం మనసా అపి అధృష్యమ్ అయుగ్మనేత్రమ్ అదూరాత్ పశ్యన్ సాధ్వససన్నహస్తః స్వహస్తాత్ స్రస్తం శరం చాపమ్ అపి న అలక్షయత్।

**ప్రతిపదార్థము:–** స్మరః–మన్మథుడు, తథాభూతమ్–ఇంతకు మునుపు చెప్పిన రీతిగా ఉన్నట్టియు, మనసా+అపి–చిత్తముతోనైనను, అధృష్యమ్–ధరించుటకు శక్యము కానట్టియు, అయుగ్మనేత్రమ్–విషమాక్షుడగు త్ర్యమ్బకుని, అదూరాత్–సమీపము నుండి, పశ్యన్–చూచుచు, సాధ్వస–సన్న–హస్తః–భయముచే పట్టుసడలిన చేయి కలవాడై, స్వహస్తాత్ – తన చేతినుండి, స్రస్తమ్–జారిన, శరమ్–బాణమును, చాపమ్+అపి– ధనుస్సును, న+అలక్షయత్–తెలియకపోయిన వాడాయెను.

**తాత్పర్యము :–** మన్మథుడు పూర్వము చెప్పిన రీతిగా నున్నట్టియు, చిత్తముతో నైనను ధరింపశక్యము కానట్టియు, విషమాక్షుడగు త్ర్యమ్బకుని సమీపమునుండి చూచుచు భయముచే పట్టుసడలిన చేయికలవాడై తన చేతినుండి జారిన ధనుస్సును బాణమును తెలియకపోయిన వాడాయెను.

**పాఠాన్తరములు :–** సన్న – ఖిన్న

**విభక్తులు/క్రియలు:–** 1) స్మరః–**స్మరః**, స్మరౌ, స్మరాః, అకారాన్త పుంలింగ స్మరశబ్దము, ప్ర.ఏ., 2) తథాభూతమ్–**తథాభూతమ్**, తథాభూతౌ, తథాభూతాన్, అకారాన్త నపుంసకలింగ తథాభూతశబ్దము, ద్వి.ఏ., 3) మనసా–**మనసా**, మనోభ్యామ్, మనోభిః, సకారాన్త నపుంసకలింగ మనశ్శబ్దము, తృ.ఏ., 4) అపి, న–అవ్యయములు, 5) అధృష్యమ్–**అధృష్యమ్**, అధృష్యౌ, అధృష్యాన్, అకారాన్త పుంలింగ అధృష్య శబ్దము, ద్వి.ఏ., 6) అయుగ్మనేత్రమ్–**అయుగ్మనేత్రమ్**, అయుగ్మనేత్రా, అయుగ్మనేత్రాన్, అకారాన్త పుంలింగ అయుగ్మనేత్రశబ్దము, ద్వి.ఏ., 7) అదూరాత్–**అదూరాత్**, అదూరాభ్యామ్, అదూరేభ్యః, అకారాన్త పుంలింగ అదూరశబ్దము, పంచమీవిభక్తి – ఏకవచనము, 8) పశ్యన్–**పశ్యన్**, పశ్యన్తౌ, పశ్యన్తః, తకారాన్త పుంలింగపశ్యన్‌శబ్దము, ప్ర.ఏ., 9) సాధ్వస–సన్న–హస్తః – **హస్తః**, హస్తౌ, హస్తాః, అకారాన్త పుంలింగహస్త శబ్దము, ప్ర.ఏ., 10) స్వహస్తాత్ – **స్వహస్తాత్**, స్వహస్తాభ్యామ్, స్వహస్తేభ్యః, అకారాన్త పుంలింగ స్వహస్తశబ్దము, పం.ఏ., 11) స్రస్తమ్–**స్రస్తమ్**, స్రస్తౌ, స్రస్తాన్, అకారాన్త పుంలింగ స్రస్తశబ్దము, ద్వి.ఏ., 12) శరమ్–**శరమ్**, శరౌ, శరాన్, అకారాన్త పుంలింగ శరశబ్దము, ద్వి.ఏ., 13) చాపమ్–**చాపమ్**, చాపౌ, చాపాన్, అకారాన్త పుంలింగ చాపశబ్దము, ద్వి.ఏ., 14) అలక్షయత్–క్రియ–లక్ష+లఙ్ – ప్రథమపురుషైకవచనాంతః।

**సమాసాలు:–**

1) తథాభూతమ్–తథా భూతః (సుప్సుపాసమాసః) తథాభూతః, తమ్।
2) అధృష్యమ్ – న ధృష్యః (నఞ్‌తత్పు.) అధృష్యః, తమ్।

3) అయుగ్మనేత్రమ్–న యుగ్మాని (నఞ్తత్పు.) అయుగ్మాని, అయుగ్మాని నేత్రాణి యస్య (బహువ్రీహి) సః, తమ్।

4) అదూరాత్ – న దూరః (నఞ్తత్పు.) అదూరః, తస్మాత్।

5) సాధ్వససన్నహస్తః – సాధ్వసేన సన్నౌ హస్తౌ యస్య (బహువ్రీహి) సః।

6) స్వహస్తాత్ – స్వస్య హస్తః (ష.త.) స్వహస్తః, తస్మాత్।

**సంధులు:–** 1) స్మరః+తథాభూతమ్ – స్మరస్తథాభూతమ్ – విసర్గసన్ధిః।

2) పశ్యన్+అదూరాత్ – పశ్యన్నదూరాత్ – **ఙముడాగమః।**

3) అదూరాత్+మనసా – అదూరాన్మనసా – అనునాసికసన్ధిః।

4) అపి+అధృష్యమ్ – అప్యధృష్యమ్ – యణాదేశసన్ధిః।

5) న+అలక్షయత్ – నాలక్షయత్ – సవర్ణదీర్ఘసంధిః।

**ఙముడాగమః–ఙమో హ్రస్వాదచి ఙముణ్నిత్యమ్** (సూ.8-3-32) హ్రస్వమునకు పరముగానున్న 'ఙణన' లకు పరముగానున్న అచ్చునకు క్రమముగా 'ఙణన'లు ఆగమముగా వచ్చును. 'ఙణన' లకు ద్విత్వము వచ్చును.

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **అధృష్యమ్ –** a) న ధృష్యః అధృష్యః తమ్ ।

b) శ్లో॥ భీమకాంతైర్నృపగుణైః స బభూవోపజీవినామ్।
**అధృష్యశ్చాభిగమ్యశ్చ** యాదోరత్నైరివార్ణవః॥ -రఘువంశము 1-16

"…. దిలీపమహారాజు సముద్రుడువలె భీమకాంతములగు రాజగుణములచే తిరస్కరింపగూడని వాడును, అశ్రయింపదగిన వాడును ఆయెను."

**క్రియాదర్శము:– అలక్షయత్** – లక్ష – దర్శనాంకనయోః పరస్మైపదీ, సకర్మకమ్, చురాది, ఉభయపదీ, సేట్, లఙ్ ప్రథమపురుషైకవచనాంతః

రూపాలు – **అలక్షయత్** – అలక్షయతామ్ – అలక్షయన్.

---

**శ్లో॥ నిర్వాణభూయిష్ఠమథాస్య వీర్యం**
**సంధుక్షయన్తీవ వపుర్గుణేన ।**
**అనుప్రయాతా వనదేవతాభ్యా–**
**మదృశ్యత స్థావరరాజకన్యా॥** **52**



**పదవిభాగము:–** నిర్వాణభూయిష్ఠమ్, అథ, అస్య, వీర్యమ్, సంధుక్షయన్తీ, ఇవ, వపుర్ గుణేన, అనుప్రయాతా, వనదేవాతాభ్యామ్, అదృశ్యత, స్థావరరాజకన్యా।

**అన్వయక్రమము:–** అథ నిర్వాణభూయిష్ఠమ్ అస్య వీర్యం వపుర్గుణేన సంధుక్షయన్తీ ఇవ వనదేవతాభ్యామ్ అనుప్రయాతా స్థావరరాజకన్యా అదృశ్యత ।

**ప్రతిపదార్థము:–** అథ–పిమ్మట, నిర్వాణభూయిష్ఠమ్–పోయినట్లయిన, అస్య–మన్మథునియొక్క, వీర్యమ్–బలమును, వపుర్గుణేన–సౌందర్యగుణముచే, సంధుక్షయన్తీ + ఇవ – వృద్ధిపఱచుచున్నదివలె, వనదేవతాభ్యామ్–వనదేవతలతో (సఖురాండ్రగువారు), అనుప్రయాతా – అనుసరించి వచ్చిన, స్థావరరాజకన్యా–పార్వతీదేవి, అదృశ్యత–కనబడెను.

**తాత్పర్యము :–** పిమ్మట, పోయినట్లయిన మన్మథునియొక్క బలమును సౌందర్య గణముచే వృద్ధిపఱచుచున్నది వలె వనదేవతలతో అనుసరించి వచ్చిన పార్వతీదేవి కనబడెను.

**విభక్తులు/క్రియలు:–** 1) అథ, ఇవ – అవ్యయములు, 2) నిర్వాణభూయిష్ఠమ్–**నిర్వాణభూయిష్ఠమ్**, నిర్వాణభూయిష్ఠే, నిర్వాణభూయిష్ఠాని, అకారాన్త నపుంసకలింగ నిర్వాణభూయిష్ఠశబ్దము, ద్వి.ఏ., 3) అస్య–**అస్య**, అనయోః, ఏషామ్, మకారాన్త పుంలింగ ఇదమ్ శబ్దః, ష.ఏ., 4) వీర్యమ్–**వీర్యమ్,** వీర్యే, వీర్యాణి, అకారాన్త నపుంసకలింగ వీర్యశబ్దము, ద్వి.ఏ., 5) వపుర్గుణేన–వపుర్గుణేన, వపుర్గుణాభ్యామ్, వపుర్గుణైః, అకారాన్త పుంలింగ వపుర్గుణశబ్దము, తృ.ఏ., 6) సంధుక్షయన్తీ–**సంధుక్షయన్తీ**, సంధుక్షయన్త్యౌ, సంధుక్షయన్త్యః, ఈకారాన్త స్త్రీలింగ సంధుక్షయన్తీ శబ్దము, ప్ర.ఏ., 7) వనదేవతాభ్యామ్–వనదేవతయా, **వనదేవతాభ్యామ్**, వనదేవతాభిః, ఆకారాన్త స్త్రీలింగ వనదేవతాశబ్దము, తృ.ద్వి., 8) అనుప్రయాతా–**అనుప్రయాతా**, అనుప్రయాతే, అనుప్రయాతాః, ఆకారాన్త స్త్రీలింగ అనుప్రయాతా శబ్దము, ప్ర.ఏ., 9) స్థావరరాజకన్యా–**…కన్యా**, … కన్యే, …కన్యాః, ఆకారాన్త స్త్రీలింగ … కన్యా శబ్దము, ప్ర.ఏ., 10) అదృశ్యత – క్రియ (కర్మణి ప్రయోగము) – దృశ్ ధాతువు, లఙ్–ప్రథమపురుషైకవచనాంతము.

**సమాసాలు:–**

1) నిర్వాణభూయిష్ఠమ్ – భూయిష్ఠేన నిర్వాణం నిర్వాణభూయిష్ఠం తత్। (తృ.త.)

2) వపుర్గుణేన – వపుషః గుణః వపుర్గుణః (ష.త.) తేన।

3) వనదేవతాభ్యామ్ – వనస్య దేవతా(ష.త.) వనదేవతా, తాభ్యామ్।

4) స్థావరరాజకన్యా–స్థావరాణాం రాజా(ష.త.) స్థావరరాజః తస్య కన్యా (ష.త.) స్థావరరాజకన్యా।

**సంధులు:–** 1) అథ+అస్య – అథాస్య – సవర్ణదీర్ఘసంధిః।
2) సంధుక్షయన్తీ + ఇవ – సంధుక్షయన్తీవ ॥

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **వీర్యమ్ –** a) వీరే సాధు, 'తత్రసాధుః' ఇతి యత్ । యద్వా వీర్యతేఽ నేనేతి, వీర విక్రాన్తౌ + 'అచో యత్' ఇతి యత్। యద్వా వీరస్య భావః, యత్।

b) శ్లో॥ భూతప్రభావాతిశయో ద్రవ్యే పాకే రసే స్థితః।
చిన్త్యాచిన్త్య క్రియాహేతు**ర్వీర్యం** ధన్వన్తరేర్మతమ్॥

c) శ్లో॥ కృత్వా వత్సం సురగణా ఇంద్రం సోమమదూదుహన్।
హిరణ్మయేన పాత్రేణ **వీర్య**మోజో బలం పయః॥ – ఇతి భాగవతే–4.18.15

d) శ్లో॥ శుక్రం వీర్యం బలం బీజమిన్ద్రియం రేత ఉచ్యతే॥
– అని హలాయుధకోశము 6 నామములను పేర్కొన్నది.

e) శ్లో॥ **వీర్యవదా**నేషు కృతావమర్శ –
స్తన్వన్న భూతామివ సంప్రతీతిమ్।
కుర్వన్ ప్రయామక్షయమాయతీనా
మర్కత్విషామహ్నా ఇవావశేషః॥ – ఇతి కిరాతార్జునీయే. 3–43

f) శ్లో॥ వ్రతాయ తేనానుచరేణ ధేనో–
ర్న్యషేధి శేషోఽ ప్యనుయాయివర్గః।
న చాన్యతస్తస్య శరీరరక్షా
స్వ**వీర్య**గుప్తా హి మనోః ప్రసూతిః॥ – రఘువంశము – 2–4

".... మనవంశ సంజాతులు తమను తమ పరాక్రమముచేతనే రక్షించుకొన గలుగు సామర్థ్యము కలవారు కదా!"

**క్రియాదర్శము:–** 1) **అదృశ్యత** – దృశిర్ (దృశ్) ప్రేక్షణే (చూచుట) భ్వాదిప్రకరణమ్, సకర్మకమ్, అనిట్, లఙ్ ప్రథమపురుషఏకవచనాంతః, కర్మణిప్రయోగము, ఆత్మనేపదీ।

రూపాలు– **అదృశ్యత** – అదృశ్యేతామ్ – అదృశ్యన్త

శ్లో॥ యువా యుగవ్యాయతబాహురంసలః
కవాటవక్షాః పరిణద్ధకంధరః।



వపుఃప్రకర్షాదజయద్గురుం రఘు–
స్తథాపి నీచైర్వినయా**దదృశ్యత** ॥ – రఘువంశము 3–34

**అలంకారము:–** ఇట 'ఉత్ప్రేక్షాలంకార' మున్నదని చెప్పదగును.

'పార్వతీదేవి రాకతో మన్మథునిలో పోయిననట్లయిన బలము వృద్ధిపఱచు చున్నదని వర్ణింపబడుటచే నిది 'ఉత్ప్రేక్షాలంకార' మగును.

లక్షణమ్ – **అవివక్షిత సామాన్యా కించిచ్చోపమయా సహ।**
**అతద్గుణక్రియాయోగాదుత్ప్రేక్షాతియాన్వితా॥**

వివక్షితము కాని సాదృశ్యము కలదియు, ఇంచుక ఉపమాసంబంధము కలదియు ఏ గుణక్రియలు ఉన్నట్లు వర్ణింపబడునో అట్టి గుణక్రియ లేనిదియు, అతిశయముతో కూడినదియు అగునది ఉత్ప్రేక్ష. – బాలానందిని.

---

**అవతారికా:–** ఉమాయాః వసన్తపుష్పాభరణరమణీయత్వమ్। తామేవాహ చతుర్భిః – ఉమాదేవి ధరించిన వసన్త పుష్పాభరణముల రమణీయత. ఆ పార్వతినే నాలుగు శ్లోకములలో చెప్పుచున్నాడు.

**శ్లో॥ అశోకనిర్భర్త్సితపద్మరాగ –**
**మాకృష్టహేమద్యుతికర్ణికారమ్।**
**ముక్తాకలాపీకృతసిన్దువారం**
**వసన్తపుష్పాభరణం వహన్తీ॥ 53**

**పదవిభాగము:–** అశోక....రాగమ్, ఆకృష్ట...కారమ్, ముక్తా....వారమ్, వసన్తపుష్పాభరణమ్, వహన్తీ।

**అన్వయక్రమము:–** అశోక....రాగమ్ ఆకృష్ట..కారమ్ ముక్తా....వారం వసన్తపుష్పాభరణం వహన్తీ (స్థావరరాజకన్యా అదృశ్యత)।

**ప్రతిపదార్థము:–** అశోకనిర్భర్త్సితపద్మరాగమ్ – అశోకపుష్పముచే తిరస్కరింపబడిన పద్మరాగమణులు కలదియు, ఆకృష్టహేమద్యుతికర్ణికారమ్–ఆకర్షింపబడిన బంగారు కాంతిగల కొండగోగుపూవులు గలదియు, ముక్తాకలాపీకృతసిన్దువారమ్–ముత్యాల హారముగా చేయబడిన వావిలిపూవులు గలదియు ఐన, వసన్తపుష్పాభరణమ్–వసన్త ఋతువునందలి పూనగను, వహన్తీ–తాల్చిన, (స్థావరరాజకన్యా అదృశ్యత–పార్వతీ దేవి కనబడెను.)

**తాత్పర్యము :–** అశోకపుష్పముచే తిరస్కరింపబడిన పద్మరాగమణులు గలదియు, ఆకర్షింపబడిన బంగారుకాంతిగల కొండగోగుపూవులు గలదియు, ముత్యాల హారముగా చేయబడిన వావిలిపూవులు గలదియు ఐన వసన్తఋతువునందలి పూనగను తాల్చిన (పార్వతీదేవి కనబడెను).

**పాఠాన్తరముల :–** ఆకృష్ట – ఆక్రుష్ట.

**విభక్తులు/క్రియలు:–** 1) అశోక....పద్మరాగమ్–**...రాగమ్**, ...రాగే, ...రాగాణి, అకారాన్త నపుంసక లింగ ...రాగశబ్దము, ద్వి.ఏ., 2) ఆకృష్ట...కర్ణికారమ్–**...కర్ణికారమ్**, .... కర్ణికారే, ... కర్ణికారాణి, అకారాన్త నపుంసకలింగ ....కర్ణికారశబ్దము, ద్వి.ఏ., 3) ముక్తా...సిన్దువారమ్–**...సిన్దువారమ్**, ...సిన్దువారే, ...సిన్దువారాణి, అకారాన్త నపుంసకలింగ ...సిన్దువారశబ్దము, ద్వి.ఏ., 4) వసన్తపుష్పా భరణమ్–**...ఆభరణమ్**, ...ఆభరణే, ...ఆభరణాని, అకారాన్త నపుంసకలింగ ...ఆభరణశబ్దము, ద్వి.ఏ., 5) వహన్తీ–**వహన్తీ**, వహన్త్యౌ, వహన్త్యః, ఈకారాన్త స్త్రీలింగ వహన్తీశబ్దము, ప్ర.ఏ.

**సమాసాలు:–**

1) అశోకనిర్భర్త్సితపద్మరాగమ్ – అశోకేన నిర్భర్త్సితాః పద్మరాగా యేన (బహువ్రీహి) తత్।
2) ఆకృష్టహేమద్యుతికర్ణికారమ్ – హేమ్నః ద్యుతిః (ష.త.) హేమద్యుతిః। ఆకృష్టా హేమద్యుతిః యైః (బహువ్రీహి) తాని ఆకృష్టహేమద్యుతీని, ఆకృష్ట హేమద్యుతీని కర్ణికారాణి యస్మిన్ (బహువ్రీహి) తత్ ఆకృష్టహేమద్యుతి కర్ణికారం తత్॥
3) ముక్తాకలాపీకృతసిన్దువారమ్–ముక్తానాం కలాపాః (ష.త.) ముక్తాకలాపాః ముక్తాకలాపీకృతాని సిన్దువారాణి యస్మిన్ (బహువ్రీహి) తత్।
4) వసన్తపుష్పాభరణమ్–వసన్తస్య పుష్పాణి(ష.త.) వసన్తపుష్పాణి వసన్త పుష్పాణ్యేవ ఆభరణమ్ (కర్మధా.) వసన్తపుష్పాభరణమ్।

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **సిన్దువారః –** పుం. a) సింధుం గజమదం వాయతి తివతత్వాత్। సింధు+వృ+ అణ్। పాక్షికో ధస్య దః। – వృక్షవిశేషః – నిర్గుణ్డీ,వావిలి ప్రాంతీయ నామము.

b) శ్లో॥ "నిర్గుణ్డీ **సిన్దువారః....**" అని హలాయుధకోశము.

c) శ్లో॥ సిన్ధుకః స్మృతిదస్తిక్తః కషాయః కుటకో లఘుః।
కేశ్యో నేత్రహితో హన్తి శూలశోథామ మారుతాన్॥



శ్లో॥ కృమికృష్ఠారుచిశ్లేష్మవ్రణాన్ నీలాపి తద్విధా।
**సిన్దువార**దలం తత్తు వాతశ్లేష్మహరం లఘుః॥ ఇతి భావప్రకాశః।

d) శ్లో॥ తులసీబిల్వ**నిర్గుణ్డీ** జంబీరామలకం తథా।
పంచబిల్వమితి ఖ్యాతమ్ ఏకబిల్వం శివార్పణమ్॥ 94
– అని 'బిల్వాష్టోత్తరశతనామస్తోత్రమ్'.

తులసి,మారేడు,వావిలి,నిమ్మ,ఉసిరిగ యీ యైదింటికి పంచబిల్వములని పేరు. శివార్పణమని ఒక బిల్వపత్రమును సమర్పించిన ఆ దేవదేవుడు పులకించును.

e) శ్లో॥ దీర్ఘికాం ప్రావృతాం పశ్యతీరజైః **సిందువారకైః**॥
– అని బుద్ధచరితము4–49

---

**శ్లో॥ ఆవర్జితా కిఞ్చిదివ స్తనాభ్యాం
వాసో వసానా తరుణార్కరాగమ్।
పర్యాప్తపుష్పస్తబకావనమ్రా
సంచారిణీ పల్లవినీ లతేవ॥ 54**

**పదవిభాగము:–** ఆవర్జితా, కిఞ్చిత్, ఇవ, స్తనాభ్యామ్, వాసః, వసానా, తరుణార్క రాగమ్, పర్యాప్తపుష్పస్తబకావనమ్రా, సంచారిణీ, పల్లవినీ, లతా, ఇవ।

**అన్వయక్రమము:–** స్తనాభ్యాం కించిత్ ఆవర్జితా ఇవ తరుణార్కరాగం వాసః వసానా పర్యాప్తపుష్పస్తబకావనమ్రా పల్లవినీ సంచారిణీ లతా ఇవ (స్థావరరాజకన్యా అదృశ్యత)।

**ప్రతిపదార్థము:–** స్తనాభ్యామ్ – స్తనద్వయముచే, కించిత్–ఇంచుక, ఆవర్జితా+ఇవ – వంగినదివలె నున్నదై, తరుణార్కరాగమ్ – బాలసూర్యునివలె ఎఱ్ఱగా నున్న, వాసః–వస్త్రమును, వసానా–ధరించినదై, పర్యాప్తపుష్పస్తబకావనమ్రా–నిండు పూలగుత్తులచే వంగినదై, పల్లవినీ – చిగుళ్లుగల, సంచారిణీ–నడుచుచున్న, లతా+ ఇవ – తీగవలె (ఉన్న పార్వతిదేవి కనబడెను.)

**తాత్పర్యము :–** స్తనద్వయముచే ఇంచుక వంగినదివలె నున్నదై, బాలసూర్యునివలె ఎఱ్ఱగానున్న వస్త్రమును ధరించినదై, నిండు పూలగుత్తులచే వంగినదై చిగుళ్లుగల నడుచుచున్న తీగవలె (ఉన్న పార్వతీదేవి కనబడెను).

**పాఠాన్తరములు :–** 1) పర్యాప్త–సంజాత, సుజాత, 2) పల్లవినీ–పల్లవితా (కాలే)

**విభక్తులు/క్రియలు:–** 1) స్తనాభ్యామ్–స్తనేన, **స్తనాభ్యామ్**, స్తనైః, అకారాన్త పుంలింగ స్తనశబ్దము తృ.ద్వి., 2) కించిత్, ఇవ–అవ్యయాలు, 3) ఆవర్జితా–**ఆవర్జితా**, ఆవర్జితే, ఆవర్జితాః, ఆకారాన్త స్త్రీలింగ ఆవర్జితా శబ్దము, ప్ర.ఏ., 4) తరుణార్కరాగమ్–**...రాగమ్**, ...రాగే, ...రాగాన్, అకారాన్త పుంలింగ ...రాగ శబ్దము, ద్వి.ఏ., 5) వాసః–**వాసః**, వాససీ, వాసాంసి, సకారాన్త నపుంసకలింగ వాసస్ శబ్దము, ద్వి.ఏ., 6) వసానా – **వసానా**, వసానే, వసానాః, ఆకారాన్త స్త్రీలింగ వసానా శబ్దము, ప్ర.ఏ. (వస్+శానచ్+టాప్), 7) పర్యాప్త పుష్పస్తబకావనమ్రా– ...నమ్రా, ...నమ్రే,...నమ్రాః ఆకారాన్త స్త్రీలింగ ...నమ్రా శబ్దము, ప్ర.ఏ., 8) పల్లవినీ–**పల్లవినీ**, పల్లవిన్యౌ, పల్లవిన్యః, ఈకారాన్త స్త్రీలింగ పల్లవినీ శబ్దము, ప్ర.ఏ.9) సంచారిణీ–**సంచారిణీ**, సంచారిణ్యౌ, సంచారిణ్యః, ఈకారాన్త స్త్రీలింగసంచారిణీశబ్దము, ప్ర.ఏ.,10) లతా–**లతా**, లతే, లతాః, ఆకారాన్తస్త్రీలింగ లతాశబ్దము, ప్ర.ఏ.

**సమాసాలు:–**

1) తరుణార్కరాగమ్ – తరుణః చాసౌ అర్కః (కర్మధా.) తరుణార్కః, తరుణార్కస్య రాగ ఇవ రాగో యస్య (బహువ్రీహి) తత్।
2) పర్యాప్తపుష్పస్తబకావనమ్రా – పర్యాప్తాని చ తాని పుష్పాణి (కర్మధా.) పర్యాప్త పుష్పాణి, పర్యాప్తపుష్పాణాం స్తబకాః (ష.త.) పర్యాప్త పుష్పస్తబకాః పర్యాప్తపుష్పస్తబకైః అవనమ్రా (తృ.త.) పర్యాప్తపుష్పస్తబకావనమ్రా।

**సంధులు:–**

1) కించిత్ + ఇవ – కించిదివ – జశ్త్వసన్ధిః।
2) వాసః + వసానా – వాసోవసానా – ఉత్వాదేశసంధిః।
3) లతా + ఇవ – లతేవ – గణసన్ధిః।

**ఆద్గుణః** (సూ. 6.1.84) అవర్ణమునకు (అ,ఆ లకు) హ్రస్వదీర్ఘములయిన ఇ,ఉ,ఋ,ఌ వర్ణములు పరముగా నున్నపుడు పూర్వపరముల స్థానములో గుణము ఏకాదేశమగును. (ఇచట గుణములు క్రమముగా ఏ,ఓ,అర్,అల్ అనునవి ఆదేశమగునని తాత్పర్యము.)

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **తరుణార్కరాగమ్**

శ్లో॥ అరుణరాగనిషేధిభిరంశుకైః
శ్రవణలబ్ధపదైశ్చ యవాంకురైః।
పరభృతావిరుతైశ్చ విలాసినః
స్మరబలైరబలైకరసాః కృతాః॥ – ర.వం. 9–43





"... కుంకుమపువ్వు రంగులో ఉన్న ఎఱ్ఱని వస్త్రములచేతను..."

శ్లో॥ కుసుమ్భరాగారుణితైర్దుకూలై–
ర్నితమ్బబిమ్బాని విలాసినీనామ్।
రక్తాంశుకైః కుఙ్కుమరాగగౌరై–
రలంక్రియన్తే స్తనమణ్డలాని ॥ – ఋతుసంహారః 6–4

"... కుసుమపూవు రంగుచే ఎఱ్ఱగా చేయబడిన పలుచని వస్త్రములచేతను..."

**అలంకారము:–** ఇట 'ఉత్ప్రేక్షాలంకార' మున్నదని చెప్పదగును.

ఈ శ్లోకమును – 'ఉత్ప్రేక్షాలంకారము' నకు ఉదాహరణగా 1) కావ్యాలంకార టిప్పణి, 2) కావ్యానుశాసన, 3) చిత్రమీమాంస గ్రంథకర్తలు – పేర్కొనుట గమనింపదగినది.

---

**శ్లో॥ స్రస్తాం నితమ్బాదవలమ్బమానా**
**పునః పునః కేసరదామకాఞ్చీమ్।**
**న్యాసీకృతాం స్థానవిదా స్మరేణ**
**మౌర్వీం ద్వితీయామివ కార్ముకస్య॥ 55**

**పదవిభాగము:–** స్రస్తామ్, నితమ్బాత్, అవలమ్బమానా, పునః, పునః, కేసరదామ కాఞ్చీమ్, న్యాసీకృతామ్, స్థానవిదా, స్మరేణ, మౌర్వీమ్, ద్వితీయామ్, ఇవ, కార్ముకస్య।

**అన్వయక్రమము:–** స్థానవిదా స్మరేణ న్యాసీకృతాం కార్ముకస్య ద్వితీయాం మౌర్వీమ్ ఇవ నితమ్బాత్ స్రస్తాం కేసరదామకాఞ్చీం పునః పునః అవలమ్బమానా (స్థావర రాజకన్యా అదృశ్యత)।

**ప్రతిపదార్థము:–** స్థానవిదా–దాచెడిస్థలము తెలిసికొన్న, స్మరేణ–మన్మథునిచే, న్యాసీకృతామ్ – దాచుకొనబడిన, కార్ముకస్య–బాణముయొక్క, ద్వితీయామ్–రెండవది యగు, మౌర్వీమ్+ఇవ–నారియో యనునట్లు, నితమ్బాత్–పిఱుదునుండి, స్రస్తామ్–జారిన, కేసరదామకాఞ్చీమ్–పొగడపూదండ అను మొలనూలును, పునః పునః – మాటిమాటికి, అవలమ్బమానా – చేతితో నాపుచున్నదియగు (స్థావరరాజకన్యా అదృశ్యత)।

**తాత్పర్యము:–**దాచెడిస్థలము తెలిసికొన్న మన్మథునిచే దాచుకొనబడిన బాణముయొక్క

రెండవదియగు నారియో యనునట్లు పిఱుదునుండి జాఱిన పొగడపూదండ అను మొలనూలును మాటిమాటికి చేతితో నాపుచున్నదియగు (పార్వతీదేవి కనబడెను).

**పాఠాన్తరములు :–** దామ–పుష్ప, మౌర్వీం ద్వితీయామివ–ద్వితీయమౌర్వీమివ.

**విభక్తులు/క్రియలు:–** 1) స్థానవిదా–**స్థానవిదా**, స్థానవిద్భ్యామ్, స్థానవిద్భిః, దకారాన్త పుంలింగ స్థానవిచ్ఛబ్దము, తృ.ఏ., 2) స్మరేణ–**స్మరేణ**, స్మరాభ్యామ్, స్మరైః, అకారాన్త పుంలింగ స్మరశబ్దము, తృ.ఏ., 3) న్యాసీకృతామ్ – **న్యాసీకృతామ్**, న్యాసీకృతే, న్యాసీకృతాః, ఆకారాన్త స్త్రీలింగ న్యాసీకృతాశబ్దము, ద్వి.ఏ., 4) కార్ముకస్య – **కార్ముకస్య**, కార్ముకయోః, కార్ముకాణామ్, అకారాన్త నపుంసకలింగ కార్ముక శబ్దము, ష.ఏ., 5) ద్వితీయామ్ – **ద్వితీయామ్**, ద్వితీయే, ద్వితీయాః, ఆకారాన్త స్త్రీలింగ ద్వితీయా శబ్దము, ద్వి.ఏ., 6) మౌర్వీమ్–**మౌర్వీమ్**, మౌర్వ్యౌ, మౌర్వీః, ఈకారాన్త స్త్రీలింగ మౌర్వీశబ్దము, ద్వి.ఏ., 7) పునః పునః, ఇవ– అవ్యయము, 8) స్రస్తామ్–**స్రస్తామ్**, స్రస్తే, స్రస్తాః, ఆకారాన్త స్త్రీలింగ స్రస్తాశబ్దము, ద్వి.ఏ, 9) నితమ్బాత్ – **నితమ్బాత్**, నితమ్బాభ్యామ్, నితమ్బేభ్యః, అకారాన్త పుంలింగ నితమ్బశబ్దము, పం.ఏ., 10) కేసరదామకాఞ్చీమ్ – **...కాఞ్చీమ్**, ..కాఞ్చ్యౌ, ...కాఞ్చీః, ఈకారాన్త స్త్రీలింగ ...కాఞ్చీశబ్దము, ద్వి.ఏ., 11) అవలమ్బమానా – **అవలమ్బమానా**, అవలమ్బమానే, అవలమ్బమానాః, ఆకారాన్త స్త్రీలింగ అవలమ్బమానా శబ్దము, ప్ర.ఏ.

**సమాసాలు:–**

1) స్థానవిదా–స్థానం వేత్తి (ఉపపద తత్పు.) ఇతి స్థానవిత్, తేన।
2) కేసరదామకాఞ్చీమ్ – కేసరాణాం దామ (ష.త.) కేసరదామ, కేసరదామ, ఏవ కాఞ్చీ (కర్మధా.) తామ్।
3) అన్యాసః న్యాసః యథా సమ్పద్యతే తథా కృతా, తామ్ । న్యాసీకృతామ్।
4) ద్వితీయామ్ – ద్వయోః పూరణీ సంఖ్యా ద్వితీయా తామ్ । ద్వితీయామ్।

**సంధులు:–**

1) నితమ్బాత్+అవలమ్బమానా – నితమ్బాదవలమ్బమానా – జశ్త్వసంధిః।

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **మౌర్వీ** – a) మూర్వాయా వికారః। మూర్వా + 'అవయవే చ ప్రాణ్యౌషధి – వృక్షేభ్యః' ఇతి అణ్+జీప్ ।

b) శ్లో॥ బాణాసనం ద్రుణాస్యాన్మౌర్వీ జ్యా సిఞ్జినీ గుణో జీవా॥ 464
... అని హలాయుధకోశము.

c) శ్లో॥ సేనాపరిచ్ఛదస్తస్య ద్వయమేవార్థ సాధనమ్।
శాస్త్రేష్వకుణ్ఠితా బుద్ధిర్మౌర్వీ ధనుషి చాతతా॥ 19 – ర.వం.1





"ఆ దిలీపమహారాజునకు సైన్యము లాంఛన మాత్రమే అయినది. రాజనీతి, అర్థశాస్త్రములజ్ఞానముతో అప్రతిహతమైన బుద్ధియును, ఎల్లప్పుడును ధనుస్సునందు ఎక్కుపెట్టబడిన నారియును, అను ఈ రెండే అతనికి కార్యసాధనోపకరణములై యుండెను."

d) శ్లో॥ రమ్యాస్తపోధనానాం ప్రతిహతవిఘ్నాః క్రియాః సమవలోక్య।
జ్ఞాస్యసి కియద్భుజో మే రక్షతి **మౌర్వీ**కిణాంక ఇతి ॥ 13

"ఓ రాజా! రమ్యములైనట్టి, విఘ్నములులేనిట్టి, తపోనిష్ఠాగరిష్ఠుల సత్క్రియలను అవలోకించి అల్లెత్రాటివలని కాయలే గుర్తులుగా గల నీ భుజము ఎంత దూరముగల దేశమును పాలించుచున్నదో నీయంతట నీవే తెలిసికొనగలవు."

e) శ్లో॥ ధనుః పౌష్పం **మౌర్వీ** మధుకరమయీ పంచవిశిఖాః
వసన్తస్సామన్తో మలయమరుదాయోధనరథః।
తథాప్యేకస్సర్వం హిమగిరిసుతే కామపి కృపామ్
అపాఙ్గాత్తే లబ్ధ్వా జగదిదమనఙ్గో విజయతే। – సౌందర్యలహరి–6

"ఓ మంచుకొండకూతురా!మన్మథుడు తనకు విల్లు పూవులతో గూర్చినదియు, అల్లెత్రాడు తుమ్మెదలు చేరినది, అమ్ములయిదు మాత్రము, చెలికాడు జడుడగు వసంతుడు, పోరికి గలతేరు గందపుకొండగాలి – అనునవి కయ్యమునకు సమర్థములు కానివి కలిగియుండియు ఒక్కడే తాను అనంగుడు, బలిష్ఠమగు మేను లేని వాడయ్యును నిన్నారాధించి నీ కడ కంటివలన ఇంత మాత్రమని చెప్పుటకు వీలుకాని నీ దయను పొందినవాడై ఓ తల్లీ! ఈ జగత్తును జయించుచున్నాడు." – చదలవాడ జయరామశాస్త్రిగారు

**అలంకారము:–** ఇట 'ఉత్ప్రేక్షాలంకార' మున్నదని చెప్పదగును.

---

**శ్లో॥ సుగన్ధినిశ్వాసవివృద్ధతృష్ణం**
**బిమ్బాధరాసన్నచరం ద్విరేఫమ్।**
**ప్రతిక్షణం సంభ్రమలోలదృష్టి-**
**ర్లీలారవిన్దేన నివారయన్తీ ॥** **56**

**పదవిభాగము:-** సుగన్ధి....తృష్ణమ్, బిమ్బాధరాసన్నచరమ్, ద్విరేఫమ్, ప్రతిక్షణమ్, సంభ్రమలోలదృష్టిః, లీలారవిన్దేన, నివారయన్తీ॥

**అన్వయక్రమము:-** సుగన్ధి....తృష్ణం బిమ్బాధరాసన్నచరం ద్విరేఫం ప్రతిక్షణం సంభ్రమలోలదృష్టిః లీలారవిన్దేన నివారయన్తీ (స్థావరరాజకన్యా అదృశ్యత)॥

**ప్రతిపదార్థము:-** సుగన్ధి-నిశ్వాస-వివృద్ధతృష్ణమ్-సువాసనగల నిట్టూర్పులచే వృద్ధి నొందిన కోరికగలదియై, బిమ్బాధరాసన్నచరమ్-దొండపండువంటి పెదవి సమీపముననే తిరుగాడు, ద్విరేఫమ్-తుమ్మెదను, ప్రతిక్షణమ్-మాటిమాటికి, సంభ్రమ-లోలదృష్టిః-తొందరపాటుచే చలించుచూపుగలదై, లీలారవిన్దేన-విలాసార్థముగా ధరించు కమలముచే, నివారయన్తీ-అడ్డుచున్న (స్థావరరాజకన్యా అదృశ్యత - (పార్వతీదేవి కనబడెను).

**తాత్పర్యము :-** సువాసనగల నిట్టూర్పులచే వృద్ధినొందిన కోరికగలదియై దొండ పండువంటి పెదవి సమీపముననే తిరుగాడు తుమ్మెదను మాటిమాటికి తొందర పాటుచే చలించు చూపుగలదై విలాసార్థముగా ధరించుకమలముచే అడ్డుచున్న (పార్వతీదేవి కనబడెను.)

**పాఠాన్తరములు :-** సంరమ్భ-స్తమ్భిత.

**విభక్తులు/క్రియలు:-** 1) సుగన్ధినిశ్వాసవివృద్ధతృష్ణమ్- **...తృష్ణమ్**, ...తృష్ణౌ, ...తృష్ణాన్, అకారాన్త పుంలింగ ....తృష్ణశబ్దము, ద్వి.ఏ., 2) బిమ్బాధరాసన్నచరమ్-**...చరమ్**, ...చరౌ, ...చరాన్, అకారాన్త పుంలింగ ....చరశబ్దము, ద్వి.ఏ., 3) ద్విరేఫమ్-**ద్విరేఫమ్**, ద్విరేఫౌ, ద్విరేఫాన్, అకారాన్త పుంలింగ ద్విరేఫ శబ్దము, ద్వి.ఏ., 4) ప్రతిక్షణమ్-అవ్యయము, 5) సంభ్రమలోలదృష్టిః-**...దృష్టిః**, ...దృష్టీ, ...దృష్టయః, ఇకారాన్త స్త్రీలింగ దృష్టిశబ్దము, ప్ర.ఏ., 6) లీలారవిన్దేన - **లీలారవిన్దేన**, లీలారవిన్దాభ్యామ్, లీలారవిన్దైః, అకారాన్తపుంలింగ అరవిన్దశబ్దము, తృ.ఏ., 7) నివారయన్తీ-**నివారయన్తీ**, నివారయన్త్యౌ, నివారయన్త్యః, ఈకారాన్త స్త్రీలింగ నివారయన్తీశబ్దము, ప్ర.ఏ.

**సంధులు:-**

1) సంభ్రమలోలదృష్టిః + లీలారవిన్దేన - సంభ్రమలోలదృష్టిర్లీలారవిన్దేన - విసర్గసంధిః॥

**పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణాలు-కావ్యప్రయోగాలు:-**

1) **సుగంధితా -** a) సుగంధేర్భావః సుగంధి+తల్+టాప్॥

b) శ్లో॥ ఆమోదః స్యాత్పరిమలః సౌరభ్యం చ **సుగంధితా॥**

- అని హలాయుధకోశము.





c) శ్లో॥ **సుగన్ధితామ**ప్రతియత్నపూర్వాం
బిభ్రన్తి యత్ర ప్రమదాయ యూనామ్।
మధూని వక్త్రాణి చ కామినీనాం
ఆమోదకర్మ వ్యతిహారమీయుః॥ - మాఘకావ్యము - 3-54

"... సువాసనను భరించుచున్న మద్యములను...."

2) **బింబాధరః -** శ్లో॥ న తిర్యగవలోకితం భవతి చక్షురాలోహితం
వచోఽపి పరుషాక్షరం న చ పదేషు సంగచ్ఛతే।
హిమార్త ఇవ వేపతే సకల ఏవ **బిమ్బాధరః**
ప్రకామవినతే భ్రువౌ యుగపదేవ భేదం గతే॥ 24
- అభిజ్ఞానశాకున్తలే - పంచమాఙ్కే.

3) **లీలారవిందేన-** శ్లో॥ కశ్చిత్కరాభ్యాముపగూఢనాల-
మాలోలపత్రాభిహతద్విరేఫమ్।
రజోభిరన్తఃపరివేషబన్ధి
**లీలారవిన్దం** భ్రమయాఞ్చకార॥ - ర.వం. 6-13

"....కదులుచున్న తామరరేకులతాకిడికి పుష్పముపై మూగు తుమ్మెదలు చెదిరిపోవునట్లుగను, పుష్పమునందలి పరాగము, లోపల మండలముగా ఏర్పడునట్లును, తనచేతియందలి లీలారవిందమును గిరగిర త్రిప్పసాగెను."

**అలంకారము:-** ఇట 'భావికాలంకార' మున్నదని చెప్పదగును.

"కా॥ **ప్రత్యక్షా ఇవ యద్భావాః క్రియన్తే భూతభావినః తద్భావికమ్"** అని లక్షణము. జరిగిపోయిన విషయాలను, జరుగబోయే విషయాలను ప్రత్యక్షంగా కనబడు తున్నట్లు వర్ణించటం - భావికాలంకారము - బాలానందిని.

"అన్వయము - సరళము."

---

**శ్లో॥ తాం వీక్ష్య సర్వావయవానవద్యాం**
**రతేరపి హ్రీపదమాదధానామ్।**
**జితేన్ద్రియే శూలిని పుష్పచాపః**
**స్వకార్యసిద్ధిం పునరాశశంసే॥ 57**

**పదవిభాగము:-** తామ్, వీక్ష్య, సర్వావయవానవద్యామ్, రతేః, అపి, హ్రీపదమ్, ఆదధానామ్, జితేన్ద్రియే, శూలిని, పుష్పచాపః, స్వకార్యసిద్ధిమ్, పునః, ఆశశంసే।

**అన్వయక్రమము:-** సర్వావయవానవద్యాం రతేః అపి హ్రీపదమ్ ఆదధానాం తాం వీక్ష్య పుష్పచాపః జితేన్ద్రియే శూలిని స్వకార్యసిద్ధిం పునః ఆశశంసే।

**ప్రతిపదార్థము:-** సర్వావయవానవద్యామ్ - అన్ని అవయవములయందు నిర్దుష్టురాలైనదియు, రతేః+అపి - రతీదేవికిని, హ్రీపదమ్-లజ్జాకారణమును, ఆదధానామ్-కూర్చునట్టిదియు అగు, తామ్-ఆ పార్వతీదేవిని, వీక్ష్య-చూచి, పుష్పచాపః-మన్మథుడు, జితేన్ద్రియే-జితేంద్రియుడగు, శూలిని-శివునియందు, స్వకార్యసిద్ధిమ్-తనకార్యముకొనసాగించుటను, పునః-మరల, ఆశశంసే-ఇచ్ఛగించెను.

**తాత్పర్యము :-** అన్ని అవయవములయందు నిర్దుష్టురాలైనదియు, రతీదేవికి లజ్జాకారణమును కూర్చునట్టిదియు అగు ఆ పార్వతీదేవిని చూచి మన్మథుడు జితేంద్రియుడగు శివునియందు తనకార్యము కొనసాగించుటను ఇచ్ఛగించెను.

**పాఠాన్తరములు :-** 1) పుష్ప-కేతుః-ధన్వా, 2) స్వకార్య - స్వకర్మ, 3) ఆశశంసే - ఆశశంస.

**విభక్తులు/క్రియలు:-** 1) సర్వావయవానవద్యామ్- ...అనవద్యామ్, ...అనవద్యే, ...అనవద్యాః ఆకారాన్త స్త్రీలింగ అనవద్యాశబ్దము, ద్వి.ఏ., 2) రతేః-రతేః, రత్యోః, రతీనామ్, ఇకారాన్త స్త్రీలింగ రతిశబ్దము, ష.ఏ., 3) హ్రీపదమ్-**హ్రీపదమ్**, హ్రీపదే, హ్రీపదాని, అకారాన్త నపుంసకలింగ హ్రీపద శబ్దము, ద్వి.ఏ., 4) ఆదధానామ్ - **ఆదధానామ్**, ఆదధానే, ఆదధానాః, ఆకారాన్త స్త్రీలింగ ఆదధానా శబ్దము, ద్వి.ఏ., 5) తామ్ - **తామ్**, తే, తాః, దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ద్వి.ఏ., 6) వీక్ష్య-వి+ఈక్ష్+క్త్వా - ల్యబన్తము - అవ్యయము, 7) పుష్పచాపః - **పుష్పచాపః**, పుష్పచాపౌ, పుష్పచాపాః, అకారాన్త పుంలింగ పుష్పచాప శబ్దము, ప్ర.ఏ., 8) జితేన్ద్రియే - **జితేన్ద్రియే**, జితేన్ద్రియయోః, జితేన్ద్రియేషు - అకారాన్త పుంలింగ జితేన్ద్రియ శబ్దము, స.ఏ., 9) శూలిని-**శూలిని**, శూలినోః, శూలిషు, నకారాన్త పుంలింగ శూలిన్ శబ్దము, స.ఏ., 10) స్వకార్యసిద్ధిమ్-స్వకార్యసిద్ధిమ్, స్వకార్యసిద్ధీ, స్వకార్యసిద్ధీః, ఇకారాన్త స్త్రీలింగ స్వకార్య సిద్ధి శబ్దము, ద్వి.ఏ., 11) అపి, పునః - అవ్యయములు, 12) ఆశశంసే-క్రియ-ఆ+శంస్+లిట్, ప్రథమపురుషైకవచనము.

**సమాసాలు:-**

1) సర్వావయవానవద్యామ్-న అవద్యా (నఞ్‌తత్పు.) అనవద్యా, సర్వావయవేషు అనవద్యా (స.త.) సర్వావయవానవద్యా, తామ్।
2) హ్రీపదమ్ - హ్రియః పదమ్ (ష.త.) తత్।
3) పుష్పచాపః - పుష్పం చాపో యస్య (బహువ్రీహి) సః।





4) జితేన్ద్రియే-జితాని ఇంద్రియాణి యేన (బహువ్రీహి) సః, జితేన్ద్రియః, తస్మిన్।
5) స్వకార్యసిద్ధిమ్ - స్వస్య కార్యమ్ (ష.త.), స్వకార్యమ్, స్వకార్యస్య సిద్ధిః (ష.త.) స్వకార్యసిద్ధిః, తామ్।

**సంధులు:-**

1) రతేః+అపి - రతేరపి - విసర్గసంధిః।
2) పునః+ఆశశంసే - పునరాశశంసే - విసర్గసంధిః।

**పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణాలు-కావ్యప్రయోగాలు:-**

1) **హ్రీః -** a) హ్రీ లజ్జాయామ్ + సమ్పదాదిత్వాత్ క్విప్, - లజ్జా, వ్రీడా.

b) శ్లో॥ హ్రీర్లజ్జాపత్రపా వ్రీడా త్రపా మందాక్షముచ్యతే॥ 567
- ఆని హలాయుధకోశము 6 నామములను పేర్కొన్నది.

c) శ్లో॥ నాహం తాత! కరిష్యామి పృథివ్యాః పరిపాలనమ్।
నాపైతి **హ్రీర్మే** మనసో రాజ్యేఽన్యం త్వం నియోజయః॥
- ఇతి మార్కణ్డేయే - 129-22

d) శ్లో॥ దారిద్ర్యాద్ **హ్రియ**యేతి హ్రీపరిగతః ప్రభ్రశ్యతే తేజసః॥
- మృచ్ఛకటికమ్ - 1-14

e) శ్లో॥ తత్రాక్షోభ్యం యశోరాశిం నివేశ్యవరురోహ సః।
పౌలస్త్య తులితస్యాద్రే**రాదధాన** ఇవ **హ్రియమ్**॥ - ర.వం. 4-80

"...కైలాసపర్వతము నధిరోహించకుండగనే, దానికి సిగ్గును కలిగించుచున్నాడో యనునట్లు ఆ పర్వతప్రాంతమునుండి క్రిందికి దిగెను."

**క్రియాదర్శము:-** 1) **ఆశశంస** - శంసు (శంస్) స్తుతౌ (స్తుతించుట, దుర్గతినొందుట) సకర్మకమ్, సేట్, ఆఙ్- ఉపసర్గపూర్వకాత్, లిట్ ప్రథమపురుషైకవచనాంతః।

రూపాలు- **ఆశశంస** - ఆశశంసతుః - ఆశశంసుః (పరస్మైపదీ)

2) ఆ శశి (ఆఙ్‌శ్శసి) - ఇచ్ఛాయామ్ భ్వాదిప్రకరణమ్, ఆత్మనేపదీ సకర్మకమ్ సేట్, లిట్ ప్రథమపురుషైకవచనాంతః।

**ఆశశంసే** - ఆశశంసాతే - ఆశశంసిరే।

ఆశశంసే - పాఠమే - కోరదగినది.

---

**అవతారికా:–** శివుడు – యోగసమాధినుండి బహిర్ముఖుడగుట చెప్పుచున్నాడు.

**శ్లో॥ భవిష్యతః పత్యురుమా చ శమ్భోః**
**సమాససాద ప్రతిహారభూమిమ్।**
**యోగాత్ స చాన్తః పరమాత్మసంజ్ఞం**
**దృష్ట్వా పరం జ్యోతిరుపారరామ॥ 58**

**పదవిభాగము:–** భవిష్యతః, పత్యుః, ఉమా, చ, శమ్భోః, సమాససాద, ప్రతిహార భూమిమ్, యోగాత్, సః, చ, అన్తః, పరమాత్మసంజ్ఞమ్, దృష్ట్వా, పరం జ్యోతిః, ఉపారరామ।

**అన్వయక్రమము:–** ఉమా చ భవిష్యతః పత్యుః శమ్భోః ప్రతిహారభూమిం, సమాససాద।సఃచ అన్తః పరమాత్మ సంజ్ఞం పరం జ్యోతిః దృష్ట్వా యోగాత్ ఉపారరామ।

**ప్రతిపదార్థము:–** ఉమా చ–ఉమాదేవియు, భవిష్యతః – కాగల, పత్యుః–భర్తయగు, శమ్భోః – శివునియొక్క ప్రతిహారభూమిమ్ – ద్వారదేశమును, **సమాససాద** – పొందెను, సః+చ–ఆ శివుడును, అన్తః–లోపల, పరమాత్మసంజ్ఞమ్–పరమాత్మయను పేరుగల, పరం జ్యోతిః–ముఖ్యమగు తేజస్సును, దృష్ట్వా–సాక్షాత్కారము చేసికొని, యోగాత్–యోగమునుండి, ఉపారరామ–విరమించెను.

**తాత్పర్యము :–** ఉమాదేవియు కాగల భర్తయగు శివునియొక్క ద్వారదేశమును పొందెను. ఆ శివుడును లోపల పరమాత్మయను పేరుగల పరంజ్యోతిని సాక్షాత్కారము చేసికొని యోగమునుండి విరమించెను.

**విభక్తులు/క్రియలు:–** 1) ఉమా–**ఉమా**, ఉమే, ఉమాః, ఆకారాన్త స్త్రీలింగ ఉమాశబ్దము, ప్ర.ఏ., 2) భవిష్యతః–**భవిష్యతః**, భవిష్యతోః, భవిష్యతామ్, తకారాన్త పుంలింగ భవిష్యత్ శబ్దము, ష.ఏ., 3) పత్యుః–పత్యుః, పత్యోః, పతీనామ్, ఇకారాన్త పుంలింగ పతిశబ్దము, ష.ఏ., 4) శమ్భోః–**శమ్భోః**, శమ్భ్వోః, శమ్భూనామ్, ఉకారాన్త పుంలింగ శమ్భుశబ్దము, ష.ఏ., 5) ప్రతిహారభూమిమ్ – **...భూమిమ్**, ...భూమీ, ...భూమీః, ఇకారాన్త స్త్రీలింగ ...భూమిశబ్దము, ద్వి.ఏ., 6) సమాససాద–క్రియ–లిట్, ప్రథమ పురుషైకవచనము, 7) సః–**సః**, తౌ, తే, దకారాన్తపుంలింగతచ్ఛబ్దము, ప్ర.ఏ., 8) అన్తః–**అన్తః**, అన్తేః, అన్తాః, అకారాన్త పుంలింగ అన్తశబ్దము, ప్ర.ఏ., 9) పరమాత్మసంజ్ఞమ్– **...సంజ్ఞమ్**, ...సంజ్ఞే, ...సంజ్ఞాని, అకారాన్త నపుంసకలింగ ...సంజ్ఞశబ్దము, ద్వి.ఏ. 10) పరంజ్యోతిః–**పరంజ్యోతిః** , పరంజ్యోతిషీ, పరంజ్యోతీంషి , షకారాన్త నపుంసకలింగ పరంజ్యోతిష్ శబ్దము, ద్వి.ఏ., 11) దృష్ట్వా –అవ్యయము, 12) యోగాత్–**యోగాత్**, యోగాభ్యామ్, యోగేభ్యః, అకారాన్త పుంలింగ యోగశబ్దము, పం.ఏ, 13) ఉపారరామ – క్రియ – ఉప+ఆ+రమ్+లిట్ – ప్రథమపురుషైకవచనము.





**సమాసాలు:–**

1) ప్రతిహారభూమిమ్ – ప్రతిహారస్య భూమిః (ష.త.) ప్రతిహారభూమిః, తామ్.
2) పరమాత్మసంజ్ఞమ్ – పరమః చాసౌ ఆత్మా (కర్మధా) పరమాత్మా, పరమాత్మా సంజ్ఞా యస్య (బహువ్రీహి) తత్।

**సంధులు:–** 1) పత్యుః + ఉమా – పత్యురుమా – విసర్గసంధిః।
2) చ+అన్తః – చాన్తః – సవర్ణదీర్ఘసంధిః।
3) పరంజ్యోతిః + ఉపారరామ – పరంజ్యోతిరుపారరామ – విసర్గసంధిః।

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **ఉమా** – a) ఉ భో, మా తపస్యాం కుర్వితి, 'ఉమేతి మాత్రా తపసో నిషిద్ధా పశ్చాదుమాఖ్యాం సుముఖీ జగామ' – ఇతి కుమారోక్తేః। యద్వా ఓర్హరస్య మా లక్ష్మీరివ। ఉం శివం మాతి మిమీతే వా। 'ఆతోఽనుపసర్గేతి' క, అజాదిత్వాత్ టాప్। అవతి ఊయతే వా ఉఙ్ శబ్దే, 'విభాషో తిలమాషోమేతి' నిపాతనాద్ మక్।

b) శ్లో॥ రుద్రాణీ శర్వాణీ కాలీ కాత్యాయనీ భవానీ చ।
ఆర్యామ్బికా మృడానీ హైమవతీ పార్వతీ గౌరీ॥ 15

శ్లో॥ **ఉమా** భగవతీ దుర్గా చణ్డీ దాక్షాయణీ శివా।
అపర్ణా స్యాన్మహాదేవీ గిరిజా మేనకాత్మజా॥ 16
– ఆని హలాయుధకోశము '21' నామములను పేర్కొన్నది.

c) శ్లో॥ హరస్తు కించిత్పరిలుప్తధైర్య –
శ్చన్ద్రోదయారమ్భ ఇవామ్బురాశిః।
**ఉమా**ముఖే బిమ్బఫలాధరోష్ఠే
వ్యాపారయామాస విలోచనాని ॥ – కు.సం. 3–67.

d) శ్రీ కావ్యకణ్ఠగణపతిముని విరచిత **'ఉమాసహస్రము'** ను ఇట విద్వాంసులు, అనుసంధానము చేసికొందురు గాక!

**క్రియాదర్శము:–** 1) **సమాససాద** – సమ్, ఆ – ఉపసర్గలు, షద్ల (సద్) విశరణ గత్యవసాదనేషు (1) నశించుట, 2. గమనము, 3. చంపుట) (1) అకర్మకమ్, 2,3 – సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, తుదాదిప్రకరణమ్ (6) లిట్.

రూపాలు– **సమాససాద** – సమాసేదతుః, సమాసేదుః।

2) **ఉపారరామ** – ఉప, ఆ – ఉపసర్గల, రము (క్రీడాయామ్) ఆడుట, 'వ్యాఙ్ పరిభ్యో రమః' ఇతి పరస్మైపదమ్, అకర్మకమ్, అనిట్, లిట్.

రూపాలు– **ఉపారరామ** – ఉపారేమతుః, ఉపారేముః।

**అలంకారము:–** ఇట **'సముచ్చయాలంకార'** మున్నదని చెప్పదగును.

లక్షణమ్–కా॥ తత్సిద్ధిహేతావేకస్మిన్ యత్రాన్యత్తత్కరం భవేత్ సముచ్చయోఽసౌ। (లేక) స త్వన్యో యుగపద్ యా గుణక్రియాః (కావ్యప్రకాశము).

ఒక సమయములో రెండు గుణాలు కాని, రెండు క్రియలుగాని, గుణమూ, క్రియా గాని ఏర్పడినట్లు వర్ణిస్తే అదియున్ను సముచ్చయాలంకారమే.

పార్వతీదేవి తనకు భర్త అగు శివునియొక్క తపోభూమికి చేరుట, అప్పుడే ఆ శివుడును తపస్సమాధినుండి బహిర్ముఖుడగుట అను రెండు క్రియలు – ఒకే సమయంలో ఏర్పడినట్లు వర్ణింపబడుటచే నిది 'సముచ్చయాలంకార' మగును.

---

**శ్లో॥ తతో భుజఙ్గాధిపతేః ఫణాగ్రై–**
**రధః కథంచిద్ధృతభూమిభాగః।**
**శనైః కృతప్రాణవిముక్తిరీశః**
**పర్యఙ్కబన్ధం నిబిడం బిభేద॥ 59**

**పదవిభాగము:–** తతః, భుజఙ్గాధిపతేః, ఫణాగ్రైః, అధః, కథంచిత్, ధృతభూమిభాగః శనైః, కృతప్రాణవిముక్తిః, ఈశః, పర్యఙ్కబన్ధమ్, నిబిడమ్, బిభేద॥

**అన్వయక్రమము:–** తతః భుజఙ్గాధిపతేః ఫణాగ్రైః అధః కథంచిత్ ధృతభూమిభాగః శనైః కృతప్రాణవిముక్తిః ఈశః నిబిడం పర్యఙ్కబన్ధం బిభేద।

**ప్రతిపదార్థము:–** తతః–పిమ్మట, భుజఙ్గాధిపతేః–ఆదిశేషునియొక్క, ఫణాగ్రైః–పడగల కొనలచేత, అధః–భూమిక్రింద, కథంచిత్ ధృతభూమిభాగః–కష్టముగా ధరింపబడిన భూమి భాగము గలవాడై, శనైః కృతప్రాణవిముక్తిః–నెమ్మదిగా నిఃశ్వాసముగలవాడై, ఈశః–శివుడు, నిబిడమ్–దట్టమగు, పర్యఙ్కబన్ధమ్–వీరాసనమును, బిభేద–విడచెను.

**తాత్పర్యము :–** పిమ్మట, ఆదిశేషునియొక్క పడగల కొనలచేత భూమిక్రింద కష్టముగా ధరింపబడిన భూభాగముగలవాడై నెమ్మదిగా నిశ్శ్వాసముగలవాడై శివుడు దట్టమగు వీరాసనమును విడచెను.



**పాఠాన్తరములు :–** ఫణాగ్రైః – ఫణాభిః (కర్మార్కర్).

**విభక్తులు/క్రియలు:–** 1) తతః, అధః – అవ్యయములు, 2) భుజంగాధిపతేః – **....పతేః**, ...పత్యోః, ...పతీనామ్, ఇకారాన్త పుంలింగ ...పతి శబ్దము, ష.ఏ., 3) ఫణాగ్రైః – ఫణాగ్రేణ, ఫణాగ్రాభ్యామ్, **ఫణాగ్రైః**, అకారాన్త పుంలింగ ఫణాగ్రశబ్దము, తృ.బ., 4) కథంచిత్–ధృతభూమిభాగః – **...భాగః**, ...భాగౌ, ...భాగాః, అకారాన్త పుంలింగ ...భాగ శబ్దము, ప్ర.ఏ., 5) శనైః కృత ప్రాణ విముక్తిః – **...విముక్తిః**, ...విముక్తీ, ...విముక్తయః, ఇకారాన్త పుంలింగ ...విముక్తి శబ్దము, ప్ర.ఏ., 6) ఈశః–ఈశః, ఈశౌ, ఈశాః, అకారాన్త పుంలింగ ఈశశబ్దము, ప్ర.ఏ., 7) నిబిడమ్–**నిబిడమ్**, నిబిడౌ, నిబిడాన్, అకారాన్త పుంలింగ నిబిడశబ్దము, ద్వి.ఏ., 8) పర్యఙ్కబన్ధమ్–**పర్యఙ్కబన్ధమ్**, పర్యఙ్కబన్ధౌ, పర్యఙ్కబన్ధాన్, అకారాన్త పుంలింగ పర్యఙ్కబన్ధశబ్దము, ద్వి.ఏ., 9) బిభేద–క్రియ–భిద్+ లిట్–ప్రథమపురుషైకవచనాంతః।

**సమాసాలు:–**

1) భుజంగాధిపతేః – భుజంగానామ్ అధిపతిః (ష.త.) భుజంగాధిపతిః, తస్య।

2) ఫణాగ్రైః – ఫణానామ్ అగ్రాః (ష.త.), ఫణాగ్రాః, తైః।

3) కథంచిద్ధృతభూమిభాగః – భూమేః భాగః (ష.త.) భూమిభాగః, కథంచిద్ధృతః (సుప్సుపా) కథంచిద్ధృతః భూమిభాగో యస్య (బహువ్రీహి) సః।

4) శనైః కృతప్రాణవిముక్తిః – ప్రాణానాం విముక్తిః (ష.త.) – శనైః కృతా ప్రాణవిముక్తిః యేన (బహువ్రీహి) సః।

5) పర్యఙ్కబన్ధమ్–పర్యఙ్కస్య బన్ధః (ష.త.) పర్యఙ్కబన్ధః, తమ్।

**సంధులు:–** 1) తతః+భుజఙ్గాధిపతేః – తతో భుజంగాధిపతేః – ఉత్వాదేశసంధిః

2) ఫణాగ్రైః + అధః – ఫణాగ్రైరధః – విసర్గసంధిః।

3) విముక్తిః + ఈశః – విముక్తిరీశః – విసర్గసంధిః।

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **శనైః** – అవ్యయకోషే (751)

a) క్రియామాన్ద్యమస్యార్థః। "శనైర్విద్యాశనైః కన్యాశనైః పర్వతమారుహేత్। శనైః కామశ్చ ధర్మశ్చ పంచైతాని శనైశ్శనైః" । శనైశ్చరః। శనకైః॥ శనకైః – అత్ర 'అవ్యయసర్వనామ్నామ్' (5–3–71) ఇతి టేః ప్రాక్ అకచ్ప్రత్యయః ప్రాగివీయార్థేషు।

b) శ్లో॥ ఆచమ్యోదక్పరావృత్య త్రిరాయమ్య **శనైర**సూన్।
షడృతూంశ్చ నమస్కుర్యా త్పితౄనేవ చ మంత్రవత్ ॥217(మ.)

"... మెల్లగా మూడు ప్రాణాయామాలను చేసి 'వసంతాయ నమస్తుభ్యమ్'

మొదలైన మంత్రాలతో ఆరు ఋతువులకు నమస్కరించి, పిమ్మట పితృ దేవతలకు నమస్కరించాలి."

c) ఆప్టే మహాశయుడు ఈ పదాన్ని వివరిస్తూ – ఈ శ్లోకాన్నే ఉదాహరించినాడు.

**క్రియాదర్శము:– బిభేద** – భిదిర్ (భిద్) విదారణే (ఛేదించుట) రుధాది ప్రకరణమ్ (7), సకర్మకమ్, సేట్ (ఉభయ) పరస్మైపదీ, లిట్ – ప్రథమపురుషరూపాలు.

రూపాలు– **బిభేద** – బిభిదతుః – బిభిదుః – పరస్మైపది.
**బిభేదే** – బిభిదాతే – బిభిదిరే – ఆత్మనేపది.

శ్లో॥ రూపం తదోజస్వి తదేవ వీర్యం
తదేవ నైసర్గికమున్నతత్వమ్।
న కారణాత్స్వాద్బిభేదే కుమారః
ప్రవర్తితో దీప ఇవ ప్రదీపాత్॥ – ర.వం. 5–37.

---

**శ్లో॥ తస్మై శశంస ప్రణిపత్య నన్దీ**
**శుశ్రూషయా శైలసుతాముపేతామ్।**
**ప్రవేశయామాస చ భర్తురేనాం**
**భ్రూక్షేపమాత్రానుమతప్రవేశామ్॥ 60**

**పదవిభాగము:–** తస్మై, శశంస, ప్రణిపత్య, నన్దీ, శుశ్రూషయా, శైలసుతామ్, ఉపేతామ్, ప్రవేశయామాస, చ, భర్తుః, ఏనామ్, భ్రూక్షేపమాత్రానుమతప్రవేశామ్।

**అన్వయక్రమము:–** నన్దీ తస్మై ప్రణిపత్య శుశ్రూషయా ఉపేతామ్ శైలసుతాం శశంస। భర్తుః భ్రూక్షేపమాత్రానుమతప్రవేశామ్ ఏనాం ప్రవేశయామాస చ।

**ప్రతిపదార్థము:–** నన్దీ–నందీశ్వరుడు, తస్మై–ఆ శివునికొఱకు, ప్రణిపత్య–నమస్కరించి, శుశ్రూషయా–సేవానిమిత్తముచే, ఉపేతామ్–వచ్చిన, శైలసుతామ్–పార్వతీదేవినిగూర్చి, శశంస–చెప్పెను, భర్తుః–ఏలికయొక్క, భ్రూక్షేపమాత్రా–కనుబొమతో చేయబడిన సంజ్ఞచే, అనుమతప్రవేశామ్–అంగీకరింపబడిన ప్రవేశముగల, ఏనామ్–ఈ పార్వతీదేవిని, ప్రవేశయామాస–ప్రవేశపెట్టెను.

**తాత్పర్యము :–** నందీశ్వరుడు ఆ శివునికొఱకు నమస్కరించి సేవానిమిత్తముచే వచ్చిన పార్వతీదేవినిగూర్చి చెప్పెను. ఏలిక కనుబొమతో చేయబడిన సంజ్ఞచే అంగీకరింపబడిన ప్రవేశముగల ఈ పార్వతీదేవిని ప్రవేశపెట్టెను.





**పాఠాన్తరములు :–** 1) అనుమత – అనుమిత. 2) ప్రణిపత్య–ప్రాణిపత్య.

**విభక్తులు/క్రియలు:–** 1) నన్దీ–**నన్దీ**, నన్దినౌ, నన్దినః, నకారాన్త పుంలింగ నన్దిన్ శబ్దము, ప్ర.ఏ., 2) తస్మై–**తస్మై**, తాభ్యామ్, తేభ్యః, దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము, చ.ఏ., 3) ప్రణిపత్య–ప్ర+ని+పత్+క్త్వా–ల్యబన్తము, 4) శుశ్రూషయా – **శుశ్రూషయా**, శుశ్రూషాభ్యామ్, శుశ్రూషాభిః, ఆకారాన్త స్త్రీలింగ శుశ్రూషాశబ్దము, తృ.ఏ., 5) ఉపేతామ్–**ఉపేతామ్**, ఉపేతే, ఉపేతాః, ఆకారాన్త స్త్రీలింగ ఉపేతాశబ్దము, ద్వి.ఏ., 6) శైలసుతామ్–**శైలసుతామ్**, శైలసుతే, శైలసుతాః, ఆకారాన్త స్త్రీలింగ శైలసుతా శబ్దము, ద్వి.ఏ., 7) శశంస–క్రియ–శన్స్+లిట్, ప్రథమపురుషైకవచనము, 8) భర్తుః–భర్తుః, భర్త్రోః, భర్తౄణామ్, ఋకారాన్త పుంలింగ భర్తృశబ్దము, 9) భ్రూక్షేపమాత్రానుమతప్రవేశామ్–**...ప్రవేశామ్**, ...ప్రవేశే, ...ప్రవేశాః, ఆకారాన్త స్త్రీలింగ ...ప్రవేశా శబ్దము, ద్వి.ఏ., 10) ఏనామ్ – **ఏనామ్**, ఏనే, ఏనాః, మకారాన్త స్త్రీలింగ ఇదమ్ శబ్దము, ద్వి.ఏ., 11) ప్రవేశయామాస–క్రియ–ప్ర+విశ్+ణి+అస్+లిట్–ప్రథమపురుషైకవచనము.

**సమాసాలు:–**

1) శైలసుతామ్ – శైలస్య సుతా (ష.త.) శైలసుతా, తామ్।
2) భ్రూక్షేపమాత్రానుమతప్రవేశామ్ – భ్రువః క్షేపః (ష.త.) భ్రూక్షేపః, భ్రూక్షేప ఏవ భ్రూక్షేపమాత్రమ్, భ్రూక్షేపమాత్రేణ అనుమతః (తృ.త.) ప్రవేశః, యస్యాః (బహువ్రీహి) తామ్॥

**సంధులు:–** 1) భర్తుః + ఏనామ్ – భర్తురేనామ్ – విసర్గసంధిః।

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **ఏనామ్** – అన్వాదేశే 'ద్వితీయాటౌస్స్వేనః' ఇతి ఏనాదేశః।

a) దకారాన్త స్త్రీలింగ – ఏతచ్ఛబ్దము – ఈమె.
ఏతామ్ / ఏనామ్ – ఏతే/ఏనే – ఏతాః/ఏనాః ॥

b) దకారాన్త స్త్రీలింగ – ఇదమ్ శబ్దము – ఈమె.
ఇమామ్ / ఏనామ్ – ఇమే/ఏనే – ఇమాః / ఏనాః॥

c) Properly ఏతామ్ should have been used; but the optional form is sometimes used even when there is no అన్వాదేశ as in.

1) శ్లో॥ కణ్డూయమానేన కటం కదాచిద్వన్యద్విపేనోన్మథితా త్వగస్యా।
అథైనమద్రేస్తనయా శుశోచ సేనాన్యమాలీఢమివాసురాస్త్రైః॥
– అని రఘువంశము – 2–37 శ్లోకమును ఉదాహరించినాడు– కాలే అట్లే మాఘకావ్యము 1–73 ను పేర్కొనినాడు.

2) శ్లో॥ తదేనముల్లంఘితశాసనం విధేర్విధేహి కీనాశనికేతనాతిథిమ్।
శుభేతరాచార విపక్త్రిమాపదో నిపాతనీయా హి సతామసాధవః॥

2) ఈ శ్లోకమున 'చ' సముచ్చయార్థమున ప్రయోగింపబడినదని గ్రహింతురు.

**క్రియాదర్శము:–** 1) **ప్రవేశయామాస** – ప్రోపసర్గపూర్వాకాత్ ణిజన్తాత్ 'విశ్ ప్రవేశనే' ఇతి ధాతోర్లిట్। అను ప్రయుక్తాదసధాతోః ద్వికర్మకాత్కర్తరి – పరస్మైపదే ప్రథమ పురుషైకవచనాంతః॥

రూపాలు– **ప్రవేశయామాస** – ప్రవేశయామాసతుః – ప్రవేశయామాసుః॥

2) **శశంస** – శంసు (శంస్) స్తుతౌ। (స్తుతించుట) (దుర్గతినొందుట), సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్ (1) లిట్, – ప్రథమపరుషైకవచనాంతః।

రూపాలు– **శశంస** – శశంసతుః – శశంసుః (ప్రథమ)
**శశంస** – శశంసివ – శశంసిమ (ఉత్తమ)

---

**శ్లో॥ తస్యాస్సఖీభ్యాం ప్రణిపాతపూర్వం**
**స్వహస్తలూనశ్శిశిరాత్యయస్య।**
**వ్యకీర్యత త్ర్యమ్బకపాదమూలే**
**పుష్పోచ్చయః పల్లవభఙ్గభిన్నః॥ 61**

**పదవిభాగము:–** తస్యాః, సఖీభ్యామ్, ప్రణిపాతపూర్వమ్, స్వహస్తలూనః, శిశిరాత్య–యస్య, వ్యకీర్యత, త్ర్యమ్బకపాదమూలే, పుష్పోచ్చయః పల్లవభఙ్గభిన్నః।

**అన్వయక్రమము:–** తస్యాః సఖీభ్యామ్, స్వహస్తలూనః పల్లవభఙ్గభిన్నః శిశిరాత్యయస్య పుష్పోచ్చయః త్ర్యంబకపాదమూలే ప్రణిపాతపూర్వం వ్యకీర్యత।

**ప్రతిపదార్థము:–** తస్యాః–ఆ పార్వతీదేవియొక్క, సఖీభ్యామ్–చెలికత్తెలద్వయముచేత, స్వహస్తలూనః–తమచేతులతో కోయబడిన, పల్లవభఙ్గభిన్నః–చిగుళ్ల తునియలతో ఉన్నట్టి, శిశిరాత్యయస్య–వసన్తర్తుసంబంధమగు, పుష్పోచ్చయః–పూవులగుంపు, త్ర్యమ్బకపాదమూలే – శివునిపాదసన్నిధానమున, ప్రణిపాతపూర్వమ్–నమః పూర్వకముగా, వ్యకీర్యత–చల్లబడెను.

**తాత్పర్యము :–** ఆ పార్వతీదేవియొక్క చెలికత్తెలద్వయముచేత తమ చేతులతో





కోయబడిన చిగుళ్లతునియలతో ఉన్నట్టి, వసన్తర్తుసంబంధమగు పూవులగుంపు శివపాదసన్నిధానమున నమఃపూర్వకముగ చల్లబడెను.

**పాఠాన్తరములు :–** ప్రణిపాతపూర్వం – ప్రణిపత్య పూర్వం.

**విభక్తులు/క్రియలు:–** 1) తస్యాః–**తస్యాః**, తయోః, తాసామ్, దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ష.ఏ., 2) సఖీభ్యామ్–సఖ్యా, **సఖీభ్యామ్**, సఖీభిః ఈకారాన్త స్త్రీలింగ సఖీశబ్దము, తృ.ద్వి., 3) స్వహస్తలూనః– **...లూనః**,...లూనౌ, ...లూనాః, అకారాన్త పుంలింగ లూన శబ్దము, ప్ర.ఏ., 4) పల్లవభఙ్గభిన్నః – **...భిన్నః**, ...భిన్నౌ, ...భిన్నాః, అకారాన్త పుంలింగ ...భిన్నశబ్దము, ప్ర.ఏ., 5) **శిశిరాత్యయస్య**–శిశిరాత్యయస్య, శిశిరాత్యయయోః, శిశిరాత్యయానామ్, అకారాన్త పుంలింగ శిశిరాత్యయశబ్దము, ష.ఏ., 6) పుష్పోచ్చయః – **పుష్పోచ్చయః**, పుష్పోచ్చయౌ, పుష్పోచ్చయాః, అకారాన్త పుంలింగ పుష్పోచ్చయశబ్దము, ప్ర.ఏ., 7) త్ర్యమ్బకపాదమూలే– **...మూలే**, ...మూలయోః, ...మూలేషు, అకారాన్త నపుంసకలింగ ...మూల శబ్దము, స.ఏ., 8) ప్రణిపాతపూర్వమ్ – అవ్యయము – క్రియావిశేషణము, 9) వ్యకీర్యత– వి+కౄ+కర్మణి ప్రయోగము, ప్రథమపురుషైకవచనాంతః।

**సమాసాలు:–**

1) స్వహస్తలూనః – స్వః చాసౌ హస్తః (కర్మధా) స్వహస్తః, స్వహస్తేన లూనః (తృ.త.) స్వహస్తలూనః।
2) పల్లవభఙ్గభిన్నః – పల్లవానాం భఙ్గాః (ష.త.) పల్లవభఙ్గాః, పల్లవభఙ్గైః, భిన్నః (తృ.త.) స్వహస్తలూనః।
3) శిశిరాత్యయస్య – శిశిరస్య అత్యయః (ష.త.) శిశిరాత్యయః, తస్య।
4) పుష్పోచ్చయః – పుష్పాణామ్ ఉచ్చయః (ష.త.) పుష్పోచ్చయః।
5) త్ర్యమ్బకపాదమూలే – త్రీణి అమ్బకాని యస్య (బహువ్రీహి) సః త్ర్యమ్బకః పాదయోర్మూలమ్(ష.త.) పాదమూలమ్,త్ర్యమ్బకస్య పాదమూలమ్, త్ర్యమ్బక పాదమూలమ్, తస్మిన్।
6) ప్రణిపాతపూర్వమ్ – ప్రణిపాతః పూర్వః యస్మిన్ (బహువ్రీహి) తత్ తథా స్యాత్తథా। (క్రియావిశేషణము) – కర్మణి।

**సంధులు :–** 1) తస్యాః + సఖీభ్యామ్ – తస్యాస్సఖీభ్యామ్ – విసర్గసంధిః।
2) లూనః + శిశిరా – లూనశ్శిశిరా – విసర్గసంధిః।

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **శిశిరః – త్రి** - a) శశ్ ప్లుతగతౌ + కిరచ్ ప్రత్యయేన సాధుః।
b) శీతం గుణే తద్వదర్థాః సుషీమః **శిశిరో** జడః।
తుషారః శీతలః శీతో హిమః సప్తాన్యలింగకాః॥ – ఇత్యమరః।

c) పుంలింగార్థమున – నపుంసకార్థమున – ఋతువిశేషః।

శ్లో॥ మిష్టాన్నభోజీ మధురప్రణాదీ కలత్రవిత్తాదియుతః క్షుధార్తః।
క్రోధీ సుధీశ్చారుకలేవరశ్చ యస్య ప్రసూతిః **శిశిరాభిధానే**॥
– ఇతి కోష్ఠీప్రదీపః।

అని హలాయుధకోశవ్యాఖ్య పేర్కొన్నది.

శ్లో॥ ప్రాలేయమవశ్యాయస్తుహినం **శిశిరం** హిమః తుషారం చ మిహికా
స్యాన్నీహారో...॥ (650 హలాయుధకోషః)

d) ఋతుసంహారమున – వసన్తర్తువు వర్ణన చూడదగును. అట్లే దుర్లభ విరచిత – ఋతువర్ణనను చూడగలరు.

**క్రియాదర్శము:–** **వ్యకీర్యత** – వి+కౄ+కర్మణి ప్రయోగము–లఙ్–కౄ–విక్షేపే, చురాది, ఆత్మనేపదీ, సకర్మకమ్, సేట్.

రూపాలు– **వ్యకీర్యత** – వ్యకీర్యేతామ్, వ్యకీర్యన్త.

---

**శ్లో॥ ఉమాపి నీలాలకమధ్యశోభి**
**విస్రంసయన్తీ నవకర్ణికారమ్।**
**చకార కర్ణచ్యుతపల్లవేన మూర్ధ్నా**
**ప్రణామం వృషభధ్వజాయ॥ 62**

**పదవిభాగము:–** ఉమా, అపి, నీలాలకమధ్యశోభి, విస్రంసయన్తీ, నవకర్ణికారమ్, చకార, కర్ణచ్యుతపల్లవేన, మూర్ధ్నా, ప్రణామమ్, వృషభధ్వజాయ।

**అన్వయక్రమము:–** ఉమా అపి నీలాలకమధ్యశోభి నవకర్ణికారం విస్రంసయన్తీ కర్ణచ్యుతపల్లవేన మూర్ధ్నా వృషభధ్వజాయ ప్రణామం చకార।

**ప్రతిపదార్థము:–** ఉమా+అపి–పార్వతీదేవియున్ను, నీలాలకమధ్యశోభి–నల్లని ముంగురుల మధ్య అందముగా కనబడుచున్న, నవకర్ణికారమ్ – క్రొత్త కొండగోగు పూవును, విస్రంసయన్తీ–క్రిందికి జార్చుచున్నదై, కర్ణచ్యుతపల్లవేన–చెవిసందునుంచు కొన్న చిగురుటాకుగల,మూర్ధ్నా–శిరస్సుచే, వృషభధ్వజాయ–శివునికొఱకు (వృషభమే జెండాపై గుర్తుగాగల శివునకు), ప్రణామమ్–నమస్కారమును, చకార – చేసెను.

**తాత్పర్యము:–** పార్వతీదేవియు తన నల్లని ముంగురులమధ్య అందముగా కనబడుచున్న క్రొత్త కొండగోగుపూవును క్రిందికి జార్చుచున్నదై, చెవిసందునుంచుకొన్న చిగురుటాకు గల శిరస్సుచే శివునికొఱకు నమస్కారము చేసెను.



**విభక్తులు/క్రియలు:–** 1) ఉమా–**ఉమా**, ఉమే, ఉమాః, ఆకారాన్త స్త్రీలింగ ఉమాశబ్దము, ప్ర.ఏ., 2) నీలాలకమధ్యశోభి–**...శోభి**, ...శోభినీ, ...శోభీని, ఇకారాన్త నపుంసకలింగ ...శోభిశబ్దము, ద్వి.ఏ., 3) నవకర్ణికారమ్ – ...కారమ్, ...కారే, ...కారాణి, అకారాన్త నపుంసకలింగ ...కార శబ్దము, ద్వి.ఏ., 4) విస్రంసయన్తీ – **విస్రంసయన్తీ**, విస్రంసయన్త్యౌ, విస్రంసయన్త్యః, ఈకారాన్త స్త్రీలింగ విస్రంసయన్తీ శబ్దము, ప్ర.ఏ., 5) కర్ణచ్యుతపల్లవేన– **...పల్లవేన**, ...పల్లవాభ్యామ్, ...పల్లవైః, అకారాన్త పుంలింగ ...పల్లవశబ్దము, తృ.ఏ., 6) మూర్ధ్నా – **మూర్ధ్నా**, మూర్ధభ్యామ్, మూర్ధభిః, నకారాన్త పుంలింగ మూర్ధన్ శబ్దము, తృ.ఏ., 7) వృషభధ్వజాయ–**వృషభధ్వజాయ**, వృషభధ్వజాభ్యామ్, వృషభధ్వజేభ్యః, అకారాన్త పుంలింగ వృషభధ్వజశబ్దము, చ.ఏ., 8) ప్రణామమ్ – **ప్రణామమ్**, ప్రణామౌ, ప్రణామాన్, అకారాన్త పుంలింగ ప్రణామ శబ్దము, ద్వి.ఏ., 9) చకార– క్రియ – లిట్ – ప్రథమపురుషైకవచనాంతః॥

**సమాసాలు:–**

1) నీలాలకమధ్యశోభి – నీలాశ్చ తే అలకాః నీలాలకాః, నీలాలకానాం మధ్యం నీలాలకమధ్యం (ష.త.) తస్మిన్, నీలాలకమధ్యే శోభతే తచ్ఛీలమ్ ఇతి నీలాలకమధ్యశోభి, తత్।
2) నవకర్ణికారమ్ – నవం చ తత్ కర్ణికారమ్, నవకర్ణికారం తత్।
3) కర్ణచ్యుతపల్లవేన – కర్ణాత్ చ్యుతః (పం.త.) కర్ణచ్యుతః, కర్ణచ్యుతః పల్లవః యస్య (బహువ్రీహి) సః, కర్ణచ్యుతపల్లవః, తేన।
4) వృషభధ్వజాయ – వృషభః ధ్వజః యస్య (బహువ్రీహి) సః, వృషభధ్వజః, తస్మై।

**సంధులు:–** 1) ఉమా + అపి – ఉమాపి – సవర్ణదీర్ఘసంధిః।

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **వృషభః** – a) వృష్ సేచనే + 'ఋషివృషిభ్యాం కిత్' ఇతి అభచ్ స చకిత్।
– ఉణాదిసూత్రమ్ (3–122).

b) 'యదన్యగోషు **వృషభో** వత్సానాం జనయేచ్ఛతమ్' – అని మనుస్మృతి–9.50

c) శ్లో॥ ఉక్షానడ్వాన్బలీవర్దః కకుద్మాన్**వృషభో** వృషః।
ఋషభః సౌరభేయో గౌర్వాడవేయోఽథ శాక్వరః॥ 263

–అని హలాయుధకోశము 11 నామములను పేర్కొన్నది.

d) శ్లో॥ కిం నాస్తి త్వయి సత్యమాత్యవృ**షభే** యస్మిన్ కరోమి స్పృహామ్।
(రత్నావళి 4-20).

2) **వృషభధ్వజాయ**-a) వృషభః ధ్వజః యస్య(బహువ్రీహి)సః,వృషభధ్వజాయ తస్మై.

b) శ్లో॥ అముం పురః పశ్యసి దేవదారుం
పుత్రీకృతోఽసౌ **వృషభధ్వజేన।**
యో హేమకుమ్భస్తననిస్సృతానాం
స్కన్దస్య మాతుః పయసాం రసజ్ఞః॥ - ర.వం. 2-36

"ఎదురుగానున్న దేవదారువృక్షమును వృషభధ్వజుడైన శివుడు పుత్రునిగా చేసికొనినాడు. కుమారస్వామియొక్క తల్లియగు పార్వతీదేవి, బంగారుకుండ అను తన స్తనములనుండి వెలువడిన రసఝరిని తెలిసినదీ వృక్షము."

3) మహాకవి పాల్కురికి సోమన 'వృషాధిపశతకము' ను ఇట అనుసంధానము చేసికొందురుగాక!

**క్రియాదర్శము:-** 1) **చకార** - డుకృఞ్ (కృ) (చేయుట) సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ - తనాది ప్రకరణమ్ (8), లిట్ ప్రథమపురుషరూపాలు:

రూపాలు- **చకార**, చక్రతుః, చక్రుః।

ఇట తుదాది ప్రకరణమునగల కౄ - విక్షేపే (వెదజల్లుట) - క్రియా (లిట్) రూపములను అనుసంధానము చేసికొనదగును.

రూపాలు- **చకార**, చకరతుః, చకరుః; చకరిథ, చకరథుః, చకర;
**చకార**/చకర, చకరివ, చకరిమ.

**అలంకారములు:-** అత్ర ప్రణామక్రియాయాం లాలిత్యపాదకాని విశేషణాని రత్యుద్దీపనపరతయా ప్రత్యుక్తానీతి పరికరోలంకారః। తల్లక్షణం యథా-
'ఉక్తైర్విశేషణైః సాభిప్రాయైః పరికరో మతః' - ఇతి.

---

**శ్లో॥ అనన్యభాజం పతిమాప్నుహీతి సా**
**తథ్యమేవాభిహితా భవేన।**
**న హీశ్వరవ్యాహృతయః కదాచి-**
**త్పుష్ణన్తి లోకే విపరీతమర్థమ్॥** **63**





**పదవిభాగము:-**అనన్యభాజమ్, పతిమ్, ఆప్నుహి, ఇతి, సా, తథ్యమ్, ఏవ, అభిహితా, భవేన, న, హి, ఈశ్వరవ్యాహృతయః, కదాచిత్, పుష్ణన్తి, లోకే, విపరీతమ్, అర్థమ్।

**అన్వయక్రమము:-** 'సా భవేన అనన్యభాజం పతిమ్ ఆప్నుహి' ఇతి తథ్యమ్ ఏవ అభిహితా హి ఈశ్వరవ్యాహృతయః కదాచిత్ అపి లోకే విపరీతమ్ అర్థం న పుష్ణన్తి।

**ప్రతిపదార్థము:-** సా-మ్రొక్కిన ఆ పార్వతీదేవి, భవేన-హరునిచే, అనన్యభాజమ్-ఇతర స్త్రీని కూడనట్టి, పతిమ్-పెనిమిటిని, ఆప్నుహి-పొందెదవుగాక!, ఇతి-అని, తథ్యమ్+ఏవ-నిజమే, అభిహితా-చెప్పబడెను, హి-ఏలయన, ఈశ్వరవ్యాహృతయః -మహాపురుషులమాటలు, కదాచిత్ అపి-ఎప్పుడును, లోకే-లోకమునందు, విపరీతమ్ అర్థమ్-కాని అర్థమును, న పుష్ణన్తి-బోధింపవు.

**తాత్పర్యము:-** మ్రొక్కిన ఆ పార్వతీదేవి, హరునిచే ఇతర స్త్రీని కూడనట్టి, పెనిమిటిని పొందెదవుగాక! అని నిజమే చెప్పబడెను. ఏలయన మహాపురుషులమాటలు ఎప్పుడును లోకమునందు కాని అర్థమును బోధింపవు.

**పాఠాన్తరములు:-** 1) తథ్యమేవ-భవ్యమేవ, 2) లోకే-పాకే.

**విభక్తులు/క్రియలు:-** 1) సా-సా,తే, తాః, దకారాన్త స్త్రీలింగతచ్ఛబ్దము, ప్ర.ఏ., 2) భవేన-**భవేన**, భవాభ్యామ్, భవైః, అకారాన్త పుంలింగ భవశబ్దము, తృ.ఏ., 3) అనన్యభాజమ్-**అనన్యభాజమ్**, అనన్యభాజౌ, అనన్యభాజః, జకారాన్తపుంలింగ **అనన్యభాక్** శబ్దము, ద్వి.ఏ.4) పతిమ్-**పతిమ్**, పతీ, పతీన్, ఇకారాన్త పుంలింగ పతిశబ్దము, ద్వి.ఏ., 5) ఆప్నుహి-ఆప్+లోట్-మధ్యమపురుషైకవచనాన్తః 6) ఇతి, ఏవ, హి, న - అవ్యయాలు, 7) తథ్యమ్-**తథ్యమ్**, తథ్యే, తథ్యాని, అకారాన్త నపుంసకలింగ తథ్య శబ్దము, ప్ర.ఏ., 8) అభిహితా-**అభిహితా**, అభిహితే, అభిహితాః, ఆకారాన్త స్త్రీలింగ అభిహితా శబ్దము, ప్ర.ఏ., 9) ఈశ్వరవ్యాహృతయః - ...వ్యాహృతిః, ...వ్యాహృతీ, **...వ్యాహృతయః**, ఇకారాన్త స్త్రీలింగ ...వ్యాహృతి శబ్దము, ప్ర.బ., 'క్తిన్' ప్రత్యయాన్తము - స్త్రీలింగరూపము, 10) కదాచిత్, అపి-అవ్యయాలు, 11) లోకే-**లోకే**, లోకయోః, లోకేషు, అకారాన్త పుంలింగ లోకశబ్దము, స.ఏ., 12) విపరీతమ్ - **విపరీతమ్**, విపరీతే, విపరీతాని, అకారాన్త నపుంసకలింగ విపరీతశబ్దము, ప్ర.ఏ., 13) అర్థమ్-**అర్థమ్**, అర్థౌ, అర్థాన్, అకారాన్త పుంలింగ అర్థశబ్దము, ద్వి.ఏ., 14) పుష్ణన్తి-క్రియ.

**సమాసాలు:-** 1) అనన్యభాజమ్-అన్యాం న భజతి (ఉపపదతత్పు.)ఇతి అనన్యభాక్ తమ్, అనన్యభాజమ్.

2) ఈశ్వరవ్యాహృతయః-ఈశ్వరస్య వ్యాహృతయః (ష.త.) ఈశ్వరవ్యాహృతయః

**సంధులు:-** 1) ఆప్నుహి + ఇతి - ఆప్నుహీతి - సవర్ణదీర్ఘసంధిః।

2) ఏవ + అభిహితా - ఏవాభిహితా - సవర్ణదీర్ఘసంధిః।

3) హి + ఈశ్వర - హీశ్వర - సవర్ణదీర్ఘసంధిః।

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **భవః –** పుం. a) భవత్యస్మాదితి – భూ+అపాదానే అప్ – శివః।

b) తమబ్రవీద్ **భవో**ऽసీతి తద్యదస్య తన్నామాకరోత్।
పర్జన్యస్తద్రూపమభవత్ పర్జన్యో వై భవః॥ – ఇతి శతపథ బ్రాహ్మణే.

c) **భవాయ** జలమూర్తయే నమః – ఇతి పార్థివశివలింగ పూజ ప్రయోగః।
మిగిలిన వివరములకు హలాయుధకోశవ్యాఖ్య చూడగలరు.

**క్రియాదర్శము:–** 1)**ఆప్నుహి**–ఆప్ల (ఆప్) వ్యాప్తౌ (వ్యాపించుట) స్వాది ప్రకరణమ్(5) సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లోట్ – మధ్యమపురుషైకవచనాంతః।

రూపాలు– **ఆప్నుహి/ఆప్నుతాత్**, ఆప్నుతమ్, ఆప్నుత।

2) **పుష్ణన్తి** – పుష (పుష్) పుష్టౌ (పుష్టినొందుట) క్ర్యాదిప్రకరణమ్(9), సేట్, పరస్మైపదీ బలపడుట–అకర్మకమ్(2)కాపాడుట,సకర్మకమ్,లట్–ప్రథమపురుషబహువచనాంతః

రూపాలు– పుష్ణాతి, పుష్ణీతః, **పుష్ణన్తి** ।

**అలంకారములు:–** ఇట 'అర్థాంతరన్యాసాలంకార' మున్నదని చెప్పదగును. ఇందు సామాన్యముచే విశేషము సమర్థింపబడినది. అన్వయము – సరళము.

---

**అవతారికా:–** హరబద్ధలక్ష్యేణ కామేన శరసన్ధానమాహ – శివునిపై గురిపెట్టి కామునిచే బాణము విడుచుట చెప్పుచున్నాడు.

**శ్లో॥ కామస్తు బాణావసరం ప్రతీక్ష్య**
**పతఙ్గవద్వహ్నిముఖం వివిక్షుః।**
**ఉమాసమక్షం హరబద్ధలక్ష్య–**
**శ్శరాసనజ్యాం ముహురామమర్శ॥ 64**

**పదవిభాగము:–** కామః, తు, బాణావసరమ్, ప్రతీక్ష్య, పతఙ్గవత్, వహ్నిముఖమ్, వివిక్షుః, ఉమాసమక్షమ్, హరబద్ధలక్ష్యః, శరాసనజ్యామ్, ముహుః, ఆమమర్శ।

**అన్వయక్రమము:–** కామః తు బాణావసరం ప్రతీక్ష్య పతఙ్గవత్ వహ్నిముఖం వివిక్షుః ఉమాసమక్షం హరబద్ధలక్ష్యః శరాసనజ్యాం ముహుః, ఆమమర్శ।

**ప్రతిపదార్థము:–** కామః+తు–మన్మథుడును, బాణావసరమ్–బాణమును వేయుటకు సమయమును, ప్రతీక్ష్య–చూచి, పతఙ్గవత్–మిడుతవలెనే, వహ్నిముఖమ్–అగ్ని





నోటిని, వివిక్షుః–ప్రవేశించు నిచ్ఛగలవాడై, ఉమాసమక్షమ్–పార్వతీదేవిదగ్గర, హరబద్ధలక్ష్యః–శివునిమీదపెట్టబడిన గుఱికలవాడై, శరాసనజ్యామ్–వింటినారిని, ముహుః–మాటిమాటికి, ఆమమర్శ–స్పృశించెను.

**తాత్పర్యము :–** మన్మథుడును బాణమును వేయుటకు సమయమును చూచి మిడత వలెనే అగ్నినోటిని ప్రవేశించు నిచ్ఛగలవాడై పార్వతీదేవిదగ్గర ఉండగనే, శివుని మీద పెట్టబడిన గుఱికలవాడై వింటినారిని పలుమార్లు స్పృశించెను.

**పాఠాన్తరములు:–** లక్ష్యః –లక్షః

**విభక్తులు/క్రియలు:–** 1) కామః – కామః, కామౌ, కామాః, అకారాన్త పుంలింగ కామశబ్దము, ప్ర.ఏ., 2) బాణావసరమ్–**బాణావసరమ్**, బాణావసరౌ, బాణావసరాన్, అకారాన్త పుంలింగ బాణావసర శబ్దము, ద్వి.ఏ., 3) ప్రతీక్ష్య – ప్రతి+ఈక్+క్త్వా – ల్యబన్తము, 4) పతఙ్గవత్–వత్ప్రత్యయాన్తము – తద్ధితాన్తావ్యయము, 5) వహ్నిముఖమ్–**వహ్నిముఖమ్**, వహ్నిముఖే, వహ్నిముఖాని, అకారాన్త పుంలింగ వహ్నిముఖశబ్దము, ద్వి.ఏ., 6) వివిక్షుః –ప్రవేష్టుమిచ్ఛుః విశతే సన్నన్తాదుప్రత్యయః, ప్ర.ఏ., వివిక్షుః వివిక్షూ, వివిక్షవః, ఉకారాన్తపుంలింగ వివిక్షుశబ్దము, 7) ఉమాసమక్షమ్–**ఉమాసమక్షమ్**, ఉమాసమక్షే, ఉమాసమక్షాణి, అకారాన్త ఉమాసమక్షశబ్దము, ప్ర.ఏ., 8) హరబద్ధలక్ష్యః–**హరబద్ధలక్ష్యః**, హరబద్ధలక్ష్యౌ, హరబద్ధలక్ష్యాః, అకారాన్త పుంలింగ హరబద్ధలక్ష్యశబ్దము, ప్ర.ఏ., 9) శరాసనజ్యామ్–**శరాసనజ్యామ్**, శరాసనజ్యే, శరాసనజ్యాః, ఆకారాన్త స్త్రీలింగ శరాసనజ్యాశబ్దము,ద్వి.ఏ., 10) ముహుః–అవ్యయము, 11) ఆమమర్శ–క్రియ–ఆ+మృశ్+లిట్, ప్రథమపురుషైకవచనాన్తః।

**సమాసాలు:–**

1) బాణావసరమ్ – బాణస్య అవసరః (ష.త.) బాణావసరః, తమ్।
2) వహ్నిముఖమ్ – వహ్నేః ముఖమ్ (ష.త.)
3) ఉమాసమక్షమ్ – ఉమాయాః సమక్షమ్ (ష.త.)
4) బద్ధలక్ష్యః – బద్ధే లక్ష్యం యేన (బహువ్రీహి) సః।
5) శరాసనజ్యామ్ – శరా అస్యన్తే అనేన (ఉపపదతత్పు.) ఇతి శరాసనమ్, శరాసనస్య జ్యా (ష.త.),తామ్।

**సంధులు:–**1) కామః + తు – కామస్తు – విసర్గసంధిః।
2) పతఙ్గవత్ + వహ్ని – పతఙ్గవద్వహ్ని – జశ్త్వసంధిః।
3) హరబద్ధలక్ష్యః+శరాసన – హరబద్ధలక్ష్యశ్శరాసన – విసర్గసంధిః।

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **జ్యా (స్త్రీ) –** a) జ్యా+'అన్యేభ్యోऽపీతి' డతతష్టాప్।

b) శ్లో॥ జగ్రాహ బలమాస్థాయ **జ్యయా** చ యుయుజే ధనుః।
– ఇతి మహాభారతే (1-226-20)

c) శ్లో॥ బాణాసనం ద్రుణా స్యాన్మౌర్వీ **జ్యా** సిఞ్జనీ గుణో జీవా॥ 464
– అని హలాయుధకోశము '7' నామములను పేర్కొన్నది.
ఈ పద ప్రయోగమును చూడండి.

d) శ్లో॥ తతః ప్రకోష్ఠే హరిచన్దనాఙ్కితే
ప్రమథ్యమానార్ణవధీరనాదినీమ్।
రఘుః శశాఙ్కార్ధముఖేన పత్త్రిణా
**శరాసనజ్యామ**లునాద్బిడౌజసః॥ – రఘువంశమ్ 3-59

అంతట రఘుమహారాజు దేవేంద్రునియొక్క వింటి త్రాడును నొక యర్ధచంద్ర బాణముచే తెగవేసెను.

e) అభిజ్ఞానశాకున్తలమునందలి ఈ శబ్దప్రయోగమును చూడగలరు.

శ్లో॥ గాహన్తాం మహిషాః నిపానసలిలం శృంగైర్ముహుస్తాడితం
ఛాయాబద్ధకదంబకం మృగకులం రోమంథమభ్యస్యతు।
విస్రబ్ధం క్రియతాం వరాహతతిభిర్ముస్తాక్షతిః పల్వలే
విశ్రామం లభతామిదం చ శిథిల**జ్యా**బంధమస్మద్ధనుః॥ (2-20)

"... ఈ మాయొక్క ధనుస్సు సడలింపబడిన అల్లెత్రాటియొక్క బంధము కల్గునట్లుగా విశ్రాన్తిని చెందనిమ్ము."

2. 'పతఙ్గవద్వహ్నిముఖం వివిక్షుః' – అని ప్రయోగించుటచే **'కామదహనము'** సూచితము.

**క్రియాదర్శము:–** **ఆమమర్శ** – ఆ – ఉపసర్గ, మృశ(మృశ్) ఆమర్శనే (తాకుట), తుదాది ప్రకరణమ్ (6), సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లిట్, ప్రథమ పురుషైక వచనాంతః।

రూపాలు – **మమర్శ** – మమృశతుః, మమృశుః।

---

**శ్లో॥ అథోపనిన్యే గిరిశాయ గౌరీ**
**తపస్వినే తామ్రరుచా కరేణ।**



**విశోషితాం భానుమతో మయూఖై –**
**ర్మన్దాకినీపుష్కరబీజమాలామ్॥ 65**

**పదవిభాగము:–** అథ, ఉపనిన్యే, గిరిశాయ, గౌరీ, తపస్వినీ, తామ్రరుచా, కరేణ, విశోషితామ్, భానుమతః, మయూఖైః, మన్దాకినీపుష్కరబీజమాలామ్।

**అన్వయక్రమము:–** అథ గౌరీ తపస్వినే గిరిశాయ తామ్రరుచా కరేణ భానుమతః మయూఖైః విశోషితాం మన్దాకినీపుష్కరబీజమాలామ్ ఉపనిన్యే।

**ప్రతిపదార్థము:–** అథ–పిమ్మట, గౌరీ–పార్వతీదేవి, తపస్వినే–తపశ్శాలియగు, గిరిశాయ–శివునికొఱకు, తామ్రరుచా–ఎఱ్ఱనికాంతిగల, కరేణ–హస్తముచేత, భానుమతః–సూర్యునియొక్క, మయూఖైః–కిరణములచే, విశోషితామ్–ఎండింప బడిన, మన్దాకినీ–పుష్కర–బీజమాలామ్–గంగానదితామరపూలగింజలమాలికను, ఉపనిన్యే–సమర్పించెను.

**తాత్పర్యము :–** పిమ్మట, పార్వతీదేవి తపఃశాలియగు శివునికొఱకు ఎఱ్ఱని కాంతిగల హస్తముచేత సూర్యకిరణములచే ఎండింపబడిన గంగానదితామరపూలగింజల మాలికను సమర్పించెను.

**విభక్తులు/క్రియలు:–** 1) అథ–అవ్యయము, 2) గౌరీ–**గౌరీ**, గౌర్యౌ, గౌర్యః, ఈకారాన్త స్త్రీలింగ గౌరీశబ్దము, ప్ర.ఏ., 3) తపస్వినే–**తపస్వినే**, తపస్విభ్యామ్, తపస్విభ్యః, నకారాన్త పుంలింగ తపస్విన్ శబ్దము, చ.ఏ., 4) గిరిశాయ–**గిరిశాయ**, గిరిశాభ్యామ్, గిరిశేభ్యః, అకారాన్త పుంలింగ గిరశశబ్దము, చ.ఏ., 5) తామ్రరుచా–తామ్రరుచా, తామ్రరుగ్భ్యామ్, తామ్రరుగ్భిః, చకారాన్త పుంలింగ తామ్రరుక్ శబ్దము, తృ.ఏ., 6) కరేణ–**కరేణ**, కరాభ్యామ్, కరైః – అకారాన్త పుంలింగ కరశబ్దము, తృ.ఏ., 7) భానుమతః–**భానుమతః**, భానుమతోః, భానుమతామ్, తకారాన్త పుంలింగ భానుమత్ శబ్దము, ష.ఏ., 8) మయూఖైః–మయూఖేన, మయూఖాభ్యామ్–**మయూఖైః**, అకారాన్త పుంలింగ మయూఖశబ్దము, తృ.బ., 9) విశోషితామ్–**విశోషితామ్**, విశోషితే, విశోషితాః, ఆకార్తా స్త్రీలింగ విశోషితాశబ్దము, ద్వి.ఏ., 10) మన్దాకినీపుష్కరబీజమాలామ్–**...మాలామ్**, ...మాలే, ...మాలాః, ఆకారాన్త స్త్రీలింగ ....మాలా శబ్దము, ద్వి.ఏ., 11) ఉపనిన్యే–క్రియ–ఉప+నీ+లిట్ – ప్రథమపురుషైకవచనాంతః।

**సమాసాలు:–**

1) గిరిశాయ – గిరౌ శేతే (ఉపపదతత్పు.) ఇతి గిరశః, తస్మై।
2) తామ్రరుచా – తామ్రస్య రుగివ రుక్ యస్య (ఉపమాన పూర్వపదబహువ్రీహి), సః, తేన।
3) మన్దాకినీపుష్కరబీజమాలామ్ – మన్దాకిన్యాః పుష్కరాణి (ష.త.) మన్దాకినీ

పుష్కరాణి మన్దాకినీపుష్కరాణాం బీజాని (ష.త.), మన్దాకినీపుష్కరబీజాని, మన్దాకినీపుష్కరబీజానాం మాలా (ష.త.), తామ్।

**సంధులు:–**1) అథ + ఉపనిన్యే – అథోపనిన్యే – గుణసన్ధిః

2) భానుమతః + మయూఖైః – భానుమతో మయూఖైః – ఉత్వాదేశసన్ధిః।

3) మయూఖైః + మన్దాకినీ – మయూఖైర్మన్దాకినీ – విసర్గసన్ధిః।

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **మయూఖః (పుం) –** a) మాపయన్ గగనం ప్రమాణయన్ ఓఖతి గచ్ఛతీతి। పృషోదరాదిః । యద్వా మాతి పరిమాతీవ, మా+'మాజ ఊఖో మయ చ' ఇతి ఊఖ మయాదేశశ్చ ।

b) శ్లో॥ వ్యసృజచ్ఛతధా రాజన్ । **మయూఖా**నివ భాస్కరః॥
– ఇతి మహాభారతే (3–39–43)

c) శ్లో॥ తవ కుసుమశరత్వం శీతరశ్మిత్వమిందోః
ద్వయమిదమయథార్థం దృశ్యతే మద్విధేషు।
విసృజతి హిమగర్భైరగ్నిమిందు**ర్మయూఖైః**
త్వమపి కుసుమబాణాన్ వజ్రసారీకరోషి॥
– అభిజ్ఞానశాకున్తలమ్ – తృతీయాంకః–4

"…. చంద్రుడు మంచులోపలగల కిరణములతో నిప్పును వెడలుగ్రక్కుచున్నాడు…"

d) శ్లో॥ మరకతమయమేదినీషు భానో –
స్తరువిటపాన్తరపాతినో **మయూఖాః**।
అవనతశితికణ్ఠకణ్ఠలక్ష్మీ –
మిహ దధతి స్ఫురితాణురేణుజాలాః॥ – శిశుపాలవధే 4–55

e) శ్లో॥ రోచిః శోచిరభీశుః ప్రద్యోతగభస్తిరశ్మిఘృణికిరణాః।
రుచిరుగ్దీధితిదీప్తిద్యుతిప్రభాభావిభాభాసః॥ 38

శ్లో॥ ఉస్రధామవసుకేతుమరీచి ప్రగ్రహోపధృతివిప్ష్మి**మయూఖాః**
అంశుభానుకరపాదవిరోకా గావ ఇత్యభిహితాస్తు సమానాః॥
– అని హలాయుధకోశము '32' నామములను పేర్కొన్నది.





**క్రియాదర్శము:– ఉపనిన్యే** – ఉప – ఉపసర్గ, ణీఙ్(నీ) ప్రాపణే (తీసికొనివెళ్లుట), సకర్మకమ్, అకర్మకమ్ (ఉభయ) ఆత్మనేపదీ, లిట్, ప్రథమపురుషైకవచనాంతః, భ్వాదిప్రకరణమ్(1).

రూపాలు – **ఉపనిన్యే** – ఉపనిన్యాతే, ఉపనిన్యిరే.

---

**శ్లో॥ ప్రతిగ్రహీతుం ప్రణయిప్రియత్వాత్**
**త్రిలోచనస్తాముపచక్రమే చ।**
**సంమోహనం నామ చ పుష్పధన్వా**
**ధనుష్యమోఘం సమధత్త బాణమ్॥ 66**

**పదవిభాగము:–** ప్రతిగ్రహీతుమ్, ప్రణయిప్రియత్వాత్, త్రిలోచనః, తామ్, ఉపచక్రమే, చ, సంమోహనమ్, నామ, చ, పుష్పధన్వా, ధనుష్యమోఘమ్, సమధత్త, బాణమ్।

**అన్వయక్రమము:–** త్రిలోచనః చ ప్రణయిప్రియత్వాత్ తామ్ ప్రతిగ్రహీతుమ్ ఉపచక్రమే। పుష్పధన్వా చ సమ్మోహనం నామ అమోఘం బాణం ధనుషి సమధత్త।

**ప్రతిపదార్థము:–** త్రిలోచనః+చ – శివుడును, ప్రణయిప్రియత్వాత్–అర్థించువారి కిష్టుడగుటవలన, తామ్–ఆ (తామర గింజలతో నేర్పాటుచేసిన జప) మాలికను, ప్రతిగ్రహీతుమ్–గైకొనుటకు, ఉపచక్రమే–అంగీకరించెను, పుష్పధన్వా+చ–మన్మథుడును, సమ్మోహనమ్+నామ–సమ్మోహమను ప్రసిద్ధిగల, అమోఘమ్–వ్యర్థముగాని, బాణమ్–అమ్మును, ధనుషి–వింటియందు, సమధత్త–కూర్చెను.

**తాత్పర్యము :–** శివుడును అర్థించువారి కిష్టుడగుటవలన ఆ మాలికను గైకొనుట కంగీకరించెను. మన్మథుడును సమ్మోహమను ప్రసిద్ధిగల వ్యర్థముగాని అమ్మును వింటియందు కూర్చెను.

**విభక్తులు/క్రియలు:–** 1) త్రిలోచనః–**త్రిలోచనః**, త్రిలోచనౌ, త్రిలోచనాః – అకారాన్త పుంలింగ త్రిలోచనశబ్దము, ప్ర.ఏ., 2) ప్రణయిప్రియత్వాత్–**ప్రణయిప్రియత్వాత్**, ప్రణయిప్రియత్వాభ్యామ్, ప్రణయి ప్రియత్వేభ్యః, అకారాన్త నపుంసకలింగ ప్రణయిప్రియత్వశబ్దము, పం.ఏ., 3) తామ్–**తామ్**, తే, తాః, దకారాన్త స్త్రీలింగతచ్ఛబ్దము, ద్వి.ఏ., 4) ప్రతిగ్రహీతుమ్–అవ్యయము, 5) ఉపచక్రమే–క్రియ–ఉప–క్రమ్+లిట్–ప్రథమపురుషైకవచనము, 6) పుష్పధన్వా–**పుష్పధన్వా**, పుష్పధన్వానౌ, పుష్పధన్వానః నకారాన్త పుంలింగ పుష్పధన్వన్ శబ్దము, ప్ర.ఏ., 7) సమ్మోహనమ్–**సమ్మోహనమ్**, సమ్మోహనౌ, సమ్మోహనాన్, అకారాన్త పుంలింగ సమ్మోహనశబ్దము, ద్వి.ఏ., 8) అమోఘమ్–**అమోఘమ్**, అమోఘౌ, అమోఘాన్, అకారాన్త పుంలింగ అమోఘశబ్దము, ద్వి.ఏ., 9) బాణమ్–**బాణమ్**, బాణౌ, బాణాన్,

అకారాన్త పుంలింగ బాణశబ్దము, ద్వి.ఏ., 10) ధనుషి- **ధనుషి**, ధనుషోః, ధనుక్షు(ష్షు), షకారాన్త పుంలిగ ధనుష్శబ్దము, స.ఏ., 11) సమధత్త-సమ్+ధా+లఙ్ ప్రథమపురుషైకవచనము, 12) నామ- అవ్యయము.

**సమాసాలు:-**

1) త్రిలోచనః - త్రీణి లోచనాని యస్య (బహువ్రీహి) సః।

2) ప్రణయిప్రియత్వాత్- ప్రణయినాం ప్రియః (ష.త.) ప్రణయిప్రియః, తస్య భావః ప్రణయిప్రియత్వమ్, తస్మాత్।

3) పుష్పధన్వా - పుష్పం ధనుః యస్య (బహువ్రీహి) సః।

4) అమోఘమ్ - న మోఘః (నఞ్ తత్పు.) అమోఘః, తమ్।

**సంధులు:-**

1) త్రిలోచనః + తామ్ - త్రిలోచనస్తామ్- విసర్గసంధిః।

2) ధనుషి + అమోఘమ్ - ధనుష్యమోఘమ్ - యణాదేశసంధిః।

**పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణాలు-కావ్యప్రయోగాలు:-**

1) **సంమోహనః-** a) మన్మథస్య పంచ బాణా యథా-

శ్లో॥ ద్రావణః క్షోభణశ్చైవ వశీకరణ ఇత్యపి।
ఆకర్షణశ్చ కామస్య బాణః **సమ్మోహనో**ఽ పరః॥ ఇతి।

1) ద్రావణము, 2) క్షోభణము, 3) వశీకరణము, 4) ఆకర్షణము, 5) **సమ్మోహనము** అనునవి ఐదును మన్మథుని బాణములు.

b) సమ్మోహ్యన్తే జనాః - అనేనేతి సంమోహనమ్।

2. a) అమోఘ శబ్దప్రయోగమున - మన్మథుడు తలపెట్టిన దేవేంద్రుని కార్యము సఫలమని సూచితము.

**క్రియాదర్శము:-** 1) **ఉపచక్రమే** - ఉప - ఉపసర్గ, క్రము(క్రమ్) పాదవిక్షేపే, సకర్మకమ్, సేట్, ఉప(క్రమ్) - ప్రారంభించుట, భ్వాదిప్రకరణమ్ (1) - ఆత్మనేపదీ.

లిట్ రూపాలు (ప్రథమ) - **చక్రమే**, చక్రమాతే, చక్రమిరే.

2) **సమధత్త** - సమ్ - ఉపసర్గ, అధత్త - డుధాఞ్(ధా), ధారణపోషణయోః (ధరించుట, పోషించుట), సకర్మకమ్, అనిట్, (ఉభయ) ఆత్మనేపదీ, లఙ్, ప్రథమ పురుషరూపాలు.





రూపాలు - **అధత్త**, అదధాతామ్, అదధత।

**అలంకారములు:-** ఇట **'సముచ్చయాలంకార'** మున్నదని చెప్పదగును.

లక్షణము - పదముల అర్థములకు ఒకే కాలమున ఒకేచోట అన్వయము, కూర్చుట సముచ్చయము.

1) శివునకు-పార్వతీదేవి ఎండించిన తామరగింజలతోకూర్చిన మాలికను సమర్పించుట. 2) మన్మథుడు శివునిపై ధనుస్సున బాణమును సంధించుటయు చెప్పబడుటచే నిది 'సముచ్చయాలంకార' మని చెప్పబడినది.

---

**అవతారికా:-** శివుడు ఇంచుక ఇంద్రియ వికారమునకు లోనగుటను చెప్పుచున్నాడు.

**శ్లో॥ హరస్తు కిఞ్చిత్పరిలుప్తధైర్య-**
**శ్చన్ద్రోదయారమ్భ ఇవామ్బురాశిః।**
**ఉమాముఖే బిమ్బఫలాధరోష్ఠే**
**వ్యాపారయామాస విలోచనాని॥ 67**

**పదవిభాగము:-** హరః, తు, కిఞ్చిత్, పరిలుప్తధైర్యః, చన్ద్రోదయారమ్భే, ఇవ, అంబురాశిః, ఉమాముఖే, బింబఫలాధరోష్ఠే, వ్యాపారయామాస, విలోచనాని।

**అన్వయక్రమము:-** హరస్తు చన్ద్రోదయారమ్భే అమ్బురాశిః ఇవ కించిత్ పరిలుప్తధైర్యః బింబఫలాధరోష్ఠే ఉమాముఖే విలోచనాని వ్యాపారయామాస।

**ప్రతిపదార్థము:-** హరః+తు - శివుడును, చన్ద్రోదయారమ్భే-చంద్రోదయకాలమునందు, అమ్బురాశిః+ఇవ-సముద్రుడువలె, కించిత్-ఇంచుక, పరిలుప్తధైర్యః-ధైర్యగుణము తగ్గినవాడై, బింబఫలాధరోష్ఠే-దొండపండువంటి ఎఱ్ఱని పెదవిగల, ఉమాముఖే-పార్వతీదేవివోమునందు, విలోచనాని-(మూడు) కన్నులను, వ్యాపారయామాస-ప్రసరింపజేసెను.

**తాత్పర్యము :-** శివుడును చంద్రోదయకాలమునందు సముద్రునివలె ఇంచుక ధైర్యగుణము తగ్గినవాడై దొండపండువంటి ఎఱ్ఱని పెదవిగల పార్వతీదేవి మోమునందు (తన మూడు) కన్నులను ప్రసరింపజేసెను.

**విభక్తులు/క్రియలు:-** 1) హరః-**హరః**, హరౌ, హరాః, అకారాన్త పుంలింగ హరశబ్దము, ప్ర.ఏ., 2) తు, ఇవ-అవ్యయములు, 3) చన్ద్రోదయారమ్భే-**...ఆరమ్భే**, ...ఆరమ్భయోః, ...ఆరమ్భేషు, అకారాన్త

పుంలింగ ..ఆరమ్భశబ్దము, స.ఏ., 4) అమ్బురాశిః – **అమ్బురాశిః**, అమ్బురాశీ, అమ్బురాశయః ఇకారాన్త పుంలింగ అమ్బురాశి శబ్దము, ప్ర.ఏ., 5) కించిత్–అవ్యయము, 6) పరిలుప్తధైర్యః– **పరిలుప్తధైర్యః**, పరిపుల్తధైర్యౌ, పరిలుప్తధైర్యాః, అకారాన్త పుంలింగ పరిలుప్తధైర్యశబ్దము, ప్ర.ఏ., 7) బింబఫలాధరోష్ఠే–**....ఓష్ఠే**, ...ఓష్ఠయోః, ....ఓష్ఠేషు, అకారాన్త నపుంసకలింగ బింబఫలాధరోష్ఠ శబ్దము, స.ఏ., 8) ఉమాముఖే–**ఉమాముఖే**, ఉమాముఖయోః, ఉమాముఖేషు, అకారాన్త నపుంసకలింగ ఉమాముఖశబ్దము, స.ఏ., 9) విలోచనాని – విలోచనమ్, విలోచనే, **విలోచనాని**, అకారాన్త నపుంసక లింగ విలోచనశబ్దము, ద్వి.బ., 10) వ్యాపారయామాస–వి+ఆ+పృ+ణి+అస్+లిట్–ప్రథమపురుషైక వచనము.

**సమాసాలు:–**

1) చన్ద్రోదయారమ్భే–చన్ద్రస్య ఉదయః (ష.త.) చన్ద్రోదయః, చన్ద్రోదయస్య, ఆరమ్భః (ష.త.) చన్ద్రోదయారమ్భః, తస్మిన్।

2) అమ్బురాశిః – అంబూనాం రాశిః (ష.త.)

3) పరిలుప్తధైర్యః – పరిలుప్తం ధైర్యం యస్య (బహువ్రీహి) సః।

4) బింబఫలాధరోష్ఠే – బింబఫలమివ అధరోష్ఠః యస్య తత్ (బహువ్రీహి), బింబఫలాధరోష్ఠమ్ తస్మిన్ బింబఫలాధరోష్ఠే।

5) ఉమాముఖే – ఉమాయాః ముఖమ్ (ష.త.) ఉమాముఖమ్, తస్మిన్।

6) విలోచనాని – విశిష్టాని లోచనాని విలోచనాని తాని।

**సంధులు:–**

1) హరః + తు – హరస్తు – విసర్గసంధిః।

2) ధైర్యః+చంద్ర – ధైర్యశ్చంద్ర – విసర్గసంధిః।

3) చంద్రోదయారమ్భే+ఇవ – చంద్రోదయారమ్భ ఇవ – యవలోపః।

4) ఇవ+అమ్బురాశిః – ఇవామ్బురాశిః – సవర్ణదీర్ఘసంధిః।

**యవలోపః – లోపః శాకల్యస్య (సూ.8.3.19)** – అకారము పూర్వమందుగల పదాంతమందున్న యకారవకారములకు అచ్చులుకాని, మృదుహల్లులుగాని పరముగా నున్నప్పుడు లోపము వికల్పముగా వచ్చును.

1) చంద్రోదయారమ్భే + ఇవ – అయాదేశము

2) చంద్రోదయారమ్భయ్ + ఇవ – యలోపము

3) చంద్రోదయారమ్భ + ఇవ – లోపమురానిపక్షమున చంద్రోదయారమ్భయివ।





**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **అమ్బు** (నపుంసకలింము) – a) అబి శబ్దే, ఉణ్.

b) శ్లో॥ భుక్తామృణాలపటలీ భవతా నిపీతాన్య**మ్బూని।**
యత్ర నలినాని నిషేవితాని – ఇతి భామినీవిలాసే॥

c) 'అమ్బుజమమ్బుని జాతం క్వచిదపి న జాయతేఽమ్బుజా**దమ్బు**' –ఇత్యుద్భటః

d) 'గంగామ్బు సిత**మమ్బు** యామునమ్' – ఇతి కావ్యప్రకాశే।

e) శ్లో॥ ఆపస్తోయం ఘనరసపయః పుష్కరం మేఘపుష్పం
కం పానీయం సలిలముదకం వారి వాః శమ్బరఞ్చ।
అర్ణః పాథః కుశజలవనం క్షీరమమ్భోఽ**మ్బు** నీరం
ప్రోక్తం ప్రాజ్ఞైర్భువనమమృతం జీవనీయం దకఞ్చ॥ 648
– అని హలాయుధకోశము '26' నామములను పేర్కొన్నది.

f) **అంబురాశిః** (సముద్రః) రఘువంశము 6–57 న గల ఈ పదప్రయోగమును చూడగలరు.

శ్లో॥ అనేన సాకం విరహోంబురాశేః
తీరేషు తాళీవనమర్మరేషు।
ద్వీపాంతరానీతలవంగపుష్పైః
అపాకృతస్వేదలవా మరుద్భిః॥

"…. మర్మర ధ్వనులు చేయుచుండెడి సముద్రముయొక్క గట్టులయందు…"

**క్రియాదర్శము:– వ్యాపారయామాస** – వి+ఆ+పృ+ణి+అస్+లిట్ ప్రథమపురుషైక వచనాంతః।

రూపాలు – **వ్యాపారయామాస**, వ్యాపారయామాసతుః, వ్యాపారయామాసుః।

శ్లో॥ కశ్చిద్యథాభాగమవస్థితేఽపి
స్వసన్నివేశాద్వ్యతిలంఘనీవ।
రత్నాంశుగర్భాంగులిరంధ్రమేకం
**వ్యాపారయామాస** కరం కిరీటే॥ – రఘువంశము 6–19.

**అలంకారములు:–** ఇట **'ఉపమాలంకార'** మున్నదని చెప్పదగును.

'ఇవామ్బురాశిః' – 'సముద్రునివలె' అనుచోట సాదృశ్యము చెప్పబడుటచే నిట 'ఉపమాలంకార'ము గలదని చెప్పదగును. లక్షణము పూర్వము చెప్పబడినది.

–––

**శ్లో॥ వివృణ్వతీ శైలసుతాపి భావ-**
**మఙ్గైస్స్ఫురద్బాలకదమ్బకల్పైః।**
**సాచీకృతా చారుతరేణ తస్థౌ**
**ముఖేన పర్యస్తవిలోచనేన॥ 68**

**పదవిభాగము:–** వివృణ్వతీ, శైలసుతా, అపి, భావమ్, అఙ్గైః, స్ఫురత్+బాలకదమ్బ కల్పైః, సాచీకృతా, చారుతరేణ, తస్థౌ, ముఖేన, పర్యస్తవిలోచనేన।

**అన్వయక్రమము:–** శైలసుతా అపి స్ఫురద్బాలకదమ్బకల్పైః అఙ్గైః భావం వివృణ్వతీ చారుతరేణ పర్యస్తవిలోచనేన ముఖేన సాచీకృతా తస్థౌ।

**ప్రతిపదార్థము:–** శైలసుతా+అపి – పార్వతీదేవియును, స్ఫురత్+బాలకదమ్బకల్పైః –వికసించిన క్రొత్త కడిమితో సమానములగు, అఙ్గైః – అవయవములతో, భావమ్ – 'రతి' అను పేరుగల శృంగారభావమును, వివృణ్వతీ – తెలియజేయుచు, చారుతరేణ–మిక్కిలి సుందరమగు, పర్యస్తవిలోచనేన–సిగ్గుచే బెదరిన కనులుగల, ముఖేన–మోముతో, సాచీకృతా–అడ్డుగా చేయబడినదై, తస్థౌ–ఉండెను.

**తాత్పర్యము :–** పార్వతీదేవియును వికసించిన క్రొత్త కడిమితో సమానములగు అవయవములతో 'రతి' అను పేరుగల శృంగారభావమును తెలియజేయుచు మిక్కిలి సుందరమగు సిగ్గుచే బెదరిన కన్నులుగల మోముతో అడ్డుగా చేయబడినదై ఉండెను.

**పాఠాన్తరములు :–** స్ఫురత్ – కుచత్ (కర్మార్కర్ ఎడిషన్)

**విభక్తులు/క్రియలు:–** 1) శైలసుతా–**శైలసుతా**, శైలసుతే, శైలసుతాః, ఆకారాన్త స్త్రీలింగ శైలసుతా శబ్దము, ప్ర.ఏ., 2) అపి–అవ్యయము, 3) స్ఫుర....కల్పైః–...కల్పేన, ....కల్పాభ్యామ్, **...కల్పైః**, అకారాన్త నపుంసకలింగ ...కల్ప శబ్దము, తృ.బ., 4) అఙ్గైః – అంగేన, అంగాభ్యామ్, **అంగైః,** అకారాన్త నపుంసకలింగ అంగ శబ్దము, తృ.బ., 5) భావమ్–**భావమ్**, భావౌ, భావాన్, అకారాన్త నపుంసకలింగ భావశబ్దము, ద్వి.ఏ., 6) వివృణ్వతీ–**వివృణ్వతీ**, వివృణ్వత్యౌ, వివృణ్వత్యః, ఈకారాన్త స్త్రీలింగ వివృణ్వతీ శబ్దము, ప్ర.ఏ., 7) చారుతరేణ–**చారుతరేణ**, చారుతరాభ్యామ్, చారుతరైః, అకారాన్త నపుంసకలింగ చారుతరశబ్దము, తృ.ఏ., 8) పర్యస్తవిలోచనేన–**...విలోచనేన**, ...విలోచనాభ్యామ్, ...విలోచనైః,అకారాన్త నపుంసకలింగ ...విలోచనశబ్దము,తృ.ఏ., 9)ముఖేన–**ముఖేన**, ముఖాభ్యామ్, ముఖైః, అకారాన్త నపుంసకలింగ ముఖశబ్దము, తృ.ఏ., 10) సాచీకృతా–**సాచీకృతా**, సాచీకృతే, సాచీకృతాః, ఆకారాన్త స్త్రీలింగ సాచీకృతాశబ్దము, ప్ర.ఏ., 11) తస్థౌ – క్రియ–స్థా+లిట్–ప్రథమ పురుషైకవచనాన్తః॥





**సమాసాలు:–**

1) శైలసుతా – శైలస్య సుతా (ష.త.) శైలసుతా।
2) స్ఫురద్బాలకదమ్బకల్పైః – బాలాశ్చ తే కదమ్బాః బాలకదమ్బాః (కర్మధా.) స్ఫురన్తశ్చ తే బాలకదమ్బాః స్ఫురద్బాలకదమ్బాః, ఈషత్ అసమాప్తాః స్ఫురద్బాలకదమ్బాః **స్ఫురద్బాలకదమ్బకల్పాని,** తైః, స్ఫురద్బాలకదమ్బకల్పైః
3) పర్యస్తవిలోచనేన – విశిష్టే లోచనే విలోచనే, పర్యస్తే విలోచనే యస్మిన్ (బహువ్రీహి) తత్, పర్యస్తవిలోచనం, తేన।
4) చారుతరేణ – అతిశయేన చారు చారుతరం, తేన చారుతరేణ।
5) సాచీకృతా – అసాచి సాచి యథా సమ్పద్యతే తథా కృతా సాచీకృతా, **చ్విప్రత్యయః।**

**సంధులు:–**1) శైలసుతా + అపి – శైలసుతాపి – సవర్ణదీర్ఘసంధిః।

**పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణాలు–కావ్యప్రయోగాలు:–**

1) **భావః** – a) 'సురతత్వరితమ్' అని 'సర్వశబ్ద' పేర్కొన్నది.

b) (పుం) భావయతి చిన్తయతి పదార్థానితి । భూ+ణిచ్+పచాద్యచ్। భవతీతి । భూ+'భవతేశ్చేతి వక్తవ్యమ్' ఇతి – మానసవికారః – హలాయుధకోశవ్యాఖ్య।

c) శ్లో॥ నాసతో విద్యతే **భావో** నాభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోన్తస్త్వనయోస్తత్త్వదర్శిభిః॥ – భగవద్గీత 2-16.

d) స్త్రీణాం యౌవనకాలే స్వభావజాష్టావింశత్యలంకారాన్తర్గతాంగజ –ప్రథమాలంకారః–

శ్లో॥ యౌవనే సత్త్వజాస్తాసామష్టావింశతిసంఖ్యకాః।
అలంకారాస్తత్ర **భావహావహేలా**స్త్రయోఽఙ్గజాః।

శ్లో॥ నిర్వికారాత్మకే చిత్తే భావః ప్రథమవిక్రియా। – ఇతి సాహిత్యదర్పణే.

శ్లో॥ సంచారిణః ప్రధానాని దేవాది విషయా రతిః।
ఉద్బుద్ధమాత్రః స్థాయీ చ భావ ఇత్యభిధీయతే॥ –ఇతి సాహిత్యదర్పణే 3-260

e) న కేవలం శివస్యైవ, పార్వత్యా అపి హావ ఉదిత – ఇత్యర్థః।
హావలక్షణం చ యథోక్తం సాహిత్యదర్పణే–

శ్లో॥ భ్రూనేత్రాదివికారస్తు సంభోగేచ్ఛాప్రకాశకః।
**భావ** ఏవాల్పసంలక్ష్యవికారో **హావ** ఉచ్యతే॥ ఇతి
- అని పుంసవనీ వ్యాఖ్య

f) "అత్ర దేవ్యాః శంకరే పూర్వముత్పన్నా రతిః సాభిలాషావలోకనవసన్తాదిభిరు-ద్దీప్యమానా రోమాంచోత్కణ్ఠాదిభిః సాత్త్వికవ్యభిచార్యాదిభిరనుబధ్యత ఇత్యవసేయమ్। - అని 'వివరణమ్' వ్యాఖ్య (నారాయణ పండితః)

g) శ్లో॥ స **భావః** కథ్యతే సద్భిస్తస్యోత్కర్షో రసః స్మృతః । - హలాయుధకోషః

**క్రియాదర్శము:-** **తస్థౌ** - ష్ఠా (స్థా) గతి నివృత్తౌ (నిలుచుట) భ్వాదిప్రకరణమ్(1) అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లిట్, ప్రథమపురుషైకవచనాంతః।

రూపాలు - **తస్థౌ**, తస్థతుః, తస్థుః।

శ్లో॥ ఇతి విజ్ఞాపితో రాజ్ఞా ధ్యానస్తిమితలోచనః।
క్షణమాత్రమృషిస్తస్థౌ సుప్తమీన ఇవ హ్రదః॥ - రఘువంశము 1-73

---

**శ్లో॥ అథేన్ద్రియక్షోభమయుగ్మనేత్రః**
**పునర్వశిత్వాద్బలవన్నిగృహ్య।**
**హేతుం స్వచేతోవికృతేర్దిదృక్షు-**
**ర్దిశాముపాన్తేషు ససర్జ దృష్టిమ్॥ 69**

**పదవిభాగము:-** అథ, ఇన్ద్రియక్షోభమ్, అయుగ్మనేత్రః, పునః, వశిత్వాత్, బలవత్, నిగృహ్య, హేతుమ్, స్వచేతోవికృతేః, దిదృక్షుః, దిశామ్, ఉపాన్తేషు, ససర్జ, దృష్టిమ్।

**అన్వయక్రమము:-** అథ అయుగ్మనేత్రః వశిత్వాత్ ఇంద్రియక్షోభమ్ పునః బలవత్ నిగృహ్య స్వచేతోవికృతేః హేతుం దిదృక్షుః దిశామ్ ఉపాన్తేషు దృష్టిం ససర్జ।

**ప్రతిపదార్థము:-** అథ-పిమ్మట, అయుగ్మనేత్రః-విషమాక్షుడగు శివుడు, వశిత్వాత్-జితేంద్రియుడగుటవలన, ఇంద్రియక్షోభమ్-ఇంద్రియముల వికారమును,పునః-మరల, బలవత్-బలముగా, నిగృహ్య-నివారించి, స్వచేతోవికృతేః-తన చిత్త వికారమునకు, హేతుమ్-కారణమును, దిదృక్షుః-చూడదలచుకొన్నవాడై, దిశామ్ -దిక్కులయొక్క, ఉపాన్తేషు-ప్రాంతములయందు, దృష్టిమ్-చూపును, ససర్జ-ప్రసరింపజేసెను.





**తాత్పర్యము :-** పిమ్మట, విషమాక్షుడగు శివుడు జితేంద్రియుడగుటవలన ఇంద్రియములవికారమును బలముగా నివారించి తన చిత్తవికారమునకు కారణమును చూడదలుచుకొన్నవాడై, దిక్కులయొక్క ప్రాంతములయందు చూపును ప్రసరింపచేసెను.

**విభక్తులు/క్రియలు:-**1) అథ, పునః-అవ్యయాలు, 2) అయుగ్మనేత్రః-**అయుగ్మనేత్రః**, అయుగ్మనేత్రౌ, అయుగ్మనేత్రాః, అకారాన్త పుంలింగ అయుగ్మనేత్రశబ్దము, ప్ర.ఏ., 3) వశిత్వాత్-**వశిత్వాత్**, వశిత్వాభ్యామ్, వశిత్వేభ్యః, అకారాన్త నపుంసకలింగ వశిత్వశబ్దము, పం.ఏ., 4) ఇంద్రియక్షోభమ్-**ఇంద్రియశోభమ్**, ఇంద్రియక్షోభౌ, ఇంద్రియక్షోభాన్, అకారాన్త పుంలింగ ఇంద్రియక్షోభశబ్దము, ద్వి.ఏ., 5) బలవత్-అవ్యయము, తద్ధితాన్తము, 6) నిగృహ్య- ని+గ్రహ్+క్త్వా - ల్యబన్త - అవ్యయము, 7) స్వచేతోవికృతేః - **...వికృతేః**, ...వికృత్యోః, ...వికృతీనామ్, ఇకారాన్త స్త్రీలింగ ...వికృతిశబ్దము, ష.ఏ., 8) హేతుమ్-హేతుమ్, హేతూ, హేతూన్, ఉకారాన్త పుంలింగ హేతుశబ్దము, ద్వి.ఏ., 9) దిదృక్షుః - దృశ్+సన్+ ఉప్రత్యయము, **దిదృక్షుః**, దిదృక్షూ, దిదృక్షవః, ఉకారాన్త పుంలింగ దిదృక్షుశబ్దము, ప్ర.ఏ., 10) దిశామ్-దిశః, దిశోః, **దిశామ్**, శకారాన్త స్త్రీలింగ దిక్ఛబ్దము, ష.బ., 11) ఉపాన్తేషు-ఉపాన్తే, ఉపాన్తయోః, **ఉపాన్తేషు** - అకారాన్తపుంలింగ ఉపాన్త శబ్దము, స.బ.,12) దృష్టిమ్-**దృష్టిమ్**, దృష్టీ, దృష్టీః-ఇకారాన్త స్త్రీలింగ దృష్టిశబ్దము, ద్వి.ఏ., 13) ససర్జ-క్రియ-సృజ్+లిట్ - ప్రథమ పురుషైకవచనాంతః।

**సమాసాలు:-**

1) అయుగ్మనేత్రః-న యుగ్మాని - అయుగ్మాని (నఞ్తత్పు.) అయుగ్మాని నేత్రాణి యస్య (బహువ్రీహి) సః।
2) ఇంద్రియక్షోభమ్-ఇంద్రియాణాం క్షోభః (ష.త.) ఇంద్రియక్షోభః, తమ్।
3) స్వచేతోవికృతేః - స్వస్య చేతః (ష.త.) స్వచేతః, స్వచేతసః వికృతిః (ష.త.) స్వచేతోవికృతిః, తస్యాః।

**సంధులు:-**1) అథ + ఇన్ద్రియక్షోభమ్ - అథేన్ద్రియక్షోభమ్ - గుణసంధిః
2) పునః+వశిత్వాత్-పునర్వశిత్వాత్ - విసర్గసంధిః।
3) వశిత్వాత్+బలవత్ - వశిత్వాద్బలవత్ - జశ్త్వసంధిః।
4) బలవత్+నిగృహ్య-బలవన్నిగృహ్య - అనునాసికసంధిః।
5) స్వచేతోవికృతేః+దిదృక్షుః - స్వచేతోవికృతేర్దిదృక్షుః - విసర్గసంధిః।
6) దిదృక్షుః + దిశామ్ - దిదృక్షుర్దిశామ్ - విసర్గసంధిః।

**పదవ్యుత్పత్తి-నిఘంటుప్రమాణాలు-కావ్యప్రయోగాలు:-**

1) **దిక్(గ్)** - a) 'దిశ అతిసర్జనే' 'ఋత్విగి'త్యాదినా క్విన్ షడగకాః ప్రాగ్వత్।

